# చరిత్రరచన

లేక

# చారిత్రకవ్యాసములు

ప్రథమభాగము

రచయిత

శ్రీ డాక్టరు నేలటూరు వేంకటరమణయ్యగారు,

ఎమ్. ఏ., పి. ఎచ్. డి.



వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

సంస్కృతాంధ్రగ్రంథప్రకాశకులు

4. మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీధి,

జార్జిటౌను, మదరాసు.

1948

# విజ్ఞప్తి

ఆంధ్రదేశ చరిత్రమునుగుఱించి శ్రీయుతులు చిలుకూరి వీరభద్రరావు, కొమఱ్ఱాజు లక్ష్మణరావు ప్రభృతులు గ్రంథములు రచించి యున్నారు గాని అవన్నియు నేటి నూతన చారిత్రక పరిశోధనలచే మార్పుం బడవలసియున్నవి. పైగా చరిత్రరచనావిధానమును విద్యార్థులకును జిజ్ఞాసువులకును శాస్త్రీయమార్గమున బోధించు గ్రంథములు లేనందునను ఈగ్రంథమును ప్రకటించుచున్నాము. శ్రీ నేలటూరు వెంకటరమణయ్యగారు సుప్రసిద్ధ చరిత్రకారులు వీరు ఆంధ్రదేశమును గుఱించియు దక్షిణభారతమును గూర్చియు వ్రాసిన వ్యాసము లసంఖ్యాకములు. వానిలో ముఖ్యమైనవానిని వీరి చారిత్రక కాలానుక్రమమున ప్రకటించితిమి. ఇందలి మొదటి వ్యాసము సామగ్రిని చరిత్రరచనా విధానమును విశదీకరించగా తర్వాతి యొక్కొక్క వ్యాసమును ఆయాసాధన సామగ్రితో చరిత్రను పునఃనిర్మించు విధమును విశదీకరించునదై యున్నది. ఆంధ్రపండితులు చరిత్రకారులుగాను చరిత్రకారులు భాషా పండితులుగాను ఏర్పడుచు, చరిత్రజ్ఞానములేని భాషాపాండిత్యమును, భాషాపాండిత్యములేని చరిత్రనిర్మాణమును పనికిరావని తెల్లమగు నీకాలమున 'నాటిని నేటినింగలుపు నాణెపుసంతెన'గా, ఉభయసామాన్యముగా నీగ్రంథమును ప్రకటించుచున్నాము. ఈవ్యాసములు తొలుత 'భారతి' యందు ముద్రింపబడినవి. వీని నీ పునర్ముద్రణమున కనుమతించిన భారతీసంపాదకులకు కృతజ్ఞులము.

1948. వే. వెం. శాస్త్రి అండ్ బ్రదర్స్.

# చరిత్రరచన.

## అవతారిక.

భరతఖండమున చరిత్రరచన గడచిన శతాబ్దికాలమున ప్రారంభ మైనది. సకలశాస్త్రములను, విద్యలను పరిశోధించి గ్రంథములు రచించిన మన పూర్వులేలనో చరిత్రరచన దలపెట్టరైరి. సంస్కృతవాఙ్మయమును గాలించి వెదకినను కల్హణవిరచిత రాజతరంగిణి తప్ప చరిత్రగ్రంథ మొక్కటియేనియు గానరాదు. రాజతరంగిణియైనను భరతఖండచరిత్రను దెల్పదు; కాశ్మీరదేశము నేలిన రాజవంశముల చరిత్రమాత్ర మిందు గలదు. మహమ్మదీయుల యాగమనానంతరము చరిత్రరచన యారంభమైనది. చరిత్రదృష్టి వీరియందు గానవచ్చినట్లన్యులయందు గానరాదు. వీరి రాజభాషయైన పారసీయందును, మతభాషయైన యరబ్బియందును పెక్కు చరిత్రగ్రంథములు రచింపబడెను. ఆద్యమున నీచరిత్రకారు లందఱును మహమ్మదీయులేయైనను గాలక్రమమున వీరిచే నుద్బోధితులై హిందువులును జరిత్రరచనకు గడంగిరి. ఇప్పటిపరిశోధకులు తమ పరిశోధనగ్రంథముల నాంగ్లభాషయందు రచించునట్లప్పటివారు పారసీయందే తమ చరిత్రగ్రంథములను రచించిరి. తురకరాజుల యేలుబడి యుండునంతకాలము నీగ్రంథములను జదువుటకు విద్యావంతులకు సాధ్యమైనను దురకరాజ్యము పోయిన పిమ్మట నివి మృతప్రాయము లైనవి. ఇప్పటివారియం దనేకులకు పారసీ యరబ్బీభాషలయం దుండు విస్తారచారిత్రకవాఙ్మయ మపరిచితము. కాని మన ప్రాచీనచరిత్రమునుగూర్చి

---

ఇది ౨౬వ ఆంధ్రసారస్వతపరిషత్సమావేశసందర్భమున చరిత్రపరిశోధకుల సభయందు చదువబడిన యధ్యక్షోపన్యాసము.

# విషయసూచిక.


| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| అవతారిక | ... | ... | 1 |
| సాధనసామగ్రి—రాక్షసగుళ్లు | ... | ... | 3 |
| చారిత్రక యుగశాస్త్రములు | ... | ... | 5 |
| పురాతన వస్తుపరిశోధనశాఖ | ... | ... | 6 |
| స్తూపములు 10. దేవాలయములు, కోటలు | ... | ... | 13 |
| శాసనములు 14 వాఙ్మయము 21. నాణెములు | ... | ... | 24 |
| ౧ ఆంధ్రశాతవాహనులు | ... | ... | 26 |
| ౨ పల్లవు లెవ్వరు? | ... | ... | 40 |
| 3. పల్లవవంశక్రమము | ... | ... | 65 |
| వీరకూర్చమహారాజు | ... | ... | 93 |
| శివస్కందవర్మ క్రీ. శ. 310-335. | ... | ... | 96 |
| కాంచీపురము: ప్రాచీనపల్లవరాజధాని | ... | ... | 100 |
| విష్ణుగోపుడు క్రీ. శ. 335-360. | ... | ... | 101 |
| ౪. పల్లవులు | ... | ... | 113 |
| మొదటి కుమారవిష్ణువు | ... | ... | 113 |
| మొదటి సింహవర్మ క్రీ. శ. 435-460 | ... | ... | 114 |
| రెండవ స్కందవర్మ క్రీ. శ. 460. 475 | ... | ... | 117 |
| మొదటి నందివర్మ ,, 485-510 | ... | ... | 118 |
| త్రిలోచనపల్లవుడు | ... | ... | 119 |
| ౫ కరికాలచోళమహారాజుల శాసనము | ... | ... | 129 |
| మంగళేశ్వరుడు | ... | ... | 139 |
| మంగళేశుని రాజ్యాభిషేకము | ... | ... | 143 |




# చరిత్ర రచన*

## అవతారిక.

భరతఖండమున చరిత్రరచన గడు నర్వాచీనకాలమునం బ్రారంభమైనది. సకలశాస్త్రములను, విద్యలను పరిశోధించి గ్రంథములు రచించిన మన పూర్వీకులేలనో చరిత్రరచన దలపెట్టరైరి. సంస్కృతవాఙ్మయమును గాలించి వెదకినను కల్హణవిరచిత రాజతరంగిణి తప్ప చరిత్రగ్రంథమొక్కటియేనియు గానరాదు. రాజతరంగిణియైనను భరతఖండచరిత్రను దెల్పదు; కాశ్మీరదేశము నేలిన రాజవంశముల చరిత్రమాత్రమిందు గలదు. మహమ్మదీయుల యాగమనానంతరము చరిత్రరచన యారంభమైనది. చరిత్రదృష్టి వీరియందు గానవచ్చిన ట్లన్యులయందు గానరాదు. వీరి రాజభాషయైన పారసీయందును, మతభాషయైన యరబ్బీయందును పెక్కు చరిత్రగ్రంథములు రచింపబడెను. ఆదేశమున నీచరిత్రకారు లందఱును మహమ్మదీయులేయైనను గాలక్రమమున వీరిచే నుద్బోధితులై హిందువులును జరిత్రరచనకు గడంగిరి. ఇప్పటిపరిశోధకులు దమ పరిశోధనగ్రంథముల నాంగ్లభాషయందు రచించున ట్లప్పటివారు పారసీయందే తమ చరిత్రగ్రంథములను రచించిరి. తురకరాజుల యేలుబడియుండునంతకాలము నీగ్రంథములను జదువుటకు విద్యావంతులకు సాధ్యమైనను దురకరాజ్యము పోయిన పిమ్మట నివి మృతప్రాయములైనవి. ఇప్పటివారియందనేకులకు పారసీ యరబ్బీభాషలయందుండు విస్తారచారిత్రకవాఙ్మయము సుపరిచితము. కాని మన ప్రాచీనచరిత్రనుగూర్చి

---

* ఇది ౨౭.వ ఆంధ్రసారస్వతపరిషత్సమావేశసందర్భమున చరిత్రపరిశోధకుల సభయందు చదువబడిన యధ్యక్షోపన్యాసము.

దీనివల్ల నేమియు దెలియరాదు. మహమ్మదీయ చరిత్రకారులును, వారి ననుసరించి పారసీయమున లేఖులను రచియించిన హిందువులును మహమ్మదీయరాజుల చరిత్రలను వ్రాసిరే కాని హిందువుల విషయము ప్రస్తావించరైరి. పూర్వమహమ్మదీయహిందూచరిత్ర వారి కపరిచితమగుటచే వారు తమకు పరిచితమైన మహమ్మదీయ చరిత్రమునే వ్రాసిరని కొందఱు చెప్పవచ్చును. పూర్వమహమ్మదీయ యుగమున కిది యొకవేళ చెల్లుబడియైనను మహమ్మదీయులనాటి హిందూరాజ్యముల విషయమై యిట్లు చెప్పుటకు వీలులేదు. ఒకటి రెండుదాహరణము లీయంశమును తెల్లము సేయగలవు. మహమ్మదు కాసిం ఫెరిస్తా యనునతడు "తారీఖ్-ఉల్-హింద్" అను చరిత్రగ్రంథమును రచించెను. హిందూదేశమునందలి సర్వమహమ్మదీయసంస్థానముల చరిత్రయు నిందు వర్ణింపబడియున్నది; కాని రమారమి మూడువందలయేండ్ల పర్యంతము వెలసిన విజయనగర సామ్రాజ్యచరిత్ర యిందు కానరాదు. ఫెరిస్తా మహమ్మదీయుడైన కారణమున నతడు హిందూసామ్రాజ్యమైన విజయనగరచరిత్రను వ్రాయక వదలిపెట్టెనని యనుకొందము. హిందూచరిత్ర రచయితలయెడ నీ సమాధానము చెల్లదు. లక్ష్మీనారాయణ, చంద్రభాను మున్నగువారు వ్రాసిన చరిత్రగ్రంథములయందు కూడ మహమ్మదీయ రాజ్యకథనమే కానవచ్చును. హిందూసంస్థానముల చరిత్ర యెందును గానరాదు. ఇటువంటి లోపము లున్నను మహమ్మదీయయుగమునకు చరిత్రలు గలవు; అప్పటి చరిత్రాంశములు చాలమట్టుకు వీనిమూలమున దెలియవచ్చుచున్నవి.

పూర్వమహమ్మదీయ యుగమునకు చరిత్రగ్రంథములే లేవు. హిందువుల యేలుబడిక్రింద నేమి జరిగినదో తెలుపుగ్రంథములు ప్రాచీన విరచితము లెవ్వియు లేవు. చరిత్రగ్రంథములు లేకపోయినంతమాత్రమున భరతఖండమునకు చరిత్రయే లేదని చెప్పుట తగదు. కాలగర్భమున

బూడిదపోయిన ప్రాచీనభారతీయ చరిత్ర నుద్ధరించుటకు మార్గము గలదు. చరిత్ర గ్రంథములను వ్రాయకపోయినను మన పెద్దలు చరిత్రరచనకు వలయు సాధనముల ననేకములను మనకు బ్రసాదించియున్నారు. ఈ సాధనముల నన్నిటిని సేకరించి పరిశీలించి చూచినచో బ్రాచీనకాలమున హిందువుల యేలుబడిక్రింద నడచిన చరిత్ర కాలవలను వ్యక్తము గా గలదు. సాధనసంపాదనార్థము దేశసంచారము జేసి, లభించిన చరిత్ర సామగ్రిని సమకూర్చుటయును, సమకూర్పబడిన సామగ్రిని శాస్త్రసమ్మత పద్ధతుల ననుసరించి విమర్శించి గ్రంథరచన సేయుటయును చరిత్రపరిశోధన యని పేరు.

## సాధనసామగ్రి.

పైని జెప్పబడిన చరిత్రసాధనములను చరిత్రరచయితలు నాలుగు తరగతులుగ విభజించియున్నారు. అందు మొదటిది పురాతనవాస్తునిచయము. వాస్తువనగా కట్టడములు. పురాతనవాస్తువులు పెక్కు తెలుగులవి కానవచ్చుచున్నవి. చరిత్రపరిశోధన సౌకర్యమునకై వీనిని పూర్వచారిత్రక, చారిత్రకయుగవాస్తువులని రెండుతరగతులుగ విభజింపవచ్చును. మానవచరిత్రయందు లిపియుత్పత్తికి ముందు గడచిపోయిన కాలమునకు పూర్వచారిత్రకయుగ మని పేరు. ఈ యుగము ప్రాచీనతమము; దీనికి జెందిన కట్టడములను పూర్వచారిత్రకయుగ వాస్తువు లందురు; వీని యందు పలువిధములు గలవు. ముఖ్యమైన వానికి రాక్షసగుళ్లని ఆంధ్రులు నామకరణము జేసియున్నారు. అరవలు పాండవగుళ్లందురు; మళయాళ మున టోపికల్లని చెప్పుదురు.

### రాక్షసగుళ్లు.

రాక్షసగుళ్లు ఆంధ్రదేశమున పెక్కుతావులయందు గానవచ్చు చున్నవి. బెజవాడ పరిసరప్రదేశములం దనేకము గలవని వినికిడి.

'రాక్షసగుళ్లు' అను పేరునుబట్టి రామాయణాది ప్రాచీనగ్రంథములందు వర్ణింపబడిన రాక్షసులు నిర్మించుకొన్న దేవాలయములని యభిప్రాయము గలుగవచ్చును. కాని ఇవి గుళ్లును గావు; రాక్షసులతో వీనికి సంబంధమును లేదు. రాక్షసగుళ్లను పరిశోధించి చూచిన పురాతన వాస్తుశాస్త్రజ్ఞు లందఱును ఇవి సమాధులని నిశ్చయించియున్నారు. ఇట్టి సమాధులను మృతశరీరనిక్షేపణముకొఱకు ఆర్యుల యాగమనమునకు ముందు మన దేశమందు నివసించుచుండిన ఆదిమజనులు నిర్మించుకొనెడివారని పరిశోధకులు సామాన్యముగ నభిప్రాయపడుచున్నారు. కాని ఇది సంశయగ్రస్తము ఋగ్వేదమునందును, శతపథ బ్రాహ్మణమునందును ఇట్టి సమాధుల వర్ణన గలదు. దీనిబట్టి యార్యుల యందును నిట్టి సమాధులను నిర్మించుకొను నాచార ముండెడిదని తెల్లమగుచున్నది. కావున నీ రాక్షసగుళ్లు సర్వత్ర యనార్యజాతులవారివని నిస్సంశయముగ బల్కుట సమంజసము గాదు. ఈవిషయ మెట్లున్నను రాక్షసగుళ్లు మన యాదిమయుగచరిత్రను పునరుద్ధరించుట కమూల్యమైన సాధనము లనుట నిస్సందేహము. ఈ రాక్షసగుళ్లను నిర్మించిన వారు శవముతోగూడ నా మృతజనుడు జీవదశయందు వాడుకొనుచుండిన యాయుధములను, కొలముట్లను, ప్రియపదార్థములను, ఆహార పదార్థములను, వస్తువాహనభూషణాదులను బూడ్చిపెట్టెడివారు. ఈ యాచార మాధునికచరిత్రపరిశోధకుల కత్యంతోపయుక్తమైనది. రాక్షస గుళ్లయందు నిక్షిప్తమైన వస్తుసముదాయము నాధారముజేసికొ యప్పటి జనుల నాగరికతను, సంస్కృతిని, మతసాంఘిక వార్తికపరిస్థితుల గనుగొనుటకు సాధ్యమైనది. పైజెప్పినట్లు ఆంధ్రదేశమున 'రాక్షసగుళ్లు' దత్సంబంధమైన యితరవాస్తువిశేషములును పలుతావుల గానవచ్చుచున్నను, వాని పరిశోధన ఇంకను ప్రారంభము కాలేదు. అచట నచట

ఇండియాప్రభుత్వమువారి పిసినిగొట్టుతనము ధనము వెచ్చబెట్టక కార్యము సాగదు. ఇరుసున గందెన బెట్టక పరమేశ్వరు బండియైన పారదట. ఇండియా దొరతనము కారులు సాగునా? వేలకొలది రూప్యముల వేతనములనిచ్చి యధికారులపై నధికారుల నియమించిన నేమి లాభము? చిత్రకళా విశారదులను బిలిపించి, వారికి వలయుసామగ్రుల నిచ్చి, వలయు సౌకర్యములను గలుగజేసి సంరక్షణా కార్యమునకు బురికొల్పిన గాని మాసిపోవుచున్న ఈచిత్రములు నిలువవు. ఈ సందర్భమున మన దేశీయసంస్థానాధిపతులు గొందఱు ప్రశంసార్హులు. దక్షిణాపథమున వీరిలో మొదట నెన్నదగినవారు హైదరాబాదు పాలకులు మ. ఘ. వ. నైజాము ప్రభువులు. మహారాష్ట్రకర్ణాటకమండలములలో గించిద్భాగము వీరి యేలుబడిక్రింద నున్నను వీరిని తెలుగుప్రభువులనియే చెప్పవలయును. రాజధానియగు హైదరాబాదు తెలుంగాణ్యమునకు హృదయమువంటిది. ఆ మాట నటుండనిండు. వీరి పాలనక్రింది దేశము ముప్పాతికవంతు ఆంధ్రమండలములోనిది. జనసంఖ్యనుబట్టి చూచినను వీరి ప్రజలలో నాంధ్రులసంఖ్యయే అధికము ఈతెలుగుప్రభువు ప్రాచీన చిత్రకళను, నశించి నామమాత్రావశిష్టమైపోనీయక, వేలకొలది ద్రవ్యమును వెచ్చపెట్టి స్వదేశజులను, విదేశీయులను చిత్రకళాభిజ్ఞులను రావించి వాని గాపాడుటకు దగునేర్పాటులను గావించెను. వీరి ప్రాచీన వస్తుసంరక్షణాభిరతి కజంతాయెల్లోరాగుహాలు ప్రబల నిదర్శనములు. దీని కాంధ్రులమైన మనము గర్వపడవలసినదే. ఇట్లే రాజ్యము చిన్నదైనను, వరుంబడి యపారము గాకున్నను, అరవదేశమున పుదుక్కోట మహారాజులవారు విశేషధనము ఖర్చుచేసి చిత్తనవాసిల్ గుహాలను కాపాడుచున్నారు. వీరికి గల ప్రాచీనవస్తుసంరక్షణాభిమానము ధనాధిపుల కుండిన నెంతయో మేలు గలుగగలదు.

చిత్రములు లేని గుహ లుపయోగహీనము లని యనుకొనరాదు. చిత్రము లున్నను లేకపోయినను సర్వసామాన్యముగ గుహాలన్నిటి లోపలను నద్భుతములగు శిలాబింబములు గలవు. వీనిని సామాన్యముగ శిల్పములని చెప్పుదురు శిల్ప మను మాట లలితకళల కన్నిటికి జెల్లును. మఱియు నీమాటను రచనాకౌశల మను నర్థమున వాడుటయు గలదు. శిలలను మలిచి వానికి రూపేర్పఱచు విద్యనే శిల్పమని చెప్పుట యుక్తముగాదు. ఈవిషయమును గ్రహించిన మన పెద్దలు శిలలను ఛేదించి రూపుగల్పించు విద్య కొక ప్రత్యేకనామము నేర్పఱచియున్నారు. మలిచి చేయబడిన శిలాబింబములకు గండారములు, లేక గండారపుబొమ్మలని పేరు పెట్టియుండుటచే, దీనిని గండరుశిల్ప విద్యయని వారనుకొనినట్లు తోచుచున్నది. ఈగండరవుల జూచి మన యప్పటి విషయములను దెలిసికొనవచ్చును. అన్నిటికంటె అప్పటి కాసెపనివారి కౌశల్యమును, శిలాఛేదనవిద్య యౌన్నత్యమును మనకు తెల్లము కాగలదు. అప్పటి కాసెపనివారిని జూచి శిల తన స్వభావసిద్ధమైన కర్కశత్వమును మాని మార్దవము నందినది. వారిచేయి సోకగనే బంకమట్టివలె, మైనమువలె, వెన్నవలె మెత్తనై యేరూపము గమ్మనిన వారి యాజ్ఞను మీఱనేరక యారూపమును బొందినది. మహాబలిపురమునకు బొందు; బాదామికి, ఎల్లోరకు, మఱి యేకాలమున దొలువబడిన యేగుహాకైనను బొండు. అచటి గండారముల సముఖమున నిలువుడు. అవి అనిర్వాచ్యమైన సమ్మోహనాపూరమున మిమ్ము ముంచి బహిః ప్రపంచమును మఱపించి యొక సౌందర్యలోకమునకుగొనిపోయి యానందబ్రహ్మయందు లీనులజేసి తన్మయత్వము జెందించును. అచేతనములయ్యు మీసంగతివల్ల చేతనత్వము నందినట్లును, నచలములయ్యు మిమ్ము గాంచి చలనములై మి మ్మాహ్వానించుట కెదురు వచ్చుచుండునట్లును, మూకములయ్యు మీతో నవ్యక్తమధురవాక్కుల

సంభాషించుచుండునట్లును, బధిరములయ్యును మీవాక్యామృతమును గ్రోలి యీ యానందమును సుందరముందహాసమువలన వెలిబుచ్చుచున్న ట్లును దోచగలదు. ఇట్టిగండారపుబొమ్మలు మొన్న మొన్నటివఱకు బెజవాడసమీపమున నుండినవి. ఇవి కడు ప్రాచీనములు. వీనిని క్రీ. శ. ౬-వ శతాబ్దమునా డీప్రాంతముల నేలుచుండిన విష్ణుకుండిమహారాజులు చెక్కించిరని పరిశోధకపండితమహాశయు లభిప్రాయములను వెలిబుచ్చి యున్నారు. ఇవి నేడు రూపఱి పాడైపోయినవి. ఆంధ్రుల దురదృష్టము వలన—చెప్పిన కోపము వచ్చునేమో, నిజముగుటచే జెప్పకతప్పదు—బెజ వాడ పౌరశ్రేష్ఠులకు వానిని బాగుచేయవలయు ననుబుద్ధి పుట్టినది; వారి కోరిక ప్రకారము కార్యము సాగింపవచ్చునని యుత్తరువు ప్రసా దించుట కప్పటి సర్కారు పురాతనవస్తుపరిశోధనశాఖాధ్యక్షునకు సమ్మతమైనది. ఫలితము చెప్పుటకు నోరాడదు. ఈ యమూల్యమైన ప్రాచీనగండారప్రదర్శనశాల నాశమైనది. నిజమే, ఇప్పుడును శిలా బింబము లచట గలవు. కాని వాని ప్రాచీనత కలలోని వార్త యైనది. ఆ శిల్పాచార్యుల విద్యావైభవము, ప్రతిమల సౌందర్యము, పనితనంపు సొంపు మంట—కాదు, కాదు, సిమెంట—గలసిపోయినవి. ప్రస్తుత మచ్చట గల ప్రతిమల వికారరూపములను, అంగవైకల్యమును, లింగాంతరీకరణ ములను గాంచిన నేపురాతనవస్తుపరిశోధకుని హృదయము రగులుకొని పోదు? బెజవాడ యాంధ్రదేశములోని ప్రాచీనతమపురములలో నొకటి. విష్ణుకుండిప్రభువుల కాలమునుండియు బ్రఖ్యాతి వహించినది. పూర్వచాళుక్యులకు రాజధాని. ఇందు ప్రాచీనాంధ్రనాగరికతావశిష్టము లనేకములు గలవు; ఆంధ్రుల పూర్వచరిత్రను రచించుట కివి ముఖ్యసాధ కము లగును. కావున బెజవాడ పురజనులకు చరిత్రపరిశోధకుల పక్ష మున నా వేడికోలిది. "అయ్యలారా, మీ పురమందు గల పూర్వనాగ

రికచిహ్నములు బాగుసేయ దలపెట్టకుడు. వాని బాగుసేయు మార్గము మీకు దెలియదు. పురాతనవస్తు సంచయమును జెడిపోనీయక గాపాడ వలయునను మీకోరిక ప్రశంసనీయమైనదే. వానిం గాపాడవలయు నను కోరిక దృఢమైనదేని, వానిని సురక్షించుమార్గము నెఱిగినవారిని రప్పించి వారి యాజమాన్యమున కార్యము నడపింపుడు. అప్పుడు లోక చరిత్ర పరిశోధకులకే కాక సకలాంధ్ర ప్రపంచమునకును మహోపకార మొన ర్చినవా రగుదురు".

## స్తూపములు.

స్తూపము అనగా మట్టి మొదలగువాని దిబ్బయని శబ్దరత్నాకర కారు లర్థము జెప్పియున్నారు. ఈమాట కిదియే మొదటి యర్థమైనను బౌద్ధవాస్తు విశేషమున కీపేరు రూఢియైనది. శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ గారు స్తూపస్వభావము నిట్లు వివరించియున్నారు "బౌద్ధవాస్తువును ఇటికతోనో, ఱాతితోనో కట్టిన అర్ధగోళాకారమువంటి ఘననిర్మాణమునకే స్తూపమను పేరు రూఢియగుటవలన, దిబ్బయైనదెల్ల స్తూపము కాజాలదు. ఈ నిర్మాణము బౌద్ధమతము వాస్తువునకు ప్రసాదించిన విశేషము."మృత శరీరావశేషములపై నిర్మింపబడిన కట్టడములకే స్తూపమను పేరు అన్వయ మగును. బౌద్ధులు బుద్ధునియొక్కయు, నతని యనుయాయులలో ప్రము ఖులయొక్కయు శరీరావశేషములను భూస్థాపితము గావించి వానిపై నీ స్తూపములను నిర్మించి యర్చించుట యాచారము. క్రీస్తు శకమున కించుక పూర్వమును. దరువాతను ఆంధ్రదేశమున బౌద్ధమతము ప్రబలి జన సామాన్యము బౌద్ధధర్మము నవలంబించుటచేత దేశమంతటను స్తూపము లును, వీనితోగూడ చైత్యాలయములు, సంఘారామములును నిర్మింప బడినవి. కాలక్రమమున బౌద్ధమతము నశించి హిందూధర్మము మరల

తలయెత్తి మతద్వేషకారణమునను, అన్యకారణములవల్లను బౌద్ధవాస్తువులు రూపఱిపోయినను వాని యవశిష్టములు దేశమందంతటను గానవచ్చుచున్నవి.

ఇట్టి యవశిష్టములు గల తావులను గొన్నింటిని పేర్కొనియెదను. చిరకాలమునుండి చరిత్రపరిశోధకులకును, కళావిమర్శకులకును, పరిచితమైనది అమరావతి స్తూపము. ఇందలి చెక్కడపుంబని చక్కదనమును, శిలాబింబముల సౌందర్యాతిశయమును జగద్విఖ్యాతము. ప్రాచీనాంధ్రుల శిల్పనైపుణ్యము నివి వేనోళ్ల జాటును. ఇటీవల బయల్పడినవి నాగార్జునునికొండలోని సంఘారామాదులు. శిల్పసృష్టిని జూచిన నివి యమరావతికి దీసిపోవు. ఇందలి కళ జీవకళ. శిల్పి జాతికి సర్వాంగసుందరమైన రూపొసగి, నిజహృదయాంతర్గతభావమునందు లగ్నముగావించి, యూపిరిపోసి, యొక మాయాప్రపంచమును గల్పించినాడు. అమరావతిశిల్పములు పరహస్తగతమైనవి. కొన్ని యింగ్లాండున, మఱికొన్ని యరవదేశమున నున్నవి నాగార్జుననికొండ శిల్పములుగూడ పరదేశయాత్ర సేయ నుంకించుచున్నవి. వానిని బోనీక నిలువబెట్టవలసిన భార మాంధ్రమహాజనులపై నున్నది. ఘంటశాల, భట్టిప్రోలు స్తూపములు ప్రాచీనతరములు. ఇవి మౌర్యయుగమునకు జెందినవని కొందఱి యభిప్రాయము. అజ్ఞాతములైన స్తూపము లనేకస్థలములందు గలవు. వీనిని వెదకి యానవాలుపట్టి త్రవ్వి యందలి విశేషవస్తువులను బయటపెట్టవలసిన పని సర్కారువారు చేయదగినదేకాని సామాన్యులకు సాధ్యముగాదు. కాని వా రీవిషయమున నింతవఱకు జేసిన ఘనకార్య మెద్దియు గానరాదు. పురాతనవస్తుపరిశోధకశాఖవారికి దక్షిణదేశముపై సవతితల్లి ప్రేమ. ఇక నాంధ్రదేశముమాట చెప్పవలయునా? అమరావతి, నాగార్జుననికొండల మాట జెప్పవత్తురేమో. ఇవి బుద్ధిపూర్వక

ముగ నీశాఖవారు పూనుకొన్న కార్యములు గావు. ఎవ్వరో జమీందారు గృహనిర్మాణసామగ్రికై యమరావతిస్తూపమును బడగొట్టి పాడు చేయుచుండ కర్ణాకర్ణిగ విని సర్కారుద్యోగస్థు లడ్డపడి జమీందారుని కడకను మాన్పి యచట గానవచ్చిన చెక్కడపుశిలల పనితనమునకును, గండారపు బొమ్మల చక్కదనమునకును మెచ్చుకొని పరిశోధనకు గడగిరి. గజదొంగ యని పేరువడసిన పరాసుదొర యొకడు ఆంధ్రదేశమునంతటను సంచరించి నాగార్జునునికొండను గుర్తించి యందలి యద్భుతశిలాప్రతిమలను దస్కరించికొనిపోవుచున్నాడని విని పోయి యచట ద్రవ్వనారంభించిరి. ఇచటనైనను సంపూర్ణముగ పని ముగియలేదు. వీరి పద్ధతి తిరుపతి మంగలవాని పద్ధతియైనది. నాగార్జునునికొండలో పని సంపూర్తి చేయుటకు డబ్బులేదట. పనిసాగించుటకు డబ్బులేనప్పుడు వేలకొలది మాసజీతముల నిచ్చి తెల్లదొరలను, సీమదొరలను రప్పించుట యేలనో! అమరావతి స్తూపము చెంత నాస్తూపనిర్మాతలగు నాంధ్రసాతవాహనుల రాజధానియగు ధాన్యకటకము వెలసెను. ఆస్థలమును ద్రవ్వి పరిశోధించిచూచిన సాతవాహనులనాటి యాంధ్రదేశ స్థితిగతులు దెలియగలవు. ఈయుద్దేశము సర్కారుపురాతనవస్తుపరిశోధనశాఖవారికి దోచినట్లే కానరాదు. పురాతనచారిత్రకస్థలము లీదక్షిణదేశమునం దెన్ని లేవు? కళింగనగరము, రాజమహేంద్రవరము, వెంగి, బెజవాడ, కొండవీడు, హంపి, వల్లూరు, గండికోట, చంద్రగిరి, కంచి, మహాబలిపురము, కావేరిపూంబట్టణము, తంజావూరు, ఒరైయూరు, తిరుచనాపల్లి, కన్ననూరుకుప్పము, మధుర మొదలైన వెన్నియో కలవు ఒకచోటనైన సర్కారుపురాతన వస్తుపరిశోధనశాఖవారు పాతెడు మట్టిని త్రవ్విరా ? లేదు. వారి కట్టి యుద్దేశ ముండునట్లే తోచదు. ఈ పురాతనస్థలముల క్రింద పూడియుండు మన పూర్వచరిత్రను బయటికి దెచ్చుట యెట్లు ?

ఆంధ్రలోకమంతయు నేకగ్రీవముగ సర్కారువారిని మందలింపవల యును. అప్పుడైన నడుగనిది పెట్టదను సామెత నిరర్థకము గాదు.

దేవాలయములు.

దేవాలయములు స్తూపములంతటి ప్రాచీనములు గావు. అనాదిగ హిందువులు దేవాలయములను నిర్మించుచువచ్చినను, దక్షిణ దేశమున నిప్పుడు గానవచ్చెడి దేవాలయములన్నియు క్రీ. శ. 2-వ శతాబ్దమునకు దరువాతివే. తత్పూర్వము నిర్మింపబడిన దేవాలయములు మచ్చున కొక్కటేనియు గానరావు. స్తూపములకంటె నివి యర్వాచీనములైనను చారిత్రకదృష్టియందు తుల్యములే. బౌద్ధయుగ చరిత్రరచన కవి సాధనములైన దరువాతి హిందూయుగచరిత్రరచన కివి సాధనములు. ఇవి హిందూజాతీయజీవనమునకు కేంద్రస్థానములు; ప్రజాప్రభుత్వసంస్థలు; కళానిలయములు. వీని యాకారమువల్లను, వీనియందు సామాన్యముగ గానవచ్చు శిలాప్రతిమాదుల రచనావిశేషమువల్లను జరిత్రయందు ముఖ్యాంశము లనేకములు దెలియుచున్నవి. పెక్కు ప్రాచీన దేవాలయములయందు చిత్రములు గలవు. అన్నిటియందును శాసనములు గలవు. వీని మూలమున నప్పటి మత సాంఘిక ఆర్థికపరిస్థితులును, రాజకీయవిషయములును జక్కగ దెలియుచున్నవి. కావున మన దేవాలయములు ప్రాచీనవస్తుభాండారములు. ఖిలపడిపోనీయక వీనిని సంరక్షించుట మనవిధి.

కోటలు.

ప్రాతకోటలు మన దేశమునం దెల్లయెడల గానవచ్చుచున్నవి. అనుకూలమైన తావులలో వీనిని విఱుగబొడిచి యందలి రాలను గృహానిర్మాణార్థము గొనిపోవుట మనవారికి సహజమైపోయినది. ఇది

స్వార్థమునుగోరి యజ్ఞానమువలన జేయుపని. చరిత్రలోని యతిశయము నెఱుగని జను లట్లుచేయుచున్నారు. దేశసంరక్షణకును, శత్రువులను బ్రతిఘటించి యుద్ధముసేయుటకును పూర్వకాలమున మనవా రెట్టి యేర్పాటులను జేయుచుండిరో వీనిమూలమున జాలవఱకు దెల్లమగును; విజయనగరము, పెనుగొండ, గండికోట, కొండవీడు, కొండపల్లి, ఓరుగల్లు, గోలకొండ మొదలగు దుర్గములను గాంచినవారికి వీని ప్రాముఖ్యత స్పష్టము కాగలదు. అత్యంతప్రాచీనములగు ప్రాసాదములుగాని, గృహములుగాని యనేకములు గానరావు. అచటనచట గొన్ని కానవచ్చుచున్నను నవి శిథిలావస్థయం దున్నవి. బాగుచేయదొడగి కొన్ని చోట్ల సర్కారు పి. డబ్ల్యు. డి. శాఖవారు వీనిరూపును చెడగొట్టియున్నారు; సర్కారువారు కొన్ని ప్రాచీనమందిరములను కచేరీలుగ మార్చి చరిత్ర కెంతయోనష్టము గలుగజేసియున్నారు. మధురయందు తిరుమలనాయకుని నగరు, తంజాపురమునందలి నాయకుల ప్రాసాదములు, పెనుగొండయందలి కృష్ణరాయని గగనమహలు, చెన్నపురిలోని యార్కాటు నవాబుకలశమహలు దీని కుదాహరణములు. ఇవి రూపు చెడకయుండిన విజయనగరరాయలు, దాక్షిణాత్యాంధ్రనాయకులు, అర్కాటు నేలిన మహమ్మదీయప్రభువులు దమ యంతఃపురములయం దెట్లు ప్రవర్తించుచుండిరో తెలిసికొనుట కవకాశ ముండెడిది.

## శాసనములు.

ఇంతవఱకును బురాతనవాస్తునిచయ మెట్లు చరిత్రరచనకు దోడ్పడునో విన్నవించితిని. తరువాత చెప్పదగినవి. శాసనములు. ఇవి ద్వివిధములు: లౌహికములు, శైలికములు నని. హేమాదిలోహములపై జెక్కబడిన శాసనములకు లౌహికములని పేరు. సర్వసాధారణముగ దానశాస

ములను తామ్రపట్టికలమీదనే చెక్కుట యాచారము; కాని కాదా చిత్కముగ బంగారు వెండి రేకులపై జెక్కిన శాసనములును గాన వచ్చు చున్నవి. మఱియు ఢిల్లీయందొక పెద్ద ఇనుప స్తంభముపై జెక్కిన శాసన మొకటి కలదు. శిలలపై జెక్కబడిన శాసనములు శైలికము లనబడును. రత్నములపై జెక్కిన సామాతులరాదు లచట నచట గానవచ్చుచున్నవి. ఇట్టి శిలాలేఖనములు గూడ శైలికములని పేర్కొనదగియున్నను, సాధారణముగ నీపేరు సామాన్యశిలలపై జెక్కబడిన శాసనములకే చెల్లు చున్నది.

## లౌహికములు.

శైలికములకంటె లౌహికశాసనసంఖ్య యత్యల్పము. కాని పల్లవకదంబగాంగచాళుక్యాది ప్రాచీనదాక్షిణాత్య రాజవంశముల చరిత్ర లన్నియు ముఖ్యముగ లౌహికశాసనములమీదనే యాధారపడియున్న వి. చరిత్రపరిశోధకులును, మదరాసుసర్కారు శాసన పరిశోధనశాఖ వారును పెక్కింటిని సంపాదించి ప్రకటించియున్నారు.

లౌహికశాసనముల విషయమై ఇచట చెప్పదగినముఖ్యాంశములు రెండు కలవు. మొదటిది సంపాదితశాసనసంరక్షణార్థమై సర్కారు పురాతనవస్తు పరిశోధకశాఖవా రవలంబించిన పద్ధతినిగురించి. మొన్న మొన్నటి వఱకు దక్షిణదేశమున లభ్యమైన లౌహికశాసనముల నన్నిటిని మదరాసు సర్కారు వస్తుప్రదర్శనశాలవారిచే క్రయమునకు గొనిపించి యందే పదిలపఱచునట్లు సేయువారు. ఇది సమంజసమైన పద్ధతియే. నేటివఱకును దక్షిణదేశమున కంతటికిని అది రాజకీయకేంద్రస్థానముగ నున్నది. దాక్షిణాత్యసంస్కృతికి గూడ నది కేంద్రమనుట యొప్పదగిన విషయమే. అరవలు, తెలుగులు, కన్నడులు, కేరళులు మున్నగు దాక్షిణాత్యజాతుల

వారికి జెన్నపురి కూడలి. అంతర్జాతికూటమునకును, దస్మాలమున నన్యోన్య భావపరిగ్రహమునకును నిది యనుకూలమైన తావు. కావున మదరాసున నీ ప్రాచీన దాక్షిణాత్య చారిత్రోపకరణములను భద్రపఱచుట యందఱికి ననుకూలమే; కాని ఇటీవల నీసర్కారు పురాతనవస్తు పరిశోధనశాఖవారి కేలనో కలకత్తాలోని భారతీయ వస్తుప్రదర్శనశాలపై గాఢానురాగ ముదయించినది. ఎచటనేనియు నొక తామ్రపట్టిక లభించె నని తెలిసినంతటనే దక్షిణమండల పురాతనవస్తు పరిశోధనశాఖాధ్యక్షుడు గాని, లేక దక్షిణమండలశాసనపరిశోధన శాఖాధ్యక్షుడుగాని, లేక ఇరువురుగాని కలకత్తా భారతీయ వస్తుప్రదర్శనశాల పక్షమున కొనుగోలు చేసి యచటికి రవానాసేయుటకు సదుపాయములను వెదుక నారంభించుచున్నారు. ఇది గర్హ్యము.

రెండవది జనసామాన్యము వీనియెడ నవలంబించు దుష్ప్రవర్తన. తామ్రపట్టికలపై నుల్లేఖింపబడియుండుటచే నివి యంత్రములనియు, భూగర్భమున నిక్షిప్తమైన ధనమును గనిపెట్టురహస్య మిందు గ్రథితమై యున్నదనియు జనసామాన్యముయొక్క విశ్వాసము. కావున లోహికశాసన మెద్దియేనియు హస్తగతమైనపుడు దానివిషయ మెఱిగినవారిచే జదివించి యందలి గ్రంథవిశేషములను నలువురకు దెలియనీయక దాచుచున్నారు. మఱికొంద ఱజ్ఞానులు వచ్చినవఱకే లాభమని యెంచి రేకులను గరగించి లోహమును విక్రయించి యల్పలాభము నందుచున్నారు. పెక్కు అమూల్యములైన తామ్రశాసనములింకను ఆంధ్రలోకమున డాగియున్నవని పరిశోధకు లందఱు నెఱుగుదురు; పెక్కు కంసాలివాని కుంపటియం దగ్నిప్రవేశము జేసి రూపాంతరము నంది చెంబులు, తపెలలు, తట్టలు మొదలైన పాత్రలుగ మారిపోయినవి. ఈ ప్రవర్తనవల్ల నాంధ్రచరిత్ర కెంతటి నష్టము గలిగెనో

చింతింపుడు. కావున ఈ లౌహికశాసనములు ప్రాచీనాంధ్రచరిత్ర పునర్నిర్మాణమున కమూల్యసాధనములని గ్రహించి వానిని నాశము గానీయకుండ కాపాడవలసిన దని యాంధ్రచారిత్రకుల పక్షమున వేడుకొనుచున్నాను.

## శైలికములు.

వీని సంఖ్య వేనవేలు. దక్షిణ హిందూదేశమున గనీసమొక్క శిలాశాసనమేనియు లేని గ్రామముగాని, పల్లెగాని గానవచ్చుట యరుదు. ప్రసిద్ధదేవాలయములు గల తావులయందు వేలకొలది గానవచ్చుచున్నవి. దక్షిణ హిందూదేశమున గానవచ్చు నన్ని శిలాశాసనములీ ప్రపంచమున మఱే దేశమునను గానరావు. ప్రాచీనులు చరిత్రను వ్రాయకపోయినను, ఈ శాసనముల నాధారపఱచుకొని యశోకచక్రవర్తి కాలమునుండియు క్రీ. శ. ౧౭-వ శతాబ్దిమధ్య తురక లాక్రమించునంతవఱకు నవిచ్ఛిన్నముగ దక్షిణహిందూదేశచరిత్రను వ్రాయవచ్చును; కాని యీకార్యమంత సులభముగ నెఱవేఱునది కాదు. దాని కభ్యంతరములు పెక్కులు గలవు. దక్షిణాపథమునంతటిని పర్యటనము గావించి లభించిన శాసనముల కన్నిటికిని ప్రతిబింబములు తీసి శాసనగ్రంథములను తయారుసేయుట ప్రథమకర్తవ్యము. ఇది యొంటరులు సేయగూడిన కార్యము గాదు. ఇతరసంగతుల నటుండనిచ్చి యపారమైన ధనము వెచ్చపెట్టక కార్యము జరుగదు. కావున ఈకార్యము సర్కారువంటి జాతీయసంస్థలే పూనుకొనవలసియున్నది. ఇటువంటి దొకటి మనదేశమున లేకపోలేదు. భారతీయపురాతనవస్తుపరిశోధనశాఖకు భారతీయశాసనపరిశోధనశాఖ యను నుపశాఖ యొకటి కలదు ప్రత్యేకముగ శాసనపరిశోధనకొఱకే ఇది యేర్పడినది. దీనికి ప్రత్యేక

మొక యధ్యక్షుడును, నుపాధ్యక్షులు నుండిరి. మొదట మొదట వీరు ప్రశంసాపాత్రమైన కృషి చేసి దాదాపు ముప్పదివేలకు మించిన శిలాశాసనములకు బ్రతిబింబములను దీయించిరి; కొన్నివేల శాసనముల గ్రంథములను బరిష్కరించి ప్రకటించిరి; కాని—

"ఏనాటి యగ్రహారమో, యానాటికి ఖండ్రిగాను నది యొట్లన్నగా
మూనాడు మాన్యమాయెను, నానాటికి దీసికట్లు నాగంభట్లూ."

అన్న రీతిని ఇండియాగవర్నమెంటువారి కేంద్రీకరణమంత్రమాహాత్మ్యమువల్ల రానురాను ఈ యుపశాఖబలమును, దానితోపాటు కృషియు సన్నగిల్లుచున్నవి. నామకార్థ మొక యధ్యక్షుడున్నను అతనికీ యుపశాఖతో నేలాటి ప్రత్యక్షసంబంధమున్నట్లు తోచదు. అతడు ఢిల్లీలోనుండగా నతని స్థానమున గవరన్మెంటు ఎపిగ్రాఫిస్టుగ రెండు సంవత్సరములు కీ. శే. రావుబహదూరు సి. ఆర్. కృ. చార్లుగారు పని చేసిరి. వీరిని వెనుకకు నెట్టి, పంజాబీలు, బంగాళీలు, మరాటీలు దొరకకపోగా తుదకు ఉపకారవేతనము బుచ్చుకొనబోవునప్పుడు ఈ పదవినిచ్చినను ఈయల్పకాలమున వీరొనర్చిన కృషి ప్రశంసాపాత్రము. వీరు ఉపకారవేతనము బుచ్చుకొని యుద్యోగమును విరమించుకొనినపిమ్మట వీరి స్థానమున మఱియెవ్వరింకను నియమింపబడలేదు. ఈ యుదాసీత క్రిందియంతస్తుల నియోగమునందును గానవచ్చుచున్నది. దక్షిణదేశమున శిలాశాసనములు తెనుగు తమిళ కన్నడభాషలయందు గలవు. ఈమూడుభాషలకు నాదినుండి సహాయశాసనసంశోధకుల నేర్పాటు నేయుటయందు సమానప్రాముఖ్యత జూపుచుండిరి. ఇటీవల నీపద్ధతియందుగూడ మార్పు గానవచ్చుచున్నది. ఈశాఖయం దేలనో కర్ణాటకుల ప్రాబల్యము హెచ్చినది. అసిస్టెంటుసూపరింటెండెంటుతో గూడ కర్ణాటకులు ముగ్గురు, అరవలిద్దఱు; తెనుగువా డొకడు. శాసనము లుండు దేశవైశాల్యమునుబట్టి

చూచిన నీవైపరీత్య మింకను స్పష్టముగ దెలియగలదు. చెన్నరాజధానిలో నీశాఖవారి క్రింద నుండు కన్నడజిల్లాలు ౧౺—దక్షిణకన్నడము, బళ్లారిలో సగము, అనంతపురములో కొంతభాగము. ఈ జిల్లాలలో నుండు శాసనములలో నధిక భాగమున కింతకుపూర్వమే ప్రతిబింబములు దీయబడినవి. ఇంకొక విశేషము. బొంబాయి రాజధానిలో గల కన్నడ జిల్లాల కన్నిటికిని కన్నడ రిసర్చి ఇన్‌స్టిట్యూటని ప్రత్యేకముగ నొక పరిశోధక సంస్థను స్థాపించి దాని కొక శాసనసంశోధకుని డైరెక్టరుగ నియమించియున్నారు. మఱి ౧౩ జిల్లాల యరవదేశముపై దిరిగి శాసనములను వెదకి ప్రతిబింబములను దీయుట కిద్దఱు; ౧౧ తెనుగుజిల్లాల కొక్కడు. ఈ ౨౪ జిల్లాలలోను ఏకొన్నింటనో తప్ప శాసనసంశోధన సంపూర్ణముగ జరుగలేదు. దీనికి దోషము ఒకరివెనుక నొకరినిగ పంజాబీలను, బంగాలీలను భారతీయశాసనపరిశోధనశాఖకు సర్వాధికారులనుగ నియమింప నారంభించిరి. శాసనపరిశోధనశాఖకు సర్వాధికారిగ దాక్షిణాత్యులనే నియమించుట యుక్తము, సముంజసముగూడ. ఏలన, ఈవిస్తారభరతఖండమున వర్షవర్షమును శోధించి ప్రతిబింబములను దీయించు శాసనములలో నూటికి తొంబదియెనిమిది దక్షిణదేశమునందే లభించుచున్నవి. ఉత్తర హిందూస్థానమున లభించు నొక్క శాసనమునకు బ్రతిగ దక్షిణ హిందూదేశమున వేయి లభించుచున్నవి. ఈ శాసనములు పైజెప్పినట్లు తెనుగు తమిళ కన్నడ భాషలయందు వ్రాయబడియున్నవి. వీనిని యథామాతృకముగ జదువుటకును, బరిష్కరించి ప్రచురించుటకును, అర్థము నిర్వచించుటకును నీ భాషలయందు పాండిత్య మవసరము. ఇంతేకాదు. శాసనోక్తచరిత్రాంశములను గ్రహించుటకు దక్షిణదేశభాషల వాఙ్మయముతోడి పరిచయము, దక్షిణదేశచరిత్రజ్ఞానమును నత్యంతావశ్యకము. ఉత్తర హిందూస్థానవాసులయం దీగుణములు గానరావు, కావున

దాక్షిణాత్యశాసనపరిశోధన కధ్యక్షులుగ వీరిని నియమించుట యుక్తము గాదు. ఈ కారణములవల్ల మన శాసనపరిశోధన నిరభ్యంతరముగ సాగుటలేదు.

ఇంకొక విషయము నిచట స్మరింపవలసియున్నది. అరవదేశము వలెగాక ఆంధ్రకర్ణాటదేశము లొక యేలుబడిక్రింద లేవు ఆంధ్రదేశము మదరాసు, మైసూరు, హైదరాబాదు, ఒరిస్సా, మధ్యపరగణాల పాలనక్రిందను, కర్ణాటకము మదరాసు, బొంబాయి, మైసూరు, హైదరాబాదులపాలనక్రిందను ఖండఖండములుగా విభజింపబడియున్నవి. ఇందు కొంత బ్రిటిషుప్రభుత్వము క్రిందను, మరికొంత స్వదేశసంస్థానాధిపతుల యేలుబడిక్రిందను నున్నది. మదరాసు మైసూరు రాజ్యములవారు శాసనపరిశోధనయందు జూపిన శ్రద్ధ ప్రశంసనీయము ఇప్పటి పురాతనవస్తుపరిశోధనశాఖాధ్యక్షులు శాసనపరిశోధనశాఖను విస్మరించియున్నను వీరి పూర్వికుల కాలమున జాలపని జరిగినది. మైసూరు రాజ్యమున గల శాసనములన్నియు బ్రకటింపబడినవి. అఖిలభారతశాసనసభలోని కర్ణాట ప్రతినిధుల నిరంతరకృషికి ఫలముగ బొంబాయి రాజధానిలోని కర్ణాటకమండలశాసనములకు బ్రతిబింబములు దీయించి ప్రకటించుటకు దగు యత్నములు సేయబడి కార్యము నడచుచున్నది. మన ప్రతినిధులుకూడ నఖిలభారత శాసనసభ యందుగలరు. 'ఖొజ్జాయుగడు ఇంటిలోనున్నను దండులోనున్నను నొక్కటే' యను లోకోక్తి వీరి ప్రాతినిధ్యమువలన సార్థకమైనది. హిందూశాసనముల విషయమై హైదరాబాదుసర్కారువారు గడు నుదాసీనులై యున్నారు. హిందూశాసనములకు ప్రతిబింబములు దీయించి వానిని బ్రకటింపనే లేదని చెప్పలేదు. వీరు ప్రకటించిన శాసనములనన్నిటిని లెక్కవేసిచూచిన కాకతీయశాసనములు ౬౦, ఇతరశాసనములు దాదాపు ౧౦. మొత్తము నూటికి తక్కువ. ఇది కడు శోచనీయమైన విషయము. హైదరాబాదు రాజ్యము

ప్రాచీనాంధ్ర కర్ణాటసామ్రాజ్యములకు హృదయమువంటిది. సాతవాహన చాళుక్యరాష్ట్రకూట యాదవ కాకతీయ సామ్రాజ్యముల కిది పుట్టినిల్లు. ప్రతిష్ఠానమాన్యఖేటకకల్యాణ ఏకశిలానగరాది ప్రాచీనాంధ్ర కర్ణాటరాజధానులిందణగియున్నవి. వేలకొలది కాకున్నను వందలకొలది శాసనము లీ రాజ్యమునందు గలవు. దేశాభివృద్ధియే పరమాశయముగ గల మహోదార స్వభావులైన మ. ఘ. వ. నైజాము ప్రభువరేణ్యు లీశాసనముల కన్నిటికిని ప్రతిబింబములు దీయించి యచిరకాలముననే ప్రకటించుటకు దగు నేర్పాటులనుగావించి చరిత్రపరిశోధకులకు బ్రసాదించిన వీరి కీర్తిలత మఱింతగ వికసించగలదు.

మధ్యపరగణాలలోని బస్తరుసంస్థానమునందును, ఇతర తెనుగు జిల్లాలయందును పెక్కు తెలుగు, కన్నడ శాసనములు గలవు. వీనిని బరిశోధించుట కెట్టి ప్రయత్నముగు జరిగినట్లు కానరాదు. దక్షిణదేశ చరిత్ర రచనకు శాసనసంశోధన యత్యావశ్యకము. ఎంత శీఘ్రముగ నీకార్యము ముగిసిన నంత సంపూర్ణముగ మన చరిత్రను రచియించుటకు సాధ్యమగును.

### వా జ్మ య ము.

తరువాతిది వాఙ్మయము. వాఙ్మయము చరిత్ర రచన కెంతవఱకు సహకారి యగునో మొదట విచారింపవలసియున్నది. ఆంధ్రమున పరంపరగ వచ్చు వంశచరిత్రలు కొన్ని గలవు. ఇందు పద్యకావ్యములు కొన్ని, వచనములు కొన్ని. వెలుగోటివారి వంశావళి, రామరాజీయము, ఔకు రాజచరిత్ర, తొండమాన్ వంశావళి మొదలయినవి పద్యకావ్యములు. శూరపురుషుల సాహసకార్యములను వర్ణించు గని తిమ్మానాయని సీస మాలికలు, కస్తూరి రంగప్ప సీసమాలికలు, యాచమనాయకుని సీసమాలికలును నీతరగతికి జేరవలసినవి. ప్రతాపచరిత్ర, తంజావూరాంధ్రరాజుల

చరిత్ర వచనములు. రాయవాచక మీతరగతికి జేరినది. ఇవిగాక సాధా రణమైన ఆంధ్ర కావ్యములయం దమూల్యమైన చరిత్రాంశములు గలవు. అవతారికలును, నాశ్వాసాద్యంతములు నెట్లు చరిత్ర రచయితల కుప యుక్తములో పరిశోధకులందఱు నెఱిగిన విషయమే. కాని వీనియందే కాక తక్కిన గ్రంథభాగములయందును చరిత్రాంశము లణగియున్నవి. సాధారణముగ నివి రాజవంశములకును, యుద్ధములకును సంబంధించి నవి కావు. కావ్యకర్తలు తమ రచనలయందు అనుభవసిద్ధములైన సాంఘికార్థికవిషయములను చేర్చియున్నారు. "గోవధము సేయు తురకల దైవంబవు" "ఇగురు కై జీతంపుటెక్కటీలు" "వూదే నెగాసపునల్ల ప్రజ" "కమలాకరము పాళెము పట్టు" "కాలంపువేరి సుంకరి యంబరమున బొడిచిన ముద్ర" ఇత్యాదు లెన్నియో కలవు. క్రీ. శ. ౧౭-వ శతాబ్ద మున విరచింపబడిన గ్రంథము లప్పటి రాజకీయమత సాంఘికార్థకపరిస్థి తుల నెఱుగనివారికి దుర్గ్రాహ్యములు. మచ్చున కొక్క పద్యము:

సీ. అఖిలసీమామూలమైన దుర్గమ్ములు
        మ్మలికెలు గల కమ్మవెలమదొరలు
    చేటి కై దేసి వేల్ శివరాయల వరాల
        నెలకట్టడల పటానీ ల్గరీబు
    లూళ్ళాయముల మీద హవారవు త్తరువుగొన్న
        రాయ కై జీతంబు రాచవారు
    పగటిగాసంబు దప్పకయుండ దినసరో
        జుతుదిను నొంటరిజోదుమూక
    మొదలుగాగల వారల మొనకు నిలిపె
    పొడిచివేర్వాడి విధులొనర్పంగ జేసె

గాసిగావించి యరుల జేవాని కెదుట
జూపె నిలరేడు మూడు మెచ్చులును మెచ్చ."

ఇట్టి పద్యములు ఆయుగప్రబంధములయందు త్రవ్వితండములు. విజయనగరసామ్రాజ్యమున వ్యవహారమునందుండిన రాజకీయ మత సాంఘికార్థిక పరిస్థితులు వీనియందు ప్రతిబింబితములై యున్నవి. పైనుదాహృతమైన పద్యము కాకమానిమూర్తిచే విరచితమైన రాజవాహనవిజయములోనిది; ఇందలి యితివృత్తము కేవలము కల్పితము. కథానాయకు డెప్పుడో బహుకాలమునకు ముందుండినవాడని కవి చెప్పియున్నాడు. అతడు తన కొలువునం దుండిన పఠాణీలకును, గరీబులకును క్రీ. శ. ౧౬వ శతాబ్దపు టుత్తరార్ధమున విజయనగరసామ్రాజ్యమును పాలించిన సదాశివరాయలపేర ముద్రింపించిన వరాలను జీవితమొసగెనట!

లభ్యములగు నాంధ్రగ్రంథములనెల్ల జాగరూకతతో బఠించి యందలి చరిత్రాంశములనెల్ల సమకూర్చి దేశకాలానుసారముగ విభజించితిమేని జీవకళతోడి జాతీయచరిత్రను వ్రాయుటకు సాధ్యమగును. ఆంధ్రచరిత్ర రచయితల కత్యంతోపయుక్తమైన సాధన మింకొకటి కలదు. పూర్వకాలమున నాంగ్లేయు లీదేశము నాక్రమించుటకుముందు ఆంధ్రదేశమున గ్రామగ్రామమున కొక కవిలె యుండునది. గ్రామకరణము దీనికి కర్త, కవిలె యనగా గ్రామములోని భూస్వామ్యమునుగురించియు, పన్నుపర్యాయములను గురించియు కరణము వ్రాసెడిలెక్క. ఏయేభూము లెప్పు డేసందర్భమున నెవ్వరికి లభ్యమైనదియు, గ్రామవ్యవహారములును, దేశాధికారులతో గ్రామస్థులకు గల సంబంధమును, గ్రామస్థుల సుఖదుఃఖములును నందు సమగ్రమై యుండెడివి. కరణీకులు తరతరములుగ నీకవిలెలను సంరక్షించుచువచ్చినందున క్రమక్రమముగ నివి పెరిగి గ్రంథ

రూపము నందినవి. ఈకవిలెయాలమున గ్రామచరిత్రములును, దేశచరిత్రమును కొంతవఱకు దెలియవచ్చుచున్నవి. ఇప్పుడీకవిలెలన్నియు నశించిపోయినను ఆంధ్రుల యదృష్టమువల్ల సుమారు నూటయేబదియేండ్ల క్రింద కర్నల్ కాలిన్ మెకంజీయను మహాత్ముడు గ్రామగ్రామునకును దన గుమాస్తాల నంపి యందుండు శాసనములకును, కవిలెలకును నకళ్లు వ్రాయించి కైఫీయతులను తయారు చేయించెను. ఇతడు వ్రాయించిన నకళ్లన్నియు నిపుడు మదరాసు ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున పదిలపఱుపబడియున్నవి. కాలగతివల్ల నిప్పటికే శిథిలమై కొంత చెడినవి. సంపూర్ణముగ శిథిలమగుటకు ముందే వీనిని ముద్రింపించి ప్రకటించుట యావశ్యకము. ధనవ్యయము లేక యీపని సాగదు. సామాన్యుల కిది సాధ్యముగాదు. ఆంధ్రవిశ్వవిద్యాలయమువంటి జాతీయసంస్థలీ కార్యమునకు బూనుకొనవలయును. కాని యిప్పటి పారుపత్యము క్రింద ఈ కార్యమును వారు సేయదలపెట్టుదు రను నాశలేదు. ఆంధ్రుల నాగరికతను, సంస్కృతిని పోషించు నుద్దేశముతో నీవిశ్వవిద్యాలయము స్థాపింపబడినను వీరికి చరిత్ర పరిశోధన ముద్దారైనది. ఆంధ్రుల చరిత్ర మాట చెప్పవలయునా ?

### నాణెములు.

పూర్వచరిత్రరచనకు నాణెములు లోక సాధనములని యందఱు నొప్పుకొనిన విషయమే. వీని మూలమున ఇతర ఆధారములవల్ల దెలియని విషయములను దెలిసికొనవచ్చును. ఒక యుదాహరణము. ద్రావిడదేశమున యజ్ఞశ్రీశాతకర్ణి యను శాతవాహనవంశజుని నాణెములు కొన్ని కాన్పించినవి. వీనిపై నొక ప్రక్క రెండు తెరచాపలు గల యోడ ప్రతిబింబము ముద్రింపబడి యున్నది ఈనాణెములవల్ల శాతవాహనుల నాడు ఆంధ్రుల యేలుబడి దక్షిణమున కొల్లడమునదాక వ్యాపించె

వనియు, నాంధ్రప్రజలు ద్వీపాంతరములకు రాకపోకలు సాగించుచు నోడవ్యాపారము సేయుచుండిరనియు తెలియవచ్చుచున్నది. ఆంధ్రదేశమున పూర్వవంశజుల నాణ్యములు విశేషముగ లభింపలేదు. దొరకిన వానిని ధనలోభముచే గరగించి చరిత్రకు తీరని నష్టము గలుగజేయుచున్నారు. కొన్నియేండ్ల క్రింద బెజవాడప్రాంతవాసియగు నొక వైశ్యశ్రేష్ఠి దనకు లభించిన శాతవాహనుల వెండినాణ్యముల ననేకములను బ్రాహ్మీశాసనములతోడి వెండిముద్దలను గొన్నింటిని మదరాసున దక్షిణహిందూదేశపురాతనవస్తుపరిశోధన సంఘుసమావేశములో బ్రదర్శించెను; తరువాత నవి యేమాయెనో తెలియదు. కంసాలిమూసబడి కరగి రూపుమాసిపోయినవని తలచెదను. ఇట్టి పురాతన నాణెములు దొరకినపుడు లాభమున కాసపడక ఏ వస్తుప్రదర్శనశాలయందో పదిలపఱిచిన ఆంధ్రచరిత్ర పునర్నిర్మాణమున కెంతయు సాహాయ్యముగ నుండును.



# ౧. ఆంధ్ర శాతవాహనులు.

---

ఆంధ్ర శాతవాహన చక్రవర్తులు గతించి నేటికి పదునాఱువందల సంవత్సరములైనవి. ఐనను ఆంధ్రులకు వీరు చిరస్మరణీయులై యున్నారు. దాదాపు నాలుగు శతాబ్దముల కాలము, అతి దక్షిణదేశముతప్ప, సర్వ దక్షిణాపథమును వీరు తమ యేకఛత్రాధిపత్యముక్రింద నుంచుకొని యుండిరి. ఈ యాంధ్రుల ఘనకార్యములు పలుదెఱంగులు. వీరి కాలమున ఆర్థిక, రాజకీయ, వాఙ్మయచిత్రకళాది బహువిషయములలో దేశము అభివృద్ధిగాంచినది. ఆంధ్రసంస్కృతికి వీరొనర్చిన సేవ యపారము. అశోకసార్వభౌముని యనంతరము మౌర్యసామ్రాజ్యము క్షీణింపఁగా, శాతవాహన మహీపతుల పాలనలో ఆంధ్రులు స్వతంత్రులై దక్షిణాపథమునంతయు తమ స్వాధీనమునకు తెచ్చుకొని, సామ్రాజ్యాధిష్ఠానమైన మగధసింహాసనమునే అధిష్ఠించి కొంతకాలముండిరి. మ్లేచ్ఛులు భారతభూమిపై దండువెడలి ఆర్యావర్తమునంతయు కల్లోలము గావించుచుండినట్టి క్రైస్తవశక ప్రారంభకాలమున నీయాంధ్రులు వారికి మహాపర్వతపంక్తివలె నడ్డునిలిచి దక్షిణమునకు వారిని రానీయక వారి గమనమును నిరోధించినారు. శాతవాహనులకాలమున నాంధ్రనావికులు మహాసముద్రములనుదాటి, బర్మా, మలయా మున్నగు ద్వీపాంతరములతో వ్యాపారసంబంధము లేగాక మతనైతికవిద్యావిషయకాది సంపర్కములు గలిగియుండిరి. శాతవాహనమహీపతులలో పలువురు వైదికమతావలంబకులేయైనను బౌద్ధాదిమతేతరులను ఆదరించుచుండిరి. వాస్తవముగా నీకాలమున నాంధ్రదేశము బౌద్ధమతప్రచారమునకు కేంద్రస్థానమై దేశ

దేశాంతరాగతులకు ఆకర్షణీయమై యుండెను. బౌద్ధాగమమునకు ఆంధ్రులొనర్చినసేవ యపారమైనది. తక్కినవారిమాట యటుండ, ఆర్యదేవనాగార్జునులు ఆంధ్రదేశమందలి బౌద్ధవిహారములలోనుండి మతప్రచారముచే బౌద్ధవేదాంతమునందేగాక ధర్మపరిపాలనాది విషయములలో పెక్కు గొప్పమార్పులు కావించిన యాంధ్రులే. ఈమహానీయుల యుద్బోధచేత బౌద్ధమతము జనసామాన్యముయొక్క అందుబాటులోనికి వచ్చినది, ఎల్లవారికిని హృదయంగమమైనది. బౌద్ధమత ప్రాచుర్యము వాస్తునిర్మాణ చిత్రకళాదులకు మహోత్సాహ మొసంగినది. లెక్కలేని చైత్యములు, స్తూపములు, సంఘారామములు బయలు వెడలినవి. కార్లి, నాసిక, అజంతా మున్నగు స్థలములు ఈకాలమున వెలసినవి. బుద్ధదేవుని జీవితచరిత్రను, ఆతని జాతకములను ప్రచారము నిమిత్తము చైత్యాలయముల గోడలయందు చుట్టును చిత్రించుట యాచారమైనది. ఇందుచే విగ్రహనిర్మాణాది శిల్పకళయు, చిత్రకళానైపుణియు నభివృద్ధినందుట కవకాశ మేర్పడినది. ఆంధ్రచిత్రకారులు మహాకుశలురై మించిరి. నాటి శిల్పశకలములు అద్వితీయములై నేటికిని ఆశ్చర్యజనకములుగానున్నవి. అమరావతి, భట్టిప్రోలు జగ్గయ్యపేటలలోని స్తూపములు ఎన్నడో శిథిలములైనను అవశిష్టములచేత నాటి యాంధ్రుల నేర్పు ఎంతటి యుత్కృష్టతను బొందియుండినదియు తెలియుటకు వలసినంత యవకాశము గలదు. సాహిత్యవాఙ్మయములందును నాంధ్రులు తగ్గినవారుగారు. ప్రాకృతవాఙ్మయము నాడు మహోన్నతస్థితియందుండెను. శాతవాహన ప్రభువులు తాము స్వయముగ కావ్యకర్తలగుటయే గాక కవులను పండితులను ఆదరించి వారిచే శాశ్వతకీర్తిప్రదములగు గ్రంథములను రచియింపించిరి గాని పెక్కులు నశించి కాలగర్భమున లీనమైపోయినవి. నాగార్జున గుణాఢ్యాది కవుల మహాల

గ్రంథములు నశించి వాని యనువాదములును అనుకరణములును మిగిలినవి. శాలివాహన సప్తశతి యను నామాంతరముగల హాలవిరచిత సప్తశతీగ్రంథమును, హాలశాతవాహనుఁడు నాయకుఁడుగా రచితమైన లీలావతియను శృంగార కావ్యమును పూర్వరూపమును కోలుపోక నేటి వరకును వచ్చియున్నవి.

కాని మనకు శాతవాహన చరిత్రము సమగ్రముగా లభించినదని తలంపరాదు. సాధనసామగ్రి లేనందునను ఆధారములు సరిగా దొరకనందునను వీరిచరిత్ర మనకు దిక్ప్రదర్శనమాత్రముగా మాత్రమే దొరకినది. అదియు సందేహాస్పదము. శాతవాహనచరిత్రలోని ప్రధానాంశములు మాత్రము సూక్ష్మముగా గోచరించుటయేగాక నాటి విషయములను స్పష్టముగా చెప్పుటకైనను ప్రస్తుత పరిశోధనా పరిస్థితులలో సాధ్యముగాక యున్నది. ఇందుచేత శాతవాహనచరిత్ర పరిశోధకుల యుద్ధభూమియై పెక్కు విషయములు వివాదాస్పదములుగా నున్నవి. మొదటి విషయము, శాతవాహనుల పుట్టుపూర్వోత్తరముల గురించి పెక్కు సంశయములున్నవి. వీరి ప్రాచీనతనుగూర్చి వీరు సంహితలకు తర్వాతి కాలమునకు చెందినవారని ఎల్లవారును ఒప్పుకొనుచున్నను వారి జాతిని గూర్చి మాత్రము భిన్నాభిప్రాయములు గలవు. సాతవాహనులు ఆర్యులై యుండి తమవారితో జగడమాడి, దక్షిణమునకువచ్చి, దక్షిణాపథమునందలి ఆర్యేతరులతో చేరి వారి సంస్కృతిని అలవరచుకొనిరని కొందఱు వాదించుచుండఁగా, ఇతరులు వీరు ఆర్యులే కారనియు దక్షిణాపథమునందలి ఆదిమనివాసులే యనియు, బహుశః దక్షిణమందేగాక భారతభూమి నంతటను నివసించుచుండిన ద్రావిడులే గావలయుననియు వాదించుచున్నారు. వింత యేమనఁగా నీ రెండు వాదములకును నాధారము ఋగ్వేదమునందలి ఐతరేయ బ్రాహ్మణమునందలి వాక్యము

ఒకటి. అదేమనగా శునశ్శేఫ విశ్వామిత్రుని కథలో ఆంధ్రులు పుళింద పుండ్ర శబర మూతిబులతో కూడ పఠింపఁబడియుండుటయే. ఈవాక్యమునకు అర్థము సందిగ్ధముగా నుండుటచే నేమియు గట్టిగా చెప్పరాకున్నది. పురాణములు మాత్రము ఆంధ్రులనుగుఱించి కొంతవిషయమును తెల్పుచున్నను అది ప్రాస్తావికప్రాయమై వారిజాతిని తెల్పుట కుపయుక్తము గాకయున్నది. ఒక ముఖ్యమైన విషయము గుర్తింపఁదగినది. ఆంధ్రులు యాదవశాఖీయులైన అంధకులగుదురని కొందరు తలంచిరి. వీరిలో కొందఱు భోజకులు మొదలైనవారు, మధ్యపరగణాలు బీరారు మొదలైన చోటులలో పరిపాలన మొనరించి యుండినందున జైన బౌద్ధ గ్రంథములలో నాంధ్రులనియు నంధకులనియు ననఁబడువారు వీరుగానే యుందురనుటకు అనుకూలముగా నున్నది. ఈ తార్కాణము కుదురునెడల ఆంధ్రులు ఆర్యులను వాదమునకు బలము కలుగును.

ఆంధ్రులు మొదట నివసించిన ప్రదేశమునుగూర్చి కొన్ని వివాదములు కలవు. ఒక యభిప్రాయము ప్రకారము ఆంధ్రులు కృష్ణా గోదావరీనదుల మధ్యభాగమున తూర్పుసముద్రతీరముననుండి శాతవాహన సామ్రాజ్యస్థాపనకాలమునకు సరిగా శ్రీముఖునియు వాని సోదరుఁడు కృష్ణునియు పాలనమున గోదావరీతీరభూమిని నాసికవఱకు జయించి దక్షిణాపథ చక్రవర్తులని పేరు వహించిరి. ఈయభిప్రాయము ఆక్షేపింపబడినది. ఏలయన వింధ్యప్రాంతీయులైన యీయాంధ్రులు తొలుత పశ్చిమభారతమును పాలించి క్రమముగా కృష్ణా గోదావరుల నడిమి దేశమును స్వాధీనపఱచుకొనిరనియు పశ్చిమ భాగమున తమ యాధిక్యము క్రమముగా తగ్గగా తూర్పున పాలించుచువచ్చి ఈభాగమునకే ఆంధ్రమండలమను నామమును స్థిరపఱచిరనియు, వీరభాష నేటి యాంధ్రము గాక దాని స్వరూపమేదో తెలియని ప్రాకృతమనియు ఆక్షేపకులు వచిం

చిరి. ఆంధ్రులు వింధ్యప్రాంతీయులని ఐతరేయ బ్రాహ్మణము వచించినది వాస్తవమేయైనను వింధ్యప్రాంతీయులనుట కర్థమేమో ఎవరును నిర్ణయింప బ్రయత్నింపరైరి. వింధ్యప్రాంతీయులనగా కేవల తత్పర్వత పరిసర ప్రదేశము మాత్రమే అర్థముకాదని తలంచుటకు కారణము గలదు. నేడు పశ్చిమభారతమున వింధ్యమను ప్రదేశముమాత్రమే యైయుండజాలదు. పశ్చిమమునుండి ఓఢ్రదేశమునందలి దక్షిణభాగమువఱకును గల పర్వతపంక్తి కంతటికిని ఆ పేరు గలదు. ఆంధ్ర రాజవంశములగు కాకతీయ, వెలమ, రెడ్డి రాజుల శాసనములలో వింధ్యపర్వతమువఱకును ఈ రాజులు జయించినట్లు గలదు. నేటికిని బస్తరులోను మధ్యపరగణాలలోని తూర్పుభాగమునందును తెలుగు మాటలాడువారు నివసించుచుండుటచేత ఆంధ్రులు తొలుత వైదికానంతరయుగమున వింధ్యకు దక్షిణభాగమైన తూర్పుదేశమునందే బీరారు, ఒరిస్సాలకు సమీపమున నుండియుండిరని తలంచుట అసమంజసము కాదు. ఆంధ్రులు పడమటినుండి తూర్పునకు వచ్చియుండిరని యూహించుటకు గల కారణమొక్కటియే. అతిప్రాచీన సాతవాహన రాజన్యుల శాసనములు మహారాష్ట్ర దేశమునందు దొరకుటయు ఆంధ్ర దేశమునందు లేకుండుటయు. కాని నానాఘాటు, కార్లె మొదలైన ప్రదేశములలో దొరకిన శాసనములచేత నాంధ్రసాతవాహనుల రాజ్యమున నీప్రదేశములు చేరియుండినవని తేలుచున్నదే గాని ఆంధ్రరాజ్యము పశ్చిమమునుండి తూర్పునకు వ్యాపించినదని చెప్పుటకు వానియందే యాధారమును కానరాదు. అయినను ఆంధ్రుల ప్రాచీనశాసనములు తెలుగుదేశమున కానరాకుండుట పరిశీలింపదగినదే. కాని దీనిబట్టి ఎక్కుడు స్వారస్యము లాగుటకు ప్రయత్నింపరాదు. ప్రాచీనాంధ్రుల భాష ఏదో తెలియరాదు. నేడు ఆంధ్రులెల్లరు మాటలాడు తెలుగు క్రీ. తర్వాత ఆఱవశతాబ్దమునకు

పూర్వము లేకపోయినను వారిభాష తెనుఁగు కాదు ప్రాకృతమని గట్టిగ చెప్పుట కష్టము. కొన్ని శాసనములు ప్రాకృతమునం దుండుటచేతనే ఆ శాసనములు జనుల వాడుకభాషలో రచింపఁబడినవని చెప్పరాదు. మౌర్యుల పరిపాలనావిధానములే దేశమున పరంపరగా జరుగుచుండుట చేతను బౌద్ధధర్మపరిపాలకులును దానియందే వ్యవహరించుచుండినందు వలనను ప్రాకృతము వ్యవహారభాషగా నీకాలమున నుండినది. ఇందు చేత జనులభాష యేదైనను ప్రాకృతమునందే ఎల్ల మత, వ్యావహారిక పత్రములను వ్రాయుట ఆచారమైనది. గుణాఢ్యుని బృహత్కథయందలి యొక వాక్యము సోమదేవసూరియొక్క కథాసరిత్సాగరమున ననువృత్తము ఇట నుపయోగపడును గుణాఢ్యుఁడు గోదావరీతీర ప్రతిష్ఠానమును పాలించుచుండిన సాతవాహనరాజుయొక్క ఆస్థానపండితుఁడై ఒకప్పుడు తనకు ప్రతిద్వంద్వియైన శర్వవర్మతో వాదముచేసి, శర్వవర్మ రాజును ఆఱునెలలలో పండితునిగా నొనర్చిన తాను వ్యవహారమునం దున్న మూఁడు భాషలను, సంస్కృతప్రాకృత దేశభాషలను త్యజించి మౌనమూనునట్లు ప్రమాణమొనర్చెను. ఈ దేశభాష చూడఁగా జనులు మాటలాడుచుండినభాషగా తోఁచుచున్నది. ఇది వాస్తవమే యగునేని ఈ దేశభాషయే ఆంధ్రులయొక్కయు ఆంధ్రదేశముయొక్క భాషగానుండి క్రమముగా తెలుఁగుగా ద్రావిడసంపర్కముచే నేటి స్థితికి వచ్చియుండును.

కొందఱు చరిత్రకారులు ఆశ్చర్యజనకములగు నూతనవిషయములను చెప్పవలెనను నుత్సాహముతో శాతవాహనులు ఆంధ్రులే కారనియు, ఆంధ్రభృత్యులైన రాజవంశమువారు కారనియు పలికిరి. వీరి ప్రబలకారణము శాతవాహనుల శాసనములలో ఎచ్చటను ఆంధ్రశబ్దము రాకుండుటయు, వారి నాణెములన్నియు మహారాష్ట్రదేశమందే కనఁబడుటయు. బల్లా

రిలో దొరకిన కొన్ని తర్వాతి శాతవాహనశాసనములలోను తొలి పల్లవ శాసనములలోను ఆప్రదేశము నిజముగా సాతాహాని హార సాతాహాని రాష్ట్ర మనియున్నది. కాని ఈమండలము, కొందఱుపండితులు తలచినట్లు, శాతవాహనుల జన్మభూమి కానేరదు. ఏలయన ఇవి చాలతర్వాతి శాసనములు, క్రీ. శ. 3 శతాబ్దివి. పైగా నీశాతవాహనులు ఉత్తరముగా మహారాష్ట్రమునకు ఎక్కిపోకినట్లు ఆధారములు పొత్తుగా లేవు. చూడఁగా తమసామ్రాజ్యము క్షీణించినతర్వాత ఆంధ్రులు నేటి బళ్లారి మండలమును చేరి తమ నాయకత్వమును దాని కొసంగియుండవలెను. వాస్తవముగా శాతవాహనులు తా మాంధ్రులమని చెప్పుకొనలేదు. కాని ఆకారణముచేత వారు ఆంధ్రులు కారనుటకు సాధ్యముకాదు. ఆంధ్రశబ్దము సామాన్యవాచకము. కొన్ని భిన్నజాతులకు చెందినది. పలువురు జనులకు సామాన్యవాచకమైన ఆంధ్రులనుఁ బేరిని సాతవాహను లేల వేసుకొనవలెను. ములకనాఁడు, వెలనాఁడు, వేఁగినాఁడు, రెడ్డి, కమ్మ, బలిజ, వెలమ మొదలైనవా రందఱును నేఁడు ఆంధ్రులుగానున్నట్లే నాఁడును లెక్కలేనికులములును సంఘములును చేరి ఆంధ్రముగా నుండెను. మహాభారతమున నాంధ్రులు పలుసంఘముల వారని కలదు. ('ఆంధ్రాశ్చ బహవః' VI 9-49) బౌద్ధమతగ్రంథములలో గోదావరీతీరమందు నివసించియుండిన అస్సక ములక రాజ్యముల వారు ఆంధ్రులుగా పరిగణింపఁబడిరి. పోదన (నేటి బోదన-నిజామాబాదుజిల్లా, హైదరాబాదు) మహాభారతగ్రంథమున అస్సకులకు రాజధాని. ప్రతిష్ఠానము నేటి పైఠాణ, పాళీగ్రంథములలో ములకకు రాజధాని. ములకరాజ్యము ఆగ్నేయముగా నేటి తెలుగుదేశములోనికి చొచ్చుకొనియుండినట్లు ఆధారములు కనఁబడుచున్నవి. మదరాసులోని కడప గుంటూరుజిల్లాలును హైదరాబాదులోని మేదక్

జిల్లాయును 15 శతాబ్దమువరకును శాసనములలో ములకనాడు అని వ్యవహరింపఁబడియున్నది. ఇందుచేత అస్సకములకలు ఆంధ్రము లను పాలీగ్రంథముల వాక్యములు సత్యము లగుచున్నవి. శాతవాహనులు ఆంధ్రులలో నొక యంతశ్శాఖయని పురాణములచేతను నాణెములవల నను తెలియుచున్నది. శాతవాహనరాజుల నాణెములు దొరకినంతవరకు ఈ క్రిందిరాజులపేర్లను తెలుపుచున్నవి శ్రీముఖ, కృష్ణ, శాతకర్ణి, గౌతమీపుత్త్ర శాతకర్ణి, వాశిష్ఠీపుత్త్ర శ్రీపులోమావి, శివమక శాతకర్ణి, గౌతమీపుత్త్రయజ్ఞ శ్రీశాతకర్ణి, వాశిష్ఠీపుత్త్ర శ్రీఛదశాతకర్ణి, పులో మావి. ఈనామములన్ని ఇంచుమించు పురాణములలోని ఆంధ్రరాజుల నామధేయములే. ఇందుచే నాపురాణకారుల మతమున సాతవాహన రాజులు ఆంధ్రులేయనుట నిశ్చయము. సాధారణముగా నిట్టిసందర్భ మున తత్సత్తముతైన రెండు విషయముల నిట ప్రస్తావించుట లాభకారి. క్రీ. శ. ౩00 ప్రాంతమునందుండిన పల్లవ శివస్కందవర్మ యొక్క మైదవోలుశాసనమున దన్నకడ లేక ధాన్యకటకము ఆంధ్రాపథ మునకు రాజధానిగా చెప్పఁబడియున్నది. ప్రాచీన బాణరాజుల శాసనము లలో ఆంధ్రాపథము (లేక అరవమునందలి వడుగావళి) వారి రాజ్యము యొక్క తూరుపుటెల్లగా నున్నది. బాణులు మొదట మైసూరురాష్ట్రము నందలి కోలారుజిల్లాను నందగిరి (నందిదుర్గము) రాజధానిగా నేలు చుండిరి. ఆంధ్రాపథము వారికి అనఁగా కోలారునకు తూర్పున సముద్ర తీరమువరకు గల ప్రదేశముగ గ్రహింపవచ్చును. తుంగభద్రా హంద్రీ (ప్రాచీన 'అంధ్రి') నదుల సంగమ ప్రదేశమునందు కర్నూలునగరము ఈయాంధ్రాంశమున చేరినదే. ఆంధ్రాపథమునకును శాతవాహనవా రమునకును, తరువాతి శాతవాహన పల్లవశాసనములలోని శాతవాహనిరట్ట మునకును గల సంబంధము ఎచ్చటను తెలియరాకుండినను, రెండవది

తొలిదాన నొక భాగమని నమ్ముట కాధారముకలదు. కర్నూలుజిల్లా లోని నంది కొట్టుకూరుతాలూకాలోని కృష్ణానదీతీరమందు పాతానికోట యని యొక ప్రాచీన ప్రదేశముకలదు. ఇచ్చట పాడుపడిన దేవాలయ ములును దిబ్బలును ప్రాచీన వాస్తుశకలములును దాదాపు క్రీ. శ. ఏడవ శతాబ్దమునాటివని తలంపఁబడు శాసనములును గలవు. కాకతీయ గణ పతిదేవుని శాసనములలో నీప్రదేశము శాతవాహన కోటయని యుదా హృతము. ఈ నామము ఆపేరుగల రాజులకడనుండియేగాని అనితర లభ్యము. అయ్యది యుద్ధములలో శత్రుసైన్యముల నడ్డుటకు తగిన ప్రదేశముగా విజయనగర కాలముననే యుండినందున శాతవాహనుల కాలమున చాల ముఖ్యమైన కోటగా నుండియుండును. ఈవిషయ ములు ఆంధ్రులలో శాతవాహనులు ఒకతెగ యనియు శాతవాహనుల జన్మభూమియైన శాతాహనిహారము ఆంధ్రాపథమున నొక యంతర్భాగ మనియు చెప్పుటకు చాలినంత యాధారమని మా యభిప్రాయము.

ఆంధ్రుల చరిత్రలోని వివాదాంశములను సంగ్రహముగా నిట చెప్పియైనది. ఇట్లే వివాదాస్పదములైన యంశములు పెక్కులున్నవి; కాని గ్రంథవిస్తరభీతిచే సంగ్రహింపవలసియున్నది. కాని ఒక విషయ ము మాత్రము పండితులచేత విస్మృతమగుచుండుటచేత దానినిమాత్ర మిచ్చట చెప్పెదను. ఆంధ్రులు చాల ప్రాచీనులు. వీరి చరిత్ర సంహిత లకు తర్వాతికాలమునకు పోవుచున్నది. వీరి పూర్వచరిత్రాన్వేషణము చేయుటకు ఎవరును ప్రయత్నము చేయలేదు. కాని సాధన సామగ్రి చాలనందున ఆపని సులభమైనదికాదు. భారతదేశమందలి రాజ్యములను పేర్కొను సందర్భమున పురాణములును, బౌద్ధగ్రంథములును ఆంధ్రు లను పేర్కొనుచున్నవి. మెగాస్తనీసువంటి యవన (గ్రీకు) యాత్రి కులు ఆంధ్రుల రాజ్యవిస్తీర్ణమును, సైన్యబలమును, దేశమందలి సంప

త్తిని వర్ణించియున్నారు. పురాణములు ఆంధ్రులు రెండు ప్రదేశములలో నుండినట్లు వర్ణించియున్నవి. మొదటిది దక్షిణాపథము. మన పూర్వులు ఇచ్చటివారే. రెండవ ప్రదేశము నేటి యాఫ్ఘనిస్థానమునకు ఉత్తర మున బాహ్లికమునకు ప్రక్క. వీరే పురాంధ్రులు. డాక్టరు కే. పి. జయస్వాలుగారిమాట విశ్వసింతుమేని గిల్జాయిలోని ఆఫ్ఘనుజాతులవారిలో మహాశూరులైనవారు అంధ్రేవి లేక ఆంధ్రి యని నేటికిని వ్యవహరింపఁబడుచున్నారు. పశ్చిమ బాఖ్‌లోని అంధఖుయి యనుజిల్లా నేటికిని వీరి ఉత్తరము నివాసస్థానమును జ్ఞాపకపరుచుచున్నది. ఇట్లు పౌరాణిక కాలమున నాంధ్రుల శాఖలు రెండు ఆర్యావర్తముయొక్క ఉత్తర దక్షిణములయందుండుట పెక్కు ఊహాల కవకాశ మిచ్చుచున్నది. ఈ యిరుశాఖలును ఏకజాతికి చెందినయెడల వైదికకాలమునకు దాదాపున వింధ్యపర్వత ప్రాంతీయులుగానుండిన వీరిలో తమ నెలవును వీడి ఒక శాఖ ఆఫ్ఘానిస్థానము యొక్క ఉత్తరభాగమునకు ఎట్లేగిరో, ఏగినవెనుక వారికిని తొలియాంధ్రులకును ఏమైనను రాకపోకలుండినవో యను సంశయముల కుత్తరము కనుగొనుట కష్టము. దక్షిణాపథమందలి యాంధ్రులనుగూర్చి మన కెక్కువ తెలియును. ములక అస్సక మున్నగు శాఖలు బౌద్ధయుగ ప్రారంభకాలముననే ప్రసిద్ధికి వచ్చినవి. గొప్ప పట్టణములను నిర్మించి దేశమునందలి గొప్ప రాజ్యములుగా ప్రసిద్ధి నందినవి. మౌర్యకాలమున వీరినిగూర్చి కొంత తెలియనగుచున్నది. యవన (గ్రీకు) రాయబారి మెగాస్తనీసు చంద్రగుప్తుని యాస్థానమున నుండినకాలమున నాంధ్రులను గురించి సంగ్రహమేయైనను మంచి విషయములను వ్రాసినాఁడు. ఆంధ్రులకు ముప్పది దుర్గములు, 10,000 కాల్బలము, 2000 గుఱ్ఱములు, 1000 ఏనుఁగులు నుండినవి. కొందఱు చంద్రగుప్తమౌర్యుని కాలముననే యాంధ్రులు మగధసామ్రాజ్యమునకు తర్వాత పెద్దదనదగిన 'ఏకరాజ్యము'గ నుండిరని తలంచుచున్నారు.

కాని ఆంధ్రులు బలవంతులుగానే యుండినను, 'ఏకరాజ్యము'గ నుండి రనుట సందేహాస్పదముగా నున్నది. ఈవిషయముపై మనకు దొరకిన యాధారమైన మెగాస్తనీసు గ్రంథము ఏకైకమగుటచే ఎట్లును నిర్ధారణచేయుటకు వలనుపడకయున్నది. పురాణములును బౌద్ధగ్రంథములును ఆంధ్రులను జనపదములను పేర్కొనుచున్నవేగాని రాజులను రాజ్యములను పేర్కొనుట లేదు. శాతవాహనసామ్రాజ్యమునకు పూర్వము పాలించిన యాంధ్రరాజొకఁడుగాని పేర్కొనఁబడ లేదు కావున ఆంధ్రులు మన దేశమందలి ఇతర రాజ్యములవలె, మౌర్యులకు పూర్వము ప్రజాస్వామ్యజనపదముగా ఇతరులకు లొంగకయుండిరని తలంచుట సముంజసముగా నున్నది. ఆతర్వాత రెండు పురుషాంతరములకు అశోకసామ్రాట్టు కాలమున వీరు తమ స్వాతంత్ర్యమును కోలుపోయి పాటలీపుత్రకము నుండి పరిపాల్యులైరి. మౌర్యులకు వీరు లొంగిపోయిన సందర్భములు తెలియరావు. చంద్రగుప్తమౌర్యుఁడే వీరిని దక్షిణాపథముతో జయించెనని కొందఱు తలంచుచున్నారు. దీనికి ఆధారము ఋజువుపడని నమ్మఁదగని జైనపారంపరి, చంద్రగుప్తుఁడు దక్షిణాపథమునకు మైసూరికి వచ్చెననునది తప్ప మరొక్కటి దృఢమైనది కానరాదు. ఈవిధముగానే తిబెట్టు చరిత్రకారుఁడు తారానాథుఁడు లిఖించిన బౌద్ధపారంపరి చంద్రగుప్తుని కుమారుఁడు బిందుసారుఁడు దక్షిణాపథమును జయించెనని నుడువుచున్నది. మౌర్యుల యాంధ్రదేశ విజయకాలమును నిర్ణయించుటకు సాధ్యము గాకపోయినను, అశోకుఁడు రాజ్యమునకు వచ్చుటకు మునుపే ఈకార్యము నెఱవేరినదనుట నిశ్చయము; ఏలయన అతఁడు జయించినది కళింగదేశ మొక్కటియే.

ఆంధ్రచరిత్రపరిశోధకులు పరికించవలసిన యవశ్య విషయము ఆంధ్రకళింగ సంబంధము. ఆంధ్రులును కళింగులును భిన్నజాతులవార

నియు ఇరుగు పొరుగు సంబంధముతప్ప వీరికింకేమియు లేదనియు కొందఱు తలంచుచున్నారు. శాసనములలోను వాఙ్మయములందును కళింగులు ప్రత్యేకముగా పేర్కొనఁబడియున్నను వీరు ఆంధ్రులలో నొకతెగగా నుండి చాల ప్రాచీనకాలముననే చీలిపోయిరని తలంచుట కాధారములు కలవు. కళింగముయొక్క ఎల్లలు పరంపరగావచ్చు జనశ్రుతిచే నేవో పరికింతము. పశ్చిమమున (లేక నైరృతియందు) గోదావరి. తూర్పున (ఈశాన్యమున) మహేంద్రగిరి. త్రి, లేక, సప్త కళింగములు వీనిలో చేరియున్నవే. మన చరిత్రప్రారంభమైన కాలమునుండియు ఈప్రదేశము తెలుఁగు మాటలాడుచు, తెలుఁగువారితో సంబంధ బాంధవ్యములు గలిగి ఆచారవ్యవహారములలో పాల్గొనుచున్నవారితో నిండియున్నది. కొందఱు ఉత్కళము లేక ఉత్తర కళింగమనఁబడు ఒరిస్సా మండలముకూడ కళింగమునందు చేరినదనియే తలంచిరి. కాని దొరకిన యాధారములు ఇందులకు విరుద్ధముగానున్నవి. ఉత్కళ-ఒరిస్సా శబ్దములు పర్యాయపదములుగా నుపయోగపడుచున్నను అవి ఏకార్థకమై ఏకమాతృకగలవి గావు. ఒరిస్సా యనునది ఉడిస్సా యనుదానికి ఆంగ్లము. ఉడిస్సా, సంస్కృత ఉదీచ్యశబ్దముయొక్క అపభ్రంశము. అనఁగా ఉత్తరదేశమని యర్థము. ఈశబ్దమునుండియే ఒడ్డె, ఓఢ్రము, ఇత్యాది పదములు (ఉరియాలను నర్థమునను తద్భాష యనుటకును) నేర్పడినవి. ఉత్కళము అర్వాచీనపదము. అది తొలుత ఒరిస్సానుండి కళింగగంగరాజులు జయించిన భూమికి పేరైనది. కళింగమును ఒడ్డెయు రెండు ప్రత్యేక రాష్ట్రములవేర్లుగా పదునొకండవ శతాబ్దమువరకుకూడ చోళశాసనములలో కనఁబడుచున్నవి. వీనిప్రకారము కళింగమునకు మహేంద్రగిరి ఎల్ల. ఒడ్డెకు ఎల్ల స్పష్టము గాకున్నను దాని నానుకొని యున్నదనుట నిశ్చయము. ఈవిషయములనెల్ల పరిశీలింపఁగా చోళులును పాండ్యులును ఏరీతిగా తమిళులో, అట్లే ఆంధ్రకళింగులు రా

కీయముగ భిన్నులైనను ఒకరే (ఆంధ్రులే) యనియు భాషావాఙ్మయ రక్తసంబంధములు గలవారనియు నా యభిప్రాయము.

నేనిదివరకే చెప్పినట్లు ఆంధ్రుల ప్రాచీన చరిత్ర, క్రీస్తుశకమునకు పూర్వమును తర్వాత వెనువెంటను, చాల అస్పష్టముగనున్నది. ఆంధ్ర చరిత్ర పరిశోధకులైన మనకు ఏతచ్చరిత్రకాధారములైన విషయముల నెల్ల సంగ్రహించి విషయమరసి చరిత్రను నిర్మించుట విధి. చరిత్రకారుని పని సులువైనది కాదు. ఆంధ్రదేశమునకు నేడు రాజకీయముగ నొక యాకారము లేదు. ఇది శకలములై ఇరుగు పొరుగున నుండు మూడు రాజ్యములలో చేరియున్నది. ఈ రాజ్యములలోను రాజధానులకును గల పరస్పర వైషమ్యములచేతను ఆత్మార్థతచేతను ప్రాచీన చరిత్ర పరిశోధనకు వలసిన యాధారముల సంచయమునకు హానికలుగుచున్నది. పురాతనవాస్తుశాస్త్రమును లిపిశాస్త్రమును మనకు గల ముఖ్యాధారములు. పురాతనవాస్తుశకలములు ఎక్కువగా భూగర్భమున నున్నవి. అర్వాచీనములైన గృహాదికములు తప్ప మిగిలినవన్నియు నేపథ్యములే. ప్రాచీనవాస్తు స్థలములలో ఉత్ఖననకార్యము సామాన్య చరిత్రపరిశోధకుని కలవడని పని. రాజ్యాంగమునాయు విశ్వవిద్యాలయములును ముందంజవేసి పూడిపోయిన నగరములను త్రవ్వి గాని లేక ధనాధికారము గలవారికి ధనసహాయము చేసి గాని చరిత్రకారుల కుపకార మొనర్పవలెను. మన విశ్వవిద్యాలయములన్నియు దరిద్రములు. అథవా ధన మిచ్చినను దానిని నేను జనాకర్షకముగానుండు భౌతికాది శాస్త్రములకొఱకు వినియోగింతురే గాని లాభము లేని పురాతత్త్వ శాస్త్రమునకు వినియోగింపరు. ఇండియాగవర్నమెంటువారును కొన్ని గొప్ప సంస్థానములవారును ఆర్కియాలజిశాఖను చరిత్రాన్వేషణకై నడుపుచున్నారు. చాలమంచిపనియే వీరు చేసియున్నారు, కాని

వీరు అలవోకగా గాక ఏదేనొక శాస్త్రపద్ధతిననుసరించి పనిచేసియుండిన యెడల వీరికృషి చాల ఫలవంతమై యుండెడిది. ఇండియాగవర్నమెంటు ఆర్క్యాలజీ డిపార్టుమెంటువారి కార్యములెల్ల నిట్లే యున్నవి. ఇందుల ఫలితముగా ప్రాతప్రదేశములు పెక్కులు ఇంకను పరిశోధితములు గాకయేయున్నవి. ఎపిగ్రఫీ (అక్షరశాస్త్రము) డిపార్టుమెంటువారి కథ వేఱుగానున్నది. మన శాసనములు పెక్కులు భూమిమీఁదనే పడియున్నవి. రాళ్లమీఁదను, గుట్టలమీఁదను, స్తంభముల మీఁదను, గోడలమీఁదను, గుహాలయందును, దేవాలయములయందును చెక్కఁబడియున్నవి. ఆర్కియలాజికల్ డిపార్టుమెంటువారి ప్రధాన శాఖగా ఎపిగ్రఫీ డిపార్టుమెంటు, శాసనములను సేకరించి, నకళ్లు తయారుచేసి, వానిని పఠించి ప్రకటించి చరిత్ర కుపకరించుట కేర్పాటు చేయఁబడియున్నది. కొన్నివేల శాసనములు ఇప్పటికి సంగృహీతములై ప్రకటితములై యున్నవి. పెక్కులు ప్రకటింపఁబడలేదు. పెక్కులు సంగృహీతములే కాలేదు. అధికారుల చపలచిత్తమువలన ఈడిపార్టుమెంటు పనిని నిలుపుదలచేసినట్లే యున్నను వీరు మరల పనిప్రారంభించి కొనసాగించి త్వరలో ప్రకటించి మన చరిత్రాన్వేషణకు సాయము చేయుదురని ఆశించుచున్నాము. ఇన్ని కష్టములును అడ్డములును ఉన్నను మనకు దొరకిన సాధనసామగ్రిని ప్రోగుచేసి ఇతరోద్దేశములను మరచి, తత్త్వముమీఁద దృష్టియుంచి, శ్రద్ధగా పనిచేయుదుమేని మన పూర్వచరిత్రను చాలవరకు చక్కఁగా రచింపఁగలమని నమ్ముచున్నాను.

---

గుంటూరు ఆంధ్రేతిహాస సాంస్కృతిక సంశోధకమండలివారి 1947 ఆంధ్ర శాతవాహన మహోత్సవసందర్భమున కావించిన యధ్యక్షోపన్యాసమునకు ఆంధ్రము.

# ౨. పల్లవులెవ్వరు?

సుప్రసిద్ధ చరిత్రకారుఁడగు విన్సెంటు. ఎ. స్మిత్తుగారు తమ ప్రాచీన హిందూదేశ చరిత్రయందు పల్లవులనుగూర్చి యిట్లు ప్రశ్నించు చున్నారు. "పల్లవులెవ్వరు? వారెచటినుండి వచ్చిరి? దక్షిణదేశపు రాజ్యములలో వారగ్రస్థానము నెట్లార్జించిరి?" మఱియు తమ ఆక్సుఫోర్డు హిందూదేశచరిత్రమున వారే, "హిందూదేశ చరిత్రమునందు పల్లవుల (చరిత్రము) పరమ రహస్యముగనున్నది" అని నుడివియున్నారు.

వాస్తవము విచారింపఁగా పల్లవులచరిత్ర మతి గూఢతమమగు నొక మహాసమస్యగ గన్పట్టుచున్నది. ఈసమస్యను పలువురు పలువిధములఁ బూరించియున్నారు. ఆంగ్లభాషనెఱుఁగని పరిశోధకుల కొఱకు వఱచుటకై శాస్త్రజ్ఞులగు పండితు లీవిషయమునుగూర్చి బయలు పుచ్చిన యభిప్రాయములను వర్ణించి, తదనంతరము నాయభిప్రాయమును దెల్పుచున్నాను.

పల్లవులాద్యమున భారతీయులు గారనియు, వారు పారశీక మునుండి వచ్చిన పార్థవులలో నొక తెగవారనియు, కొందఱు పండితు లభిప్రాయపడియున్నారు. రైసుగారిట్లు తమ యభిప్రాయమును వెల్ల డించియున్నారు. "తాము భారద్వాజ గోత్రజులమని కొన్ని శాసనముల యందు చెప్పుకొనియున్నను, పల్లవులయుత్పత్తి యిట్టిదని నిశ్చయించి చెప్పుటకు వీలులేకయున్నది. హైహయ, శక, యవనాదులను వర్ణించు సందర్భమున, పురాణములు వీరిని పహ్లవు లను పేర పేర్కొనుచున్నవి. వీనివలన వీరి యుత్పత్తిస్థలము పారశీకమని తోఁచుచున్నది." అయినను ప్రొఫెసరు వీబ రిట్లు చెప్పుచున్నాఁడు.

"ఈ 'పహ్లావ' యనుమాట పారశీకమున చిరకాలమునకుముందే, జాతిసంబంధముగ వాడఁబడినపుడు అన్యదేశజుల నామముగా నెన్నఁ బడెను. పహ్లావభాషాగ్రంథములలో నది (జాత్యర్థమునఁ బ్రయోగింపఁ బడిన పహ్లావశబ్దము) కాన్పించదు. కాన, పహ్లావులు హిందూదేశమునకు పోయినకాలము రమారమి క్రీ. శ. ౨, ౪ శతాబ్దముల మధ్యకాలమున నని స్థిరపఱుపవలసియున్నది. పహ్లావశబ్దముచే పారశీకదేశజులని మనమనుకొనఁగూడదు. వారు పారశీకులనువేరఁ బరగుచున్నారు. అందువల్ల ఆర్సాకిడుజాతికి సంబంధించిన పార్థవులని గ్రహించవలయును. పల్లవశబ్ద మొకవేళ పార్థవశబ్దభవమై యుండవచ్చును"

**Mysore Gazetteer.**

ఇంచుమించుగా నిట్టి యభిప్రాయమునే ఫ్లీటుగారును, వెంకయ్యగారును ప్రచురపఱచి యున్నారు. వీరి యభిప్రాయములను దుబ్రేగారు పోలఁజేయుచు యీక్రిందిరీతిని వ్రాసియున్నారు.

ఈయభిప్రాయమును బలపఱచువారు, పల్లవులు పార్థవజాతికి సంబంధించిన యాత్రావాలనియు, పారశీకమునుండి వచ్చి యుత్తరాపథమున నెచ్చటను నిలువఁజాలక పోవుటచే కాంచీపురమువఱకును దండెత్తిని సాగించిన దేశద్రిమ్మరుల గుంపనియు విశ్వసించుచున్నారు. ఇది మనస్సును రంజింపఁజేయు నూహ. పార్థవులనఁబడు తెల్ల మనుజులు ధనుర్ధరులై (పార్థవబాణము సుప్రసిద్ధము) దేశాటనముచేయు గుంపుగఁ గూడి, తమ శిబిరముల నొకదేశమునుండి యింకొకదానికి లేవదీసికొని పోవుచు, మార్గమున గనఁబడు వస్తువుల నన్నిటిని మిడుతలవలె నాశము జేయుచుండిరని వీరు తమ మనశ్చక్షువుముం దొకచిత్రమును జిత్రించుకొనియున్నారు. ఈరీతిని వారు హిందూస్థానమునందంతటను ద్రిమ్మరి, కడపట నీ ద్వీపకల్పపు దుదిభాగమున నిలిచియుందురు. తదనంత

రము, దక్షిణదేశములోనున్న ప్రాచీనులగు జాతులవారి నోడించి, తమ రాజధానిని కాంచీపురమునందు స్థిరపఱచుకొనియుండురు. ఈ పైయభిప్రాయమున కొక గొప్పయాక్షేపణయున్నది. పార్థివులలో నొక్క తెగవారందరిచేతను సేయఁబడి పారశీకపు సరిహద్దు మొదలు దక్షిణ హిందూ ద్వీపకల్పమువఱకు వ్యాప్తమైన యీ పెనుదండయాత్ర దక్కనురాజ్యస్థితులలో మహాకల్లోలమును గలుగఁజేసి యుండవలయును. ఇట్టి ముఖ్యవిషయమెప్పుడు జరిగియుండును? కొందఱు గ్రంథకర్తలు, ముఖ్యముగ వెంకయ్య, 'పల్లవులు దక్షిణదేశమునకు వచ్చినకాలమును నిర్ధారణసేయుటకు బ్రయత్నముచేసిరి. అయినప్పటికిని, నేటివఱకును . పార్థివులు దక్షిణదేశముపైఁజేసిన దండయాత్రకు నిదర్శనముగ జూపగలది యేదియు గన్పింపలేదు. ఈ యభిప్రాయము గూఢమగు పల్లవసమస్యను మఱింత గూఢముగ సేయుచున్నది."

ద. పూ. చ. పుటలు 46-47.

పై కారణములచే నీయభిప్రాయము సరియైనదికాదని త్యజింపఁబడినది. పల్లవులు అన్యదేశమునుండి రాకున్న, వారిపుట్టుక యెట్టిది? వారెచ్చటివారు? వారాద్యమున నుండియు భారతీయులేనా? అట్లయిన వారికిని తక్కిన భారతీయ జాతులకును ఉన్న సంబంధమెట్టిది? ఈ ప్రశ్నలకు సరియగు సమాధానము జెప్పవలసియున్నది. ఈసందర్భమున పేరును యశమును గడించిన పండితుల వాదములను గమనింపవలసియున్నది. వీరు, పల్లవు లఱవవారేయని యొప్పుకొన్నను,ముఖ్యవిషయములయందు అభిప్రాయభేదముల గనఁబఱచియున్నారు. అందువలన వీరి యభిప్రాయముల నెఱుఁగుట యావశ్యకము. వీరిలో ముఖ్యుఁడు విన్సెంటు ఏ. స్మిత్తు. ఆక్స్ఫర్డు హిందూదేశ చరిత్రమునం దాయన దన భావములను వెల్లడించియున్నాఁడు.

"కరికాలచోళునియొక్కయు సింహళరాజగు గజబాహువుయొక్కయు కాలమునకు జరువాత, చరిత్రరంగస్థలమునఁ బ్రథమమున నగపడుశక్తి పల్లవులది. ఆఱవ శతాబ్దపు మధ్య సముద్రగుప్తుఁడు, కంచి లేక కాంచీపురనాథుఁడగు పల్లవరాజు నొక్కని నెదుర్కొనెను. ఆంధ్రులు గతించిన పిమ్మట, మూఁడవశతాబ్దమున వారివంశ ముద్భవించి యుండవచ్చుననుట యసంభవముగాదు.

"పల్లవులు హిందూదేశపు చరిత్రలోని గూఢరహస్యములయం దొక్కదాని కాస్పదులై యున్నారు. వారు పహ్లావులు అనగా పశ్చిమోత్తరదిశనుండి వచ్చిన పార్థవులు లేక పారశీకులను నూహ మాటలపై పోలికలవల్ల స్ఫురించినదనుటచే దానిని పాదులేని యూహ యని సత్వరముగ ద్యజింపవచ్చును. వారినిగూర్చి తెలిసిన విషయములన్నియు, వారు ప్రాచీన తమిళగాథలలో ప్రాముఖ్యతవహించినట్టియు, ఆద్యమున పశుపాల్యమే ముఖ్యవృత్తిగా గల్గినట్టియు కురుంబులో తత్సంబంధికులగు ద్వీపకల్పనివాసులగు నొక జాతివారో యని సూచించుచున్నవి కొన్నిసమయములయందు పల్లవులు "ఆటవికులు"గ నెన్నఁబడియున్నారు. సాహసాజేయ క్షాత్రగుణములచే సిటీవలగూడ ప్రఖ్యాతినొంది, అప్రతిహతులగు సైన్యస్తోమములలోనివారుగ బరిగణింపఁబడిన కళ్లర్లతో రక్తైక్యతగలవారుగ నగపడుచున్నారు. తిరుచినాపల్లి, తంజావూరు, మధుర జిల్లాలమధ్యనున్న పుదుకోట సంస్థానాధిపుఁడు కళ్లఁడు. అతఁడు పల్లవరాజుల వంశమున బుట్టితినని చెప్పుకొనుచున్నాఁడు. తన పూర్వికుల మార్గములను ద్యజించి యాతఁడు తిరుచినాపల్లి కలెక్టరుగారి సలహాప్రకారము ప్రభుత్వముసేయు నిప్పటిరాజుల తరగతిలో జేరియున్నాఁడు"

ఈ పుటయొక్క అధోజ్ఞాపికయం దిట్లు వ్రాసియున్నాఁడు.

"సంపూర్ణస్థానిక (Local) జ్ఞానముతో వ్రాయు శ్రీనివాసఅయ్యంగారి మతానుసారము పల్లవులు ఆస్ట్రేలేషియా వాస్తవ్యులగు నీగ్రిటోలతోడను, తదనంతరమున వచ్చిన మఱియొక సంకీర్ణ జాతితోడను గలసిన నాగజాతికి సంబంధించినవారు. వారి పురాతన నివాసస్థలము తొండమండలము (మదరాసు చుట్టునున్న జిల్లాలసమూహము). తంజావూరు, తిరుచినాపల్లిలు తరువాత సంకలితము సేయఁబడినవి. క్షత్రగుణ సంపన్నమగు పల్లిలేక కురుంబజాతివారినుండి పల్లవసైన్యము కూర్పబడెడిది. మువ్వురు తమిళరాజులకును పల్లవరాజులకును వంశపారంపర్య శత్రుత్వముండెను. దక్షిణదేశమున పల్లవులు దేశములోనికిఁ జొచ్చుకొనివచ్చిన యన్యులుగఁ పరిగణింపఁబడిరి. కావున తమిళభాషలో పల్లవ శబ్దమునకు దొంగయను నర్థము గలిగినది. చోళపాండ్యదేశములయందు నివాసస్థానము లేర్పఱచుకొన్న పల్లవులు కళ్లరులు అనఁగా దొంగలని పేర్కొనఁబడిరి. వీరందఱును నాగజాతికి సంబంధించిన వారని చెప్పుట కేసందేహమును లేదు."

"ఆవాక్యములు గ్రంథములోని (Text) యభిప్రాయమును బలపఱచుచున్నవి. ఇవి (అభిప్రాయములు) కొన్ని సంవత్సరములకు ముందేర్పడినవి."

పల్లవులు పశ్చిమోత్తర దిగ్భాగమునుండి హిందూస్థానమును జొచ్చి దక్షిణమునకు వచ్చి కాంచీపుర ప్రాంతములయందు శాశ్వత నివాసస్థలముల నిర్మించుకొన్న పారశీకు లనుమతమును స్మిత్తుగారు నిరసించినది బాగుగనే యున్నది. కాని, వారు కళ్లరులని, కురుంబులని వ్రాసినవ్రాత కేమియు నాధారము గానరాదు. కళ్లజాత్యుద్భవుఁడగు పుదుకోట సంస్థానాధిపతి తాను పల్లవవంశజుఁడనని చెప్పుకొనుటయే దీనికి వారుచూపిన ప్రమాణము. వాస్తవముగ పుదుకోటరాజా కళ్ల

జాత్యుద్భవుఁడా? అవునను కొన్నను అతఁడు తాను పల్లవుఁడనని చెప్పు కొనుటచే పల్లవులును కళ్లరులును ఒకజాతివారను సిద్ధాంతము సరియై నదా? గొల్లవాండ్రందఱును తాము యాదవుల మనుచున్నారు. చతుర్థ కులజులగు కాకతీయ రాజులును దమవంశమును ఇక్ష్వాకున కంటగట్టిరి. ఇంతమాత్రముచే వీరందఱును క్షత్రియులగు యాదవులును ఇక్ష్వాకు లును నగుదురా? లేక యాదవులును గొల్లవాండ్రును నొక్కరేనని సిద్ధాం తము సేయుట సరియా? కావున, ఘుడుకోటరాజు తాను పల్లవవంశజుఁడ నని చెప్పుమాటయే కారణముగాఁజూపుచు పల్లవులును కళ్లరులు నొక్క రేయని సిద్ధాంతీకరించు వాదము నిలువజాలదు. ఇక శ్రీనివాసయ్యంగారి వాక్యములు స్మిత్తుగారిసిద్ధాంతము నెంతవఱకు బలపఱచునో చూతము. మువ్వురు తమిళ రాజులకును బల్లవ రాజులకును వంశపారంపర్యముగ వైర ముండుట ; పల్లవశబ్దమునకు దమిళ దేశమున దొంగయను నర్థము గల్పిం చుట; వీనినిబట్టిచూడ స్మిత్ శ్రీనివాసయ్యంగార్లనుకొనురీతిని పల్లవులు దమిళులుగారను నూహాపోదముచున్నది. వీరన్యదేశమునుండి ద్రావిడ మందు బ్రవేశించిన వారగుటచేతనే తమిళ రాజులకును వీరికిని శాశ్వత వైరము గల్గుటకు గారణము. తత్కారణముననే పల్లవశబ్దమునకు చోరు లను నర్థమును ఆఱవవారు గల్పించుకొనిరి.

సింహళమునకును హిందూదేశమునకును మధ్యనున్న జాఫ్నా ద్వీపకల్ప వాస్తవ్యులగు మొదలియారు రసనాయగముగారు పల్లవుల జన్మస్థానము జాఫ్నాయని యొక క్రొత్తవాదమును బయటవెట్టిరి. వీరి వాదమున కాధారము 'మణిమేకలై' యను నఱవకావ్యము. ఈగ్రంథ మున కరికాలుని మరణానంతరము, అతనిపుత్త్రుఁడు కిళ్లియనువాఁడు, ఉరయూరునందు రాజ్యము చేసినట్లు వర్ణింపఁబడినది. అతని తమ్ముఁడగు ఇళంకిళ్లి లేక ఇళంకో యనువాఁడు కంచియందుండెను. అతని పిమ్మట

కిల్ళికి నాగకన్యవల్లఁబుట్టిన తొండమాన్ ఇళంతిరయన్ అనువాఁడు కంచి రాజ్యమున కభిషిక్తుఁడాయెను. తొండమాన్ ఇళంతిరియనను నతఁడు కిల్ళికిని, మణి పల్లవపు నాగరాజు, వళైవానుని కుమార్తెయగు పీలివళి కును బుట్టిన కుమారుఁడు. మణిపల్లవమునుండి పూహారునకు వచ్చు మార్గమున నావపగులుటచేత నాతఁడు సముద్రమున గొట్టుకొనిపోయె ను. గాని యాతఁడు దొండైతీవలయందు దగులొ్కని యొడ్డునకు గొట్టు కొనివచ్చెను; తత్కారణమున నాతనికి తొండమాన్ ఇళంతిరయ ననియు, తొండైమానని యు, సముద్రమునుండి తీరమునకు గొట్టుకొని వచ్చుటచే తిరయన్ అనియు పేర్లు వచ్చినవి. తొండమండలము చోళ మండలమునుండి వేర్పరుపఁబడి ఇళంతిరయను కాతని తండ్రిచే నొసఁగఁ బడెను. ఆతనికి కంచి రాజధాని. తొండమండలమును స్వతంత్రముగ నేలిన రాజులలో నాతఁడే ప్రథముఁడు. వాని వంశమునకే పల్లవ వంశమని పేరు.

ఇళంతరయుని నాగమాత యాతని తండ్రికంటె హీనకులజురా లగుటచే నాతనివంశము పితృవంశము పేరఁగాక మాతృజన్మభూమియగు మణిపల్లవము పేర పేర్కొనఁబడెను. మణిపల్లవమే జాఫ్నాయని సిద్ధాంతీక రింపఁబడినది. అప్పుడది యొకద్వీపముగనుండెను. హిందుదేశమునుండి పోవువారలకది లంకాద్వీపపు శాఖవలె గాన్పించియుండును. కావున దానికి పల్లవమని పేరువచ్చెను. పల్లవశబ్దమున కఱవములో రెమ్మయని యర్థము. మణిపల్లవమను మాట మణిమేకలయందు మాత్రము గాన్పిం చుచున్నది. ఇంతకు పూర్వమున్న పేరు మణిపురము. నాగుల కునికిపట్టై నాగరాజుల యేలుబడి యందుండుటచే దానిని సింహళ ద్వీపవా స్తవ్యులు మణినాగ ద్వీపమందురు. తమకు రెమ్మవలె గాన్పించుటచే, పల్లవ మను పేరు 'మణి' యను నుపసర్గకు నఱవవారిచే సంకలితము సేయబడి

నది. కడపటి పల్లవరాజులు బుద్ధ్యాంకుర, నయాంకుర, తరణాంకుర, లలితాంకుర యని సంస్కృతమున రెమ్మయను నర్థముగల 'అంకుర' శబ్దాంతములగు బిరుదులను ధరించిరి. 'రెమ్మ' యని పల్లవ శబ్దమునకు సమానార్థముగల 'పోతు' అను నఱవమాటను నొకబిరుదుగా ధరించిరి. ఇందు వల్ల వారు తమ వంశోత్పత్తిస్థానమును జ్ఞప్తియందుంచుకొని, ఆయర్థము నిచ్చు బిరుదులను ధరించిరని తెలియవచ్చుచున్నది. పల్లవరాజులచే ధరింపఁబడిన 'పోతరాయర'ను బిరుదు పల్లవశబ్ద సమానార్థకమును, రెమ్మ యను నర్థముగల 'పోతు' అను నఱవ మాటనుండి పుట్టినదే'

**Indian Antiquary XLVI.**

ఈవాదము వింతయైనది. స్మిత్తుగారు పల్లవు లఱవదేశ వాస్తవ్యులుగ నుందురన, రసనాయగముగారు వారిని జాఫ్నా ద్వీపకల్పములోని తమ గృహాపురోభాగమునకే లాగిరి. మణిపల్లవ ద్వీపమున కాపేరు వచ్చిన విధమును వివరించు సందర్భమున సింహళమునకు (హిందూదేశమునుండి) బోవు తమిళుల కది లంకాద్వీపపు రెమ్మవలె గన్పించుటచే, మణియను సుందరమగు రెమ్మయని స్వభావముం దర్థముగల పల్లవశబ్దము నతికించుటచే మణిపల్లవనాము మేర్పడెనని చెప్పిరి. వృక్షమున కంటుకొనిగదా రెమ్మ యుండవలయును? ఇప్పటివలె పూర్వకాలమునగూడ జాఫ్నా ద్వీపకల్పమైయుండిన రసనాయగముగారి వాదమున కనుకూలముగ నుండియుండును. "ఆకాలమున అది యొక ద్వీపము" అని వారే యొప్పుకొనియున్నారు. కావున సింహళదేశమునకు బోవువారి కది రెమ్మవలె గాన్పించుటయు, తత్కారణమున నఱవలు దానికి స్వభావయందు రెమ్మయను నర్థముగల పల్లవమను పేరిడుటయు నసంభవములు. ఇంకొకమాట. పల్లవ, పోతశబ్దములు రెండును సంస్కృతములే రసనాయగముగారనుకొన్నట్లు అఱవమాటలుగావు. కావున అఱవ లీమాట

లను వాడిరనుట సమంజసముగాదు. మణిమేకల యందలి కథకును పల్లవోత్పత్తి ప్రకారమునకును నేసంబంధమును లేదని నాతలంపు. ఈసందర్భమున రెండుప్రశ్నల నడుగవలసియున్నది (౧) తొండమాన్ ఇళందిరియన్ కిళ్ళికుమారుఁడు గదా. తద్వంశజులకు పల్లవులకెవ్వరికిని అటువంటి పేర్లు లేకపోవుటెట్లు? చూడుఁడు: నిడుముడి కిళ్ళి, కిళ్ళి, కొచ్చెంగన్, ఇళంకిళ్ళి, ఇత్యాది చోళనామములును! నిడుమారన్, నిడుంజెళియన్, ఇత్యాది పాండ్యనామములును; నెండన్ చేరన్, చెంకుట్టువాన్ ఇత్యాది చేరనామములును పల్లవవంశమును గాలించి చూచినను కల్కొమునకైన గాన్పింపవు పల్లవు లటువంటి యిది యెట్లు సంభవించును? (౨) తొండమండలము ఆంధ్రరాజ్యమున జేరియుండెనుగదా? ఆంధ్రరాజ్యాంతమున సామంతులగు నాగరాజులేగదా తొండమండలమున స్వతంత్రులైనది? నాగకన్యాకా సంబంధముచేతగదా పల్లవుల కీ రాజ్యమువచ్చినది? అట్లైన కిళ్ళియను చోళరాజునకది స్వాధీనమై యుండుటెట్లు? దానిపై నాతఁడు ప్రథమమున నిజసోదరుని ప్రతినిధిగ నేయుటెట్లు? తదనంతరము నాగకన్యవల్ల దనకుద్భవించిన తొండమాన్ ఇళంతిరయన్‌ను రాజును నేయుటెట్లు? చోళు లీదేశము నెప్పు డెవ్వరికడనుండి గెల్చి సంపాదించిరి? ఈప్రశ్నల కన్నిటికిని తృప్తికరములగు సమాధానము లియ్యక పల్లవు లటవలను వాదమును నిలుపుటకు సాధ్యమగునా? కావుజూడ పల్లవులటవలు కా రను వారివాదమే సమంజసముగనున్నది. ఇట్టి వాదమును ప్రథమమున ప్రతిపాదించినవారు చిలుకూరి వీరభద్రరావుగారు. తొండమండలమునకు వీరిచే గల్పింపఁబడిన వ్యుత్పత్తి, రససాయగముగారి వ్యుత్పత్తికంటె సమంజసముగ నున్నది రససాయగముగారి మతానుసారము, తొండైయను లతలయందు దగుల్కొని, చోళరాజగు కిళ్ళికిని, నాగకన్యకకును బుట్టిన కుమారుఁడు, కడలిదరికి గొట్టుకొనివచ్చుటచే

నాతనికి తొండమానను పేరువచ్చెను. తొండమాను రాజ్యము నేలిన విషయముగుటచే నాతఁడేలిన రాజ్యమునకు తొండమండలమను నామము గల్గెను. తొండమండల నామమున కర్థము సెప్పుటకిట్లు కట్టుకథయొకటి యఱవవారు గల్పించుకొనవలసి వచ్చినది. వీరభద్రరావుగారిట్లను చున్నారు. "తొండై మండల మనునది దండకనాడు యొక్క రూపాంతర ముగఁ గన్పట్టుచున్నది. దండకనాడనునది, దండకారణ్య మను సంస్కృత పదము నుండి యేర్పడినదిగఁ గన్పట్టుచున్నది" (ఆం. చ. పూ. యు. పుట ౨౦3).

పల్లవోత్పత్తినిగూర్చి వీరిట్లు వ్రాయుచున్నారు.

"వీరలు కృష్ణా గోదావరులకు నడుమ వేంగిదేశమునఁగాని, మఱి యొకభాగమునఁ గాని యాంధ్రదేశమున నేర్పడిన యొక తెగయనుట వాస్తవము. రెండవశతాబ్దమున పల్లవరాజు లాంధ్రదేశమును పాలించు చుండిరని వారిశాసనములు వేనోళ్ల ఘోషించుచున్నవి. ఈవిషయమును జరిత్రకారులందఱును నంగీకరించియున్నారు. ఈ తెగ యొట్లేర్పడినదను విషయములో మాత్రము చరిత్ర కారులు భిన్నాభిప్రాయులై యున్నారు. పల్లవులు దారివోపిడికాండ్ర తెగయనుట కంటెను, పహ్లావులు పల్లవు లయిరని యూహించుటకే హేతువు లెక్కువగఁ గానవచ్చుచున్నవి..."

"ఈకాలముననే పహ్లావులకో శకనులకో సంబంధించిన క్షాత్ర పులు సురాష్ట్ర, మాళవదేశములను వశము చేసుకొని పాలించుచుండిరని మన మిదివఱకే తెలిసికొనియుంటిమి. ఈకాలముననే యాంధ్ర దేశమును జొచ్చి యవనశకపహ్లావాదులు కల్లోలమును బుట్టించిరనియు, ఆంధ్రుల స్వాధీనమందుండిన మహారాష్ట్ర దేశము సురాష్ట్ర క్షాత్రపులచే జయింపఁ బడి యాక్రమింపఁబడినదనికూడఁ దెలిసికొనియుంటిమి. రెండవ శతాబ్ద

ప్రారంభమునం దనఁగా ౧౩౦-దవ సంవత్సర ప్రాంతమున గోతమిపుత్ర శాతకర్ణుఁడను నాంధ్రరాజు యవనశకపల్లవాదుల నోడించి సురాష్ట్ర క్షాత్రపుఁడగు క్షహరాటనహపానువంశమును నిర్మూలముఁజేసి తన పూర్వులు కోల్పోయిన రాజ్యమును మరల సంపాదించుటయే గాక శాత్రవ భూములనుగూడ నాక్రమించెననికూడ దెలిసికొనియుంటిమి. అంతకుఁబూర్వ మాంధ్రదేశమునకువచ్చి......విశేషముగా మార్పుఁ జెందియుండిన యవనశకపల్లవాదులు దేశమున స్థిరనివాసము లేర్పఱచుకొని దేశాచార మతాచారముల నవలంబించి దేశీయులతో సంబంధ బాంధవ్యముల నెఱపుచుఁ గ్రమముగా దేశీయులలో కలసిపోయి పల్లవు లనుపేరఁగా నేర్పడిరనియు, వీరు మొదట నివసించిన ప్రదేశము పల్లవనాడై నదనియు, అదియే యిప్పుడు పల్నాడను పేరఁ బిలువఁబడుచున్నదనియును గూడ దెలిసికొనియుంటిమి.........కావున వీనినన్నిటిని పరిశీలించి చూచినపుడు పల్లవులు దేశాచార మతాచారముల నవలంబించి దేశీయనామములనే ధరించి పల్లవులై యాంధ్రులకు క్షాత్రపులకు నుద్యోగములు సల్పుచుండి క్రమముగా సేనాధ్యక్షులుగను, మంత్రులుగను నేర్పడి రాజకుటుంబములతో సంబంధ బాంధవ్యములను నెఱపుచు ప్రధాన రాజకుటుంబము బలహీనమై రాజ్యభారమును నిర్వహింపఁజాలని కాలమున స్వతంత్రులై స్వతంత్ర రాజ్యముల నేలకొల్పిరని యూహింపఁదగియున్నది. స్వదేశమును స్వమతమును మఱచిపోయి హిందూమతమునుబూని హిందూనామములను బెట్టుకొని వ్యవహరించుచు బహుకాలము వెనుక నాంధ్రదేశమునకువచ్చి, వర్ణాశ్రమధర్మము లంతగాఁ బాటింపఁబడని కాలమున నొకశతాబ్దమువఱకు నాంధ్రుల నడుమ నివసించుచుండి సంబంధబాంధవ్యములు నెఱపుచుండిన వారాంధ్రులుగాఁ గాక మఱి యెవ్వరుగా బరిగణింపఁబడవలసినది? "ఆంధ్రులనక

తప్పదు. ద్రావిడదేశమునందలి కాంచీపురమును జయించి పరిపాలించినదీ యాంధ్రపల్లవులుగాని పహ్లావులుగారు. కాంచీపురమందు కట్టకడపట స్థిరముగా నిలిచిపోయినది ఆంధ్రపల్లవులలో నొకశాఖవారు మాత్రమే గాని కొందఱు తలంచునట్లు పల్లవులందఱు కారు." ఆం. చ., పూ. యు. పుటలు ౨౦౭—౨౦౯.

ఇట్టి యభిప్రాయమునే దుబ్రేగారును వ్యక్తపఱచియున్నారు.

(౧) "ఆంధ్రసామ్రాజ్యము మహారథులను బిరుదులుగల సామంతులచే నేలబడుచుండెను. సర్పములను పూజించు జాతివారలగుటచే వీరు నాగులనుపేరఁ బిలువబడిరి.

(౨) రెండు తెరచాపలుగల యోడయొక్క ప్రతిమను ముద్రించిన నాణెములు మదరాసు కడలూరుమధ్యతీర ప్రాంతములయందు మాత్రమే దొరకినవి. ఇవి కంచిరాజధానిగాగల తొండమండలపు నాణెములు. వీనిపై "శీపులుమావి" యను మాటలు ముద్రింపఁబడియున్నవని ప్రొ. రాప్సన్‌గారు చెప్పుచున్నారు. ఉజ్జయినిసంజ్ఞ శాతవాహన వంశమును సూచించుచున్నది. కావున నీవంశస్థులు కాంచీపురమునందు రాజ్యముజేసిరి. ఇంకను, శాతవాహన వంశపు కడపటిరాజగు పులుమావిశాసనమువల్ల స్కందనాగుఁడను సామంతరాజాతనికి మహాసేనానియై యుండెనని తెలిసికొనుచున్నాము. కావున శాతవాహనుల యంత్యకాలమున నాగులు ఉచ్చస్థితియందుండిరనుట కేసందేహమును లేదు.

(౩) నాగకులులగు 'చుటు' వంశస్థులు, శాతవాహనుల యనంతరము ప్రభుత్వముజేసిన రాజకుటుంబములలో నొక్కదానికి సంబంధించిన వారు.

(౪) నాగజాతివారగు చుటువంశస్థులు ప్రాచీనులగు పల్లవరాజుల సమకాలీనులగుట నిజము.

(౫) నాగకులులగు చుటునాజుల పిమ్మట పల్లవులు రాజ్యమును పాలించిరనుట నిక్కము.

(౬) వేలూర్పాలియమందు దొరకిన పల్లవ తామ్రశాసనమున వంశపారంపర్యముగ పల్లవకుటుంబమున ప్రతీతియందున్న వంశచరిత్రము (శ్లో. 3 మొదలు ౨౨ వఱకు) వర్ణింపఁబడియున్నవి. అచ్చట, పల్లవ వంశమున రాజ్యమేలినవారిలో ప్రథముఁడు తద్రాజ్య చిహ్నములనన్నిటిని సర్పరాజుయొక్క కుమార్తెను (నాగవంశజుఁడగు రాజుకూతురనుట స్పష్టము) వివాహమాడుటచే పొందినట్లు చెప్పఁబడియున్నది. (శాస. శో. సాం. ని ప ౧౯౨౦—౨౧ జి. ఓ. పబ్లిక్ జూలై ౨౭, భా. ౨ పుట ౬౧).

(౭) నాచే విరచితమగు "పల్లవులు" (పాండిచ్చేరి ౧౯౧౭) అను గ్రంథమున విస్తరింపఁబడిన వాదమునే యిచ్చటను అనుసరించుచున్నాను. "మిక్కిలియు ప్రాచీనులగు పల్లవులు రాజులుగారు. వారు దాక్షిణాత్యులునుగారు, వారి వంశజుఁడొక్కఁడు దక్షిణదేశపు రాచకన్యక నొక్కతెను పెండ్లాడి, తన్మూలమున దానేరాజాయెను." (పల్లవులు పు. ౨౩) గిర్నారు శిలాశాసనమును చెక్కించిన కాలమున, పశ్చిమ క్షాత్రపరాజులు అపరాంతమున రాజ్యము సేయుచుండిరి. అప్పుడు పహ్లావుఁడొక్కఁడు వారికడ ప్రధానిగ నుండెను, చుటునాగులు అపరాంతమున ప్రభుత్వము జేసినకాలమున (స్కందనాగునితల్లియొక్క కాన్హేరిశాసనము. లూడర్సుగారి పట్టిక నె ౧౦౨౧ రు) పహ్లావులు వారి పొరుగున నుండిరి. ఒక పహ్లావకుమారుఁడు (prince) శివస్కంద నాగ శాతకర్ణిరాజుయొక్క కుమార్తెను వివాహముజేసుకొని, కంచిరాజ్యమును బడసెను.

"పల్లవోత్పత్తి విషయమునుగూర్చిన నావాదము సంగ్రహముగ నిదియే..." దక్కను పూర్వచరిత్రము. పుట ౪౨-౮.

కాబట్టి దుబ్రే మతానుసారము, పహ్లావుఁ డొక్కఁడు నాగరాజ కుమార్తెను బరిణయమై, తన్మూలమున గాంచీపుర రాజ్యమునుబడసి యచ్చట పల్లవవంశమును స్థాపించెను. కాని దీనికొక యాక్షేపణ కలదు. శివస్కంద నాగశాతకర్ణుని కూఁతును పహ్లావ కుమారుఁడొకఁడు ద్వాహమై, తన్మూలమున గాంచీపురమున రాజ్యమును బొందెననుట కాధారము లేదు. పల్లవకుమారుఁడు నాగకుమారి నుద్వాహము జేసి కొని రాజ్యప్రాప్తి నందినట్లు శాసనములు జెప్పుచున్నవి; కాని పహ్లావుల నెచ్చటను వేరొక్కనిరైన నుండలేదు. పల్లవులును బహ్లావులును నొక్కరే యనుట కేమియు నిదర్శనము లేదు. వారు భిన్నజాతులవారు. కావున పహ్లావు డొక్కఁడు నాగకుమారిని పరిణయమై, తన్మూలమున గాంచీపుర రాజ్యమును బడసెననుట నిరాధారమైన వ్రాత. కావున దుబ్రే వాదము నిలువజాలదు.

ఇట్టివాదము వచ్చునని యూహించి దుబ్రే దక్కను పూర్వచరిత్ర యందే దానికిట్లు సమాధానము జెప్పియున్నాఁడు.

"బాలశ్రీయొక్క సుప్రసిద్ధనాసిక శిలాశాసనమునుగూర్చిచర్చించు సందర్భమున, గౌతమీపుత్రుఁడు పల్హవులను క్రీ. శ. ౭౮ లో బరాభూతులఁగావించెనని వచించితిమి. (ఎపి. ఇండి సం. ౮ ప్లేట్ ౧. నె ౨ దు బంక్తి ౫) మఱియు, క్రీ. శ. ౧౫౦ వ సంవత్సరమున రుద్రదాముని మంత్రిసువిశాఖుఁడనువాఁడు పహ్లావుఁడని గిర్నారుశాసనమువల్ల దెలుసు కొనుచున్నాము. (జునగడ్ శాసనము: ఎపి ఇండి. సం. ౮ పుట ౩౬ ప్లేట్ లో ౧౯-వ పంక్తి). ఈరీతిగ, క్రీ. శ. ౭౮ లో 'పల్హవ' యని వ్రాయబడినమాట, క్రీ. శ. ౧౫౦ లో 'పహ్లావ' యని వ్రాయబడెను. గిర్నారుశాసనమును జూచితిమేని, అందులోని 'హ్ల' యను సంయుక్తాక్షరము 'ల్ల' యను నక్షరమును బోలియుండుటను గనుగొందుము. ఇంతే

కాక, ప్రాకృతభాషలో వ్రాయఁబడిన మైదవోలు శాసనములో నీయక్షర సమస్య సులభముగ విశదీకరింపఁబడియున్నది. దానియందు 'పల్లవ' యని వ్రాయఁబడియున్నది. ఇది పల్లవశబ్దమునకు సమానమైనది. ఏలన ప్రాకృతమున హల్లులకెప్పుడును ద్విత్వము రాదు. హీరహడగల్లి శాసనము ప్రాకృతమున విరచితమైనను, అందు పల్లవశబ్దము ద్విత్వసహితముగ వ్రాయబడి యున్నది. తదనంతరము శాసనములభాష సంస్కృతమైనపుడు, 'పల్లవ' శబ్దమునకు 'రెమ్మ' యను నర్థము గల్పించుకొనవచ్చును. నామముల ఐక్యతవల్ల ప్రాచీనులగు కంచి రాజులు రుద్రదాముని మంత్రిసంతతి వారే ననుదలఁపు కలుగుచున్నది." ద. పూ. చ. పుట ౫౫-౬).

దుబ్రేగారి వాదమునకును వీరభద్రరావుగారి వాదమునకును జాలమైత్రిగలదు. ఇద్దరును పహ్లవులే కాలక్రమమున దేశీయులతో గలసి, వారివేషభాషలను మతాచారములను నంగీకరించి పల్లవులైరను నభిప్రాయమును వ్యక్తపఱచిరి. వీరభద్రరావుగారు పల్లవు లాంధ్రులని నొక్కి చెప్పిరి దుబ్రేయట్టి యభిప్రాయమును వ్యక్తపఱచి చెప్పలేదు. ఆయితే పల్లవు లాంధ్రులే యని వీరు 'పల్లవులు' అను తమ గ్రంథము నందు జెప్పియున్నారు.

"సింహవిష్ణు, మహేంద్రవర్మల పూర్వికులు తెలుఁగు దేశమున నివసించుచుండిరని మనము సిద్ధాంతీకరింపవలసియున్నది. "మహేంద్రవర్మకు తెలుఁగుపేర్లుండుటకుఁ గారణము, అతఁడుగాని యతని తండ్రిగాని తెలుఁగుదేశమున రాజ్యముసేయుట యేనని నమ్ముచున్నాను."

"పెక్కుశతాబ్దములవఱకును, అనేక తరముల పల్లవరాజులు కృష్ణానది తీరమందలి గుంటూరు మండలమునందును, నెల్లూరుమండలమునందును రాజ్యముచేసిరి."—పల్లవులు పుటలు 3౧-33.

ఇత్యాదివాక్యములవల్ల దుబ్రేగారి యభిప్రాయమున పల్లవరాజులాంధ్రులేనని విశదమగుచున్నది.

డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారలు ప్రాచీన పల్లవులు ఆంధ్రులే యని యొప్పుకొనుచున్నారు. 'పల్లవులు' అను గ్రంథమునందు వీరిట్లు నుడువుచున్నారు. "మనకు లభ్యపడిన నిదర్శనములు, వారు (పల్లవులు) ఆంధ్రులలో నొక్కవంశమువారనియును, ఒకవేళ సాతవాహనుల సాంబంధికులుగనో, తద్వంశజులుగనో, యుందురనియును దెలుపుచున్నవి" అయినను కృష్ణస్వామి అయ్యంగారికిని దుబ్రే వీరభద్రరావులకును కొంత యభిప్రాయభేదము గలదు. దుబ్రే మొదలగు వారనుకొనునట్లు పహ్లావుల వంశజులే పల్లవులైరని వీరు నమ్మరు. పహ్లావులును పల్లవులును వేర్వేరుజాతులవారని నిరూపించుటకు వీరు క్రొత్తసాక్ష్యమును జూపిరి.

"క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దాంతమునను, పదియవ శతాబ్దారంభమునను, గూర్జర రాజులగు మహేంద్రపాల, మహీపాలుర యాస్థానమున రాజశేఖరుడను కవియుండెను. దక్షిణదేశమున పల్లవుల రాజ్యమంతరించుచుండిన సమయమదియే. అతడు భువనకోశమను భూగోళశాస్త్రగ్రంథమును రచించెను. తన కావ్యమీమాంసలోని ౧౭-వ అధ్యాయమున విషయమెక్కువగ దెలిసికొనగోరువా రాగ్రంథమును బఠించవలయునని చెప్పియున్నాడు. ఈకడపటి గ్రంథమున నాతడు హిందూదేశము నైదుభాగములుగ విభజించి, యొక్కొక్కభాగమునకును సంబంధించిన నదులను, పట్టణములను పేర్కొనియున్నాడు. అతడాయధ్యాయమున, మాహిష్మతీపురమునకు క్రిందిభాగమున విస్తరించు దక్షిణాపథములేక దక్షిణదేశము పల్లవులదనియు, ఉత్తరాపథమునం బృథూదకమునకు పైభాగము పహ్లావులదనియు నిర్ణయించియున్నాడు.

'పృథూదక' మను పేరు తరచుగా సింధునది దైయుండును. పహ్లావులు, మాణ కాంభోజ బాహ్లికాదులతో జేర్పబడియున్నారు. కావున పలు దేశముల గ్రుమ్మరి, యనేక విషయములను—సంస్కృత విద్యాభివృద్ధిని గూర్చినవే యైనను—నెఱింగిన రాజశేఖరుని యభిప్రాయమున, పల్లవులును పహ్లావులును వెవ్వేరు జాతులవారనియు, అందొకరు దాక్షిణాత్యులని యు, మఱియొకరు సింధునది యావలియొడ్డుననున్న సరిహద్దు దేశవాసు లనియు దెలియుచున్నది. రాజశేఖరుఁడర్వాచీనుఁడనుటకు సందేహము లేదు. అయినను, తనకాలమున, పహ్లావులు వేరు పల్లవులు వేరని జన సామాన్యము విశ్వసించుచున్న విషయమును వ్యక్తపఱచియున్నాఁడు."

(Journal of Indian History Vol. 2 pp. 25-26)

ఇట్లు కృష్ణస్వామి అయ్యంగారలు దుబ్రే వీరభద్రరావుల వాద మును పూర్వపక్షము గావించిరి. తచ్ఛిష్యకోటిలో జేరినవారగు సి. యస్. శ్రీనివాసాచార్యులుగారు తమ గురువుల వారా వాదమును విధ్వంసము జేసిరని నమ్ముచున్నారు. (పల్లవులు.పుట 2) ఇది వాస్తవమా యను విషయమును మనము బరిశీలింపవలయును. రాజశేఖరుని సాక్ష్య ము విశ్వాసార్హమే. అతఁడు క్రీ. శ. ౧౦-వ శతాబ్దారంభముననుండిన వాఁడు. ఆకాలమున జనసామాన్యము విశ్వసించుచున్న విషయమునే యాతఁడు వ్యక్తపఱచెనని యయ్యంగారలే యొప్పుకొనియున్నారు గదా! పల్లవులు భరతఖండమున క్రీ.శ. ప్రథమశతాబ్దమున శకులతో బ్రవేశించిరనియు, అప్పటినుండి వారాంధ్రులతో బోరాడుచు, దుద కాంధ్రరాష్ట్రమున స్థిరనివాసముల నేర్పఱచుకొని యచ్చటనే నిలిచి పోయిరని శాసనములు బల్కుచున్నవి కదా. కావున, రాజశేఖరునికి బూర్వమెప్పుడో పహ్లావులలో నొక తెగవారు చీలి సింధునది దాటి యచ్చటినుండి దక్షిణాపథమునకువచ్చి పల్లవులుగ మారియుండవచ్చును.

సింధునది కావలనున్న పహ్లావుల పేరనే రాజశేఖరుని కాలమునకును పండియుండ వచ్చును. అట్లయిన రాజశేఖరుని కాలమున పహ్లావు లుత్తరమునను పల్లవులు దక్షిణమునను నుండవచ్చును. వేర్వేరుజనులుగ పరిగణింపఁబడి యుండవచ్చును. ఇందసంగత మేమియు లేదు శబ్దశాస్త్ర ప్రకారము పహ్లావ పల్లవశబ్దము లొక్కటే యని అయ్యంగార లొప్పుకొనియే యున్నారు. ఇంక పహ్లావులును పల్లవులును ఒక్క జాతివార లేల కారాదు? కావున కృష్ణస్వామి అయ్యంగార్ల వాదము నిలువదు. ఇప్పటికి మనకున్న చరిత్రజ్ఞానానుసారము, శ్రీ వీరభద్రరావు ప్రభృతులు జెప్పునట్లు పహ్లావులే కాలక్రమమున పల్లవులైరను వాదము సరియైనదని యొప్పుకొన వలసి యున్నది. *

పల్లవుల యుత్పత్తినిగూర్చి యిటీవల కొంతపరిశోధన జరిగినది. కీ. శే. డాక్టరు సి. మీనాక్షమ్మగారు తమ పల్లవరాజ్యపాలనావిధాన మను గ్రంథమునందు పల్లవులును పహ్లావులును నొక్కరే యను వాదమును బలపఱచుటకు బ్రయత్నము జేసిరి. మాత్రేగారు చూపిన యాధారముల కంటె నీమె యాధారములు బలవత్తరమైనవి కావు. పల్లవ శాసనములను దక్షిణఇండియా శాసనావళియందు పండ్రెండవ సంపుటముగ బ్రకటించిన శ్రీ వి. వెంకటసుబ్బయ్యరుగారొక నూతనాంశమును వెలిబుచ్చిరి. "కాంచీపురమందలి వైకుంఠ పెరుమాళ్ల కోవెలలోని గండారముల క్రింది విశదీకరణ శాసనలేఖములయం దొక్కదానియందు తలఁజడ్డికొన్న పోశరను నతఁడొక గండారమును హిరణ్యవర్మమహారాజునకుఁ జూపుచు 'ఇది యేనుఁగ తల కాదు; మీకుమారునియొక్క మకుటము' అని చెప్పుచున్నట్లున్నది. ఈ శాసనభాగము పల్లవరాజుల మకుటము యేనుఁగ తలవంటి యాకృతిగలదని స్పష్టముగ సూచించుచున్నది. హిందూదేశ

* ఇంతవఱకైన వ్యాసము జయంతిపత్రిక-సం I. సం. 6 నుండి పునర్ముద్రితము.

ములోని గంధారపు బొమ్మలయందు దిట్టిదింతగ అయిన మతియొకటి కానరాదు; కాని బాక్ట్రియా ప్రభువై యుండిన దెమిత్రియసు నతని నాణెములమీఁద నతఁడు సంపూర్ణమౌ స్పష్టలక్షణములతో గూడిన యేనుఁగుతల మకుటమును ధరించినట్లు చిత్రింపఁబడియుండుట చోద్యము; అతఁడు ప్రాయశః మహాఅలెగ్జాండరు మకుటము ననుకరించి యుండును. పట్టాభిషేకకాలమున నందివర్మ పల్లవమల్లునికి సమర్పించిన మకుటమునకును బాక్ట్రియారాజ మకుటమునకును గలగాఢ సాదృశ్యము కేవలము కాకతాళీయము గాదు; దానికి పల్లవుల వైదేశికోత్పత్తి సమస్యతో దృఢసంబంధముండునట్లు తోఁచుచున్నది.”

—(దక్షి. ఇండి. శాస. సం. ౧౨, పుటలు 1-2)

వెంకటసుబ్బయ్యగారి వాదముయొక్క సారాంశ మీక్రింది రీతిని చెప్పవచ్చును.

౧. నందివర్మపల్లవమల్లుని పట్టాభిషేకసమయమున నతనికి సమర్పించిన మకుట మాకారమున ఏనుఁగుతలవంటిది.

౨. నందివర్మపల్లవమల్లుఁడు పల్లవంశజుఁడు.

౩. కావున పల్లవులది యేనుఁగుతల మకుటము.

౪. భారతీయ గంధారములయం దిట్టిమకుట మెచ్చటను గానరాదు.

౫. బాక్ట్రియారాజగు డిమిట్రియసు మకుటము సాక్షాత్తుగ కరిశిరోరూపముగలదే.

౬. డిమిట్రియసు వైదేశికుఁడు.

౭. కావున పల్లవులును వైదేశికులే.

పల్లవులకును బాక్ట్రియా యవనరాజులకును ఏనుఁగుతల మకుటము సామాన్యమేయైనను, దాని నాధారపఱచుకొని బాక్ట్రియను యవనులవలె పల్లవులును వైదేశికులని చెప్పుట తగదు. ఏనుఁగుతల మకు

టము ఛా_క్రీయను యవనరాజులును వారికి పూర్వ మలకసుందర చక్ర వర్తియు ధరించియుండినను నిది పల్లవులు వైదేశికులని నిర్ధారించుటకు సాక్ష్యము కాజాలదు. ఏమనగ భరతఖండమునను, సింహళద్వీపమునను; బర్మా మొదలగు ప్రాచ్యదేశములందును దప్ప యాసియా యైరోపా ఖండములలో మకుటముచ్చుటను గానరాదు; కావున యేనుగుల మకుట మును చేయించి ధరించు నాచారము అశ్వమున నేనుగులు సుపరిచిత ములైయుండు భారతాది పూర్వదేశములయందే ప్రారంభమై యుండ వలయును గాని యేనుగు మొగ మెఱుగని పాశ్చాత్య దేశములయందు కాజాలదు. అలకసుందరచక్రవర్తి యేనుగు తలమకుటమును భారతీ యులనుండియే గ్రహించియుండవలయును. కావున యేనుగుతల మకు టమును ధరించుటచేత పల్లవులు యవనులవలె వైదేశికులని నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. భరతఖండమున గల శిరోవేష్టనము సహజమకుట చేత పల్లవుల కది యే హిందూరాజులనుండియో సంక్రమించియుండ వచ్చును.

పురాణపరిశోధనవలన మఱియొక నూతనాంశము వెలువడినది. పహ్లావులు శకతుషారాంధ్రులతోగూడ నొకానొకప్పుడు వక్షు లేక చక్షునదీతీరమున నివసించుచుండిరట. వాయుపురాణమున (౧: ౪౭)

అథచీన మరూంశ్చైవ సఙ్గణాన్ సవనామూలికాన్
సాన్ధ్రాంస్తుషారాం స్తం పాకాన్ పహ్లావాన్ దరదాన్ శకాన్
ఏతాన్ జనపదాన్ చక్షుః ప్లావయ న్తీ గతోదధిమ్. ౪౪

బ్రహ్మాండపురాణమున (౩-౧౮-౪౬—౪౭)

అథచీనమరూంశ్చైవ కాలాంశ్చనుసమూలికాన్
భద్రాంస్తుషారాంల్లమ్పాకాన్ బాహ్లావాన్ పారటాన్ ఖశాన్. ౪౬
ఏతాన్ జనపదాంశ్చక్షుః ప్లావయ న్తీగతోదధిమ్. ౪౭

మత్స్యపురాణమున,

బాహ్లీకావాటథానాశ్చ ఆభీరాః కాలతోయకాః
పురన్ధ్రాశ్చైవ శూద్రశ్చపహ్లవాశ్చాత్త ఖణ్డికాః.

ఈపురాణ శ్లోకములవలన ఒకానొకప్పుడు పహ్లవులు చీన మరు, సజ్ఞణ, మూలిక, సాంధ్ర తుషార, లంపాక, దరద, ఖశ, పారటాదిజను లతోపాటు చక్షునదీతీరమున నివసించుచుండిరని తెల్లమగుచున్నది. చక్షునదినిగూర్చి డాక్టరు జయస్వాలుగారిట్లు వ్రాయుచున్నారు. "భారత వర్షముయొక్క పౌరాణిక భూగోళాధ్యాయమున నాలుగు నదుల మూల స్థానమును వర్ణించు ఘట్టమొక్కటి కలదు; వానియందు మూఁడు పూర్వముగను, మూఁడు పశ్చిమముఖముగను ప్రవహించును. ఇవి హిమవర్షము (మంచుదేశము) నందలి బిందుసరస్సున బుట్టుచున్నవి. సీతా లేక శీతా, చక్షు, సిన్ధువులు; మూఁడును పడమటి దిక్కునకు ప్రవహించును.

"సీతా చక్షుశ్చ సిన్ధుశ్చ తిస్రస్తా వైప్రతీచ్యగా"

(చూ. మత్స్య. అ. ౧౨౦: ౪౦; వాయు, ౧: ౪౭, ౩౯; రామా యణం. బాల. ౪౩: ౧౧-౧౪) వీనియం దొక్కొక్క నదీతటముల నుండు దేశములన్నియు విపులముగ వర్ణింపఁబడియున్నవి. (మత్స్య. శ్లో. ౪౦-౪౯; బ్రహ్మాండ ౨. ౧౮, ౪౧-౪౯) సిన్ధువు నిస్సంశయముగ (మన) సింధునదియే. చక్షు అనునది యాక్ససునది; యువ్వాంఛ్వాంగు దీనిని 'ఫోత్సు' అని పేరొ్కనినాఁడు. ఈచీనా యాత్రికుఁడు (హిందూ దేశపు సరిహద్దునఁ బ్రవహించు) సిన్ధునదికిని యాక్ససు ప్రాంతమునకును మధ్యనుండు దేశములను హిందూభూగోళమున జెప్పియుండు పేరుల తోడనే వర్ణించియున్నాఁడు. పురాణములలో భారతవర్షాము అక్సను

నదియొక్క దక్షిణతీరమువఱకును వ్యాప్తమైనట్లున్నది; అది యాదిక్కున యిప్పటి హిందూ దేశమునకంటె విశాలతరమైయుండెను.

" 'చక్షు' (కన్ను) అనునది యాక్సునదియొక్క మూలనామమగు 'ఆక్సు'నకు సంస్కృతీకరణము. దీనిని 'అక్షు (అక్షు) అని యెంచి సంస్కృతమందలి 'అక్షి'కి సమీకరణము గావించిరి. సంస్కృత వాఙ్మయమందు 'వక్షు' (వంక్షు) అని దీని రూపాంతరము గానవచ్చుచున్నది. ఇదియే మంగోలియనులోని 'బక్షు' టిబెటనులోని 'పక్షు', చీనాభాషలోని 'ఫోత్సు' లేక 'పోత్సు' అనువాని మొదటిరూపము; ఇంకను నది 'వక్షుక్' (ఇప్పటి 'వఖాక్') లో నిలిచియున్నది. దీనిపొరుగున నుండు నదిని యువన్‌ఛ్వాంగు పలుమారు 'శీతా' యని పేర్కొనియున్నాడు. కావున 'అక్సు' అనఁగా నాక్సునదికి 'వక్షు' అను నామాంతరముండుటచేత 'చక్షు' తోటి దాని యైక్యమును సంశయింప నవకాశ మెంతమాత్రమును లేదు."

—(హిందూపాలిటీ (ద్వితీ ముద్ర) పుట ౧౩౧)

ఇందువలన పహ్లావులును పల్లవులును నొక్కరే యైనపక్షమున వారొకప్పుడు హిమాలయమునకు ఖచ్చిమోత్తర దిగ్భాగమున నాక్సునదీ తీరమున నివసించుచుండిరని చెప్పవలసియున్నది. మఱియు నాక్సునదీ తటమున బహ్లావులతోపాటు నివసించుచుండిన జనులలో నంధ్రులొక్కరని తెలియవచ్చుచున్నది. ఇది చక్కఁగ గమనించవలసిన యంశము. దక్షిణ హిందూ దేశమునగూడ పల్లవులు మొదట ఆంధ్రులనుగూడి యాంధ్ర దేశమున నివసించుచుండి, యాంధ్రసామ్రాజ్యము నశించిన పిమ్మట స్వతంత్రులై కంచియందు నెలకొనిరి. దీనిబట్టి చూడఁగా నాంధ్ర పల్లవుల సంయోగము క్రీస్తు శకారంభ కాలమున దక్షిణాపథమున

గలిగినది కాదనియు ననాదిగ పురాణయుగమునుండియు వచ్చుచుండిన దనియు నెంచవలసియున్నది.

ఇట్లు పురాణయుగమునుండియు పల్లవులాంధ్రులతో గలసి మెలసియుండినచో వారు దక్షిణాపథమున కెప్పుడువచ్చిరి? ఆంధ్రులతోఁగూడనా? పూర్వమా లేక యనంతరమా? ఇప్పటి చారిత్ర పరిశోధకుల యభిప్రాయము ననుసరించి దక్షిణాపథమునకు పల్లవుల యాగమనము క్రీ. శ. మొదటి రెండు శతాబ్దములలోనో జరుగుచుండెనో యని చెప్పవలసియున్నది; కాని యింతవఱకును ఆంధ్రులును పల్లవులును ఒకానొకప్పుడు చక్షునదీ తీరమున నివసించుచుండిరను విషయము చరిత్రపరిశోధకుల దృష్టి కెక్కలేదు. ఆంధ్రులతోపాటు చక్షునదీతీరమున నుండిన మఱి రెండుజాతులవారి నిచట స్మరింపవలసియున్నది. మూలకులును పారటులును పల్లవులతోపాటాంధ్రులతో గూడియుండినట్లు పురాణములవలన దెలియుచున్నది. మూలకులాంధ్రులలో నొక యంతర్జాతికి జెందిన జనులు. దక్షిణాపథమున వీరు నివసించిన దేశమునకు ములకనాఁడని పేరువచ్చినది. ఇది పూర్వము ప్రతిష్ఠానము మొదలు నేటి యాంధ్రదేశములోని కడప పర్యంతము వ్యాపించియుండినది. జాతకకథలు రచింపఁబడిన కాలమున ములకదేశము దక్షిణాపథమందొక సుప్రసిద్ధ జనపదముగా నుండినది. నేఁటికిని ఆంధ్రబ్రాహ్మణులలో నొక తెగవారికి ములకనాటివారని పేరు చెల్లుచున్నది. పారటులు అశోకుని శాసనములందు పేర్కొనబడియుండు పాలద పారిందులే కాని యన్యులు గారు. అశోకుని శాసనములందు వీరిపేరు 'పాలద' 'పాలిద' 'పారింద' అనుమూఁడు రూపములఁ గానవచ్చుచున్నది. ఇట్లే పురాణములలోను పైఁజెప్పిన 'పారిటా' గాక 'పారదా' యను రూపముగలదు. సంస్కృతములోని 'ర' ప్రాకృతమున 'ల' కారముగ మారుట సామాన్యము.

కావున పురాణములలోని 'పారదా', యశోకుని శాసనములందలి 'పాలద'యు నొక్క మాటయే. 'పారదా' యిట్లే 'పారిద' 'పారింద' యైనది. "పాలదు (యిప్పటి) యపరాస్థానమున నుండిరి; సంస్కృత భూగోళమునకు 'పారదు' అని వారిపేరు సుపరిచితమే. పురాణముల ననుసరించి యుత్తరాంధ్రులు వీరి పొరుగున నివసించుచుండిరి" అని కే వి. జయస్వాలుగారి యభిప్రాయము. (చూ హిందూపాలిటీ. ద్వితీ. ముద్రా. పుట. ౧౫౬.) మాలవులును, పారదులును, పల్లవులును చక్షునదీ తీరమున నుండినట్లే దక్షిణాపథమునను నాంధ్రులపొత్తున గానవచ్చుచుండుట చేత వీరందఱును ఏకకాలముననే దక్షిణాపథమునకు వలసలువచ్చి యచ్చట స్థిరముగ నిలిచిపోయిరని తలంచుటయుక్తము. అగునేని పల్లవులు క్రీ. శ. మొదటి రెండు శతాబ్దములందో యించుక పూర్వముననో దక్షిణ హిందూదేశమునకు వలసలువచ్చిరని చెప్పుట సరికాదు. ఏలనఁగా వీరితోఁగూడవచ్చిన ఆంధ్రులు వైదికయుగమునుండియు వింధ్యపర్వతప్రాంతముల నివసించుచుండిరని యైతరేయ బ్రాహ్మణసాక్ష్యము వలన రుజువగుచున్నది. పురాణములకంటె బ్రాహ్మణములు ప్రాచీనతరములని చరిత్రపరిశోధకుల సిద్ధాంతము. ఈ సిద్ధాంతముచొప్పున వైదికయుగము కడపట వింధ్యప్రాంతముననుండిన ఆంధ్రులు పురాణయుగమున చక్షునదీతీరమునకు వలసలుపోయిరని చెప్పవలసివచ్చును. అట్లు వారు దక్షిణాపథమునుండి భరతఖండమున కుత్తరముననుండు హిమవర్షమున బ్రభవించి పశ్చిమముఖముగ బ్రవహించుచుండిన చక్షునదీతీరమున కేగిరని తెలుపు సాక్ష్యమెద్దియు గానరాదు. మనకు లభించిన సాక్ష్యమంతయు వారు వైదికకాలమునుండియు దక్షిణాపథముననే యుండిరని చాటుచున్నది. కావున పురాణములందు చెప్పినట్లు వారు చక్షునదీ ప్రాంతములం దొకప్పుడు నివసించుచుండినది వాస్తవమైన పక్షమున,

వారటుపిమ్మట నచటినుండి దక్షిణ హిందూస్థానమునకు వలసవచ్చిరని తలచుట సమంజసముగ నున్నది. ఈయభిప్రాయము నంగీకరించిన ప్రస్తుతము చారిత్రక పరిశోధనయందు వాడుకయందుండు వైదికపౌరాణిక కాలానుక్రమణికను మార్చుకొనవలసియుండును. నేడు ప్రచారమున నుండు పురాణములన్నియు వైదికవాఙ్మయమునకంటె నర్వాచీనము లైనను, నందు గ్రథితవిషయము వేదకాలమునకంటె బ్రాచీనతరములని యెంచుట యుక్తము. ఇట్టి యభిప్రాయమునే పార్జిటరు మొదలగు నాంగ్లేయ విద్వాంసులును, హిందూ పౌరాణిక భూగోళపరిశోధకులు గొందఱును వెలిపుచ్చియున్నారు.

పురాణములందు చతునదీ తటమున వసించుచుండినట్లు చెప్పిన యాంధ్రులుత్తరాంధ్రులనియు వారు దక్షిణాపథవాసులగు నాంధ్రులు గారనియు కే. పి. జయస్వాలుగారొక నూతన సిద్ధాంతమును బయలు పఱచియున్నారు. (హిందూ పాలిటీ ద్వితీ. ముద్ర. పుట. ౧౩౬); కాని తమ సిద్ధాంతమును నిలుపఁగల యాధారములను వీరు చూపలేదు. పురాణములు వైదికవాఙ్మయముకంటె నర్వాచీనములని యందఱివలెను వీరును గట్టి నమ్మకము గలవారగుటచేత వైదికపురాణ వాఙ్మయము లందు గానవచ్చెడు సాక్ష్యమును సమన్వయపఱచుటకు వారీసిద్ధాంతమును బ్రతిపాదించిరి. ఈవిషయమును జక్కఁగ పరిశీలించవలసియున్నది. మన చరిత్రకారులు తీర్మానించవలసిన ముఖ్యచారిత్రక సమస్యలలో నిది ప్రధానమైనది.

# ౩. పల్లవవంశక్రమము.

## ౧

క్రీ. శ. 3-వ శతాబ్ది మొదలు ౯-వ శతాబ్దము వఱకు కృష్ణా కావేరుల మధ్యదేశమున పల్లవ వంశపురాజులు రాజ్యము చేసిరి. పల్లవులయుత్పత్తిని గుఱించి పరిశోధక పండితులు అనేకులు అనేకాభిప్రాయముల నిచ్చియున్నారు. కొందఱు భరతఖండమునకు వలసలు వచ్చిన పాశ్చాత్యు లనిరి; కొందఱు అరవ లనిరి; మఱికొందఱు సింహళదేశ వాస్తవ్యు లనిరి. ఇట్లు పలువురు పలువిధములుగ పలికిరి. ఈ యభిప్రాయముల నన్నిటిని చక్కగ జర్చించి, వారు పారశీకమునుండి వచ్చినవారైనను చిరకాలము ఆంధ్రదేశమున నివసించి ఆంధ్రుల వేషభాషలను, మతాచారములను అవలంబించి, వారితో సంబంధబాంధవ్యములను కల్పించుకొని యాంధ్రులైన యొకతెగవారని ఇంతకు పూర్వము 'జయంతి'యందు వ్రాసియున్నాను. వీరు మొదట ఆంధ్రరాజులభృత్యులై యుండి, ఆంధ్రసామ్రాజ్యములోని దక్షిణభాగమున కంతటికిని ప్రభువు లైరి. ఇక పల్లవులకు రాజ్య మెట్లు వచ్చినదో విచారింపవలసియున్నది.

పల్లవవంశమున చారిత్రకపురుషుడుగ ప్రథమమున పరిగణింపదగినవాఁడు వీరకూర్చమహారాజు. ఇట్టిరాజుండె ననుటకు సాక్ష్యము దశిణాశాసనము. 1 ఇతనిపూర్వికులు రాజులు గారు; సామంతులు, సేనాపతులునయి యుండిన నుండవచ్చును. వారితో మనకు పని లేదు. ఈవీరకూర్చునికి రాజ్యమువచ్చిన తెఱఁగు వేలూర్పాళెము తామ్రశాసన 2 మున నిట్లు వర్ణింపఁబడియున్నది :

1. ఎ. ఇం. సం. ౧. ౩. సౌ. ఇం. ఇ. సం. ౪.

"తత్సుతా దక్షిణ చూతపల్లవా ద్వీరకూర్చ ఇతి విశ్రుతాహ్వయః;
యః ఫణీంద్రసుతయాస హాగ్రహీ ద్రాజచిహ్న మఖిలం యశోధనః".

వీరకూర్చమహారాజు ఫణీంద్రసుతతోఁగూడ రాజచిహ్నముల నన్నిటిని గ్రహించెనని శ్లోకార్థము. ఫణీంద్రకన్య యన నేమని యర్థము చేసికొనవలయును? నాగుఁబాముపిల్లయనియా? కాదు. పూర్వ మీ దక్షిణదేశమున నాగవంశజులగు రాజులు రాజ్యమేలిరి. నాగవంశపు రాజులలో నొక్కనికూతు నుద్వాహము జేసికొని తన్మూలమున రాజ్యమును వీరకూర్చరాజు వడసెను.

ఈనాగరా జెవ్వరు? నాగులకు దక్షిణాపథమునం దధికార మెట్లు వచ్చెను? అను ప్రశ్నలకు సమాధానము చెప్పవలసి యున్నది. నాలుగవ పులమావియను వతఁడు ఆంధ్రరాజులలో కడపటివాఁడు. ఇతని యనంతర మాంధ్రసామ్రాజ్య మంతరించిపోయెను. తదనంతరము నాగవంశజులగు రాజులు ప్రబలి యాంధ్రరాజ్యమును స్వాధీనపఱచుకొని రాజ్యము సేయఁదొడగిరి. నాగరాజు లాంధ్రదేశమునకుఁ గ్రొత్తగా వచ్చినవారు గారు, చిరకాలమునుండి యాంధ్రదేశమున నివసించుచు నాంధ్రరాజకుటుంబముతో సంబంధబాంధవ్యములను నెఱపుచుండిన సామంతరాజులే యని యెఱుఁగవలయును.

ఇట్టి సామంతరాజకుటుంబములలో ముఖ్యముగ గమనింపఁదగినవి రెండు: (౧) చూటుకులము; (౨) మహారథివంశము.

(౧) చూటుకులమువారు నాగు లనుటకు మొదటి నిదర్శనము వారికులముపేరు. చూడ మన్న అరవమునందు పడగెయని డా. కృష్ణస్వామి అయ్యంగారు తమ 'పల్లవులు' అనుగ్రంథమున వ్రాసియున్నారు. రెండవది యీవంశమువారు సర్పములను పూజించుట.

శాతవాహనవంశ మంతరించిన పిమ్మట వారిరాజ్యమందు చాల భాగము చూటుకులనాగులకు కైవసమాయెను. ఇట్లని శాసనములవలన తెలిసికొనుచున్నాము.

మైసూరు సంస్థానమునకు చేరిన షికారపుర తాలూకాలోని మాళవల్లి గ్రామమున నొకశిలా స్తంభము గలదు. దానిపై పురాతనములగు శాసనములు రెండు చెక్కఁబడియున్నవి. అందొక్కటి "హారితిపుత-విణ్హుకడ్డ-చుటుసాతకణి" యను రాజుయొక్క ద్వితీయరాజ్య వర్షమునందు చెక్కింపఁబడినది. ఈతఁడు 'వైజయంతీ (బనవాసీ)పుర రాజా'యని వర్ణింపఁబడియున్నాఁడు. ఇతనిదే మఱియొక శాసనము బనవాసియందు గాన్పించుచున్నది. ఇందు రాజుపేరు 'హారీతిపుత-విణ్హుకడ-చుటుకులానంద' యని చెప్పఁబడియున్నది. ఈదానశాసనమును చెక్కించినది మహారాజునకును మహాభోజికిని కుమార్తె యగు 'నాగమూలనిక' యను నామె. ఆమె తనకుమారుఁడగు సివఖందనాగసిరి యను నాతనితోఁగూడి యీశాసనమును వేయించెను. ఈ సివఖందనాగసిరియు కాన్హేరిశాసనమున జెప్పఁబడిన ఖందనాగశాతకుఁడును నొక్కరే ఈతనితండ్రి యొకమహారథి. ఈశాసనములను మథింపఁగా తేలినవిషయ మేమనగా, నాంధ్రరాజ్యము క్షీణించినపిమ్మట కుంతలమును అపరాంత మును చూటుకులనాగులకు స్వాధీన మాయెను.

హారీతిపుత్ర-విణ్హుకడ-చుటు శాతకర్ణి
భార్య మహాభోజి-వీరి కిరువురకును కూఁతురు

|

నాగమూలనిక మహారథుని వివాహము చేసికొనెను

|

స్కందనాగ శాతక లేక శివస్కందనాగశ్రీ

శివస్కందనాగశ్రీయొక్క తండ్రి మహారథియని పైన జెప్పఁబడి యున్నది అతనిపేరు మనకుఁ దెలియదు. అయిన, నాతఁ డెచ్చటివాఁడు? చిత్రదుర్గము (Chitaldrug in Mysore) నకు సమీపమున నున్న చంద్రావళీపురమును రాజధానిగ జేసికొని తత్సమీపభూముల నేలుచుండిన నాగవంశజుఁడు. విష్ణుకడ-చుటు-శాతకర్ణి తనకుమార్తెను నాగనికను మహారథునకిచ్చి యుద్వాహము చేసెను కాబట్టి చంద్రావళీపురాధీశునకును, వైజయంతీశునికూఁతురగు నాగమూలనికకును బుట్టినవాఁడు శివస్కందనాగుఁడు. ఇతనితండ్రి తుంగభద్రకు దక్షిణమున నున్న రాజ్యమున కంతటికిని నధిపతి. మాతామహుఁడగు విష్ణుకడ-చుటు-శాతకర్ణునకు పురుషసంతతి లేకపోవుటచేత నేమా, యాతనిరాజ్యమునకు దౌహిత్రుఁడగు శివస్కందనాగుఁడే ప్రభువాయెను. కావున స్వరాజ్యారంభకాలమున నాతఁడు కృష్ణా కావేరులమధ్య రాష్ట్రములకును, కుంతలాపరాంతములకును ప్రభువాయెను. ఈశివస్కందనాగుఁడే ఆంధ్రరాజులలోని కడపటివాఁడగు పులుమావికి మహాసేనానిగా నుండెనని మ్యాకదోనిశాసనము చెప్పుచున్నది. పులుమావి యనంతరము శివస్కందనాగుఁడు స్వతంత్రుఁడై పై దేశముల కన్నిఁటికిని నధిపతియాయెను. ఈతఁడే పల్లవవంశస్థాపకుఁడగు వీరకూర్చునికి కూఁతు నిచ్చి వివాహము చేసిన నాగరాజు. ఈతనిపేరే పల్లవాన్వయమునకు పురోభాగము నలంకరించిన శివస్కందవర్మునకు పెట్టఁబడెను. ఇట్లాంధ్రరాజ్యలక్ష్మి సాతవాహనవంశమును వీడి, చుటు, మహారథులకడ గొంత కాలము వసించి, తుదకు పల్లవాన్వయము నాశ్రయించెను.

౨

ఈప్రకరణమున పల్లవవంశక్రమమును రచింపవలయును. ఇందులకు సాధనము లెవ్వి? పల్లవరాజుల శాసనములు.

(౧) వీనియందు వర్ణితమగు వంశచరిత యొక్క తెఱఁగున లేదు. పురాతనములగు శాసనములయం దొక్కొక్కదానియందును రెండు మూఁడుతరముల రాజులవేర్లే కానవచ్చుచున్నవి. అర్వాచీనములగు శాసనములవలె వంశసంబంధమగు పురాణగాథ లేవియు గానరావు. ఉదా. పల్లవరాజులు భారద్వాజులనియు, పరమబ్రహ్మణ్యులనియు ప్రాత శాసనములయం దున్నది. తమవాతి శాసనములందువలె బ్రహ్మా, అంగిరస, ద్రోణాశ్వత్థామలగుండ వంశావతరణము వర్ణింపఁబడియుండలేదు. కాలము గడచుకొలఁది పల్లవరాజులు స్వవంశచరిత్రను మఱచిరి. తమ పూర్వికుల పేర్లు సైతము వారికి జ్ఞప్తి లేకపోయెను కావున వారు తమ శాసనములలో వంశచరిత్రమును వర్ణించునపుడు ఎట్లు తోచిన నట్లు వ్రాయించిరి అందుచే, ఈశాసనములలోని పురాతనపల్లవవంశవర్ణనా వలన్నియు విశ్వసనీయములు గావు. కావున చక్కగ పరిశీలించి కాని వానిలోని విషయములను గ్రహింపరాదు. ఇక వంశవృత్తరచన కనుకూలములగు శాసనములపట్టిక నొకదానిని పొందుపఱచెదను.—

౧. మయిదవోలు తామ్రపట్టిక:—(ఎపి. ఇండికా. వా. ౬ పు. ౮౪) ఇది యువమహారాజు శివస్కన్దవర్మ వ్రాయించి యిచ్చిన దాన శాసనము.)

౨. హీరహడగల్లి తామ్రపట్టిక:—(ఎ. ఇం. వా. ౧. పుటలు ౨—౧౦. ఇది అగ్నిష్టోమవాజపేయాశ్వమేధయాజియు, భారద్వాజుండును, పల్లవధర్మమహారాజును నగు శివస్కన్దవర్మ వ్రాయించి యిచ్చిన దానశాసనము.)

3. చారుదేవియొక్క గుంటూరుమణ్డల తామ్రపట్టిక:—దీనికే బ్రిటీషు మ్యూజియము తామ్రపట్టిక యందురు. (ఎ. ఇం. సం. ౮, పు

౧౪3 ) ఇది శివస్కన్దమహారాజు కోడలును, యువరాజు విజయబుద్ధవర్మ ధర్మపత్నియును, బుద్ధ్యంకురుఁడను రాజకుమారుని తల్లియును నగు చారుదేవి వ్రాయించి యిచ్చిన తామ్రపట్టిక.

ఈపై మూఁడుపట్టికలును ప్రాకృతమునందు వ్రాయఁబడియున్నవి. సంస్కృత శాసనములకంటె ప్రాకృతశాసనములు పురాతనములైనవని పరిశోధక విద్వాంసుల సిద్ధాంతము. కావున పల్లవశాసనములయం దీపై మూఁడును బహుప్రాచీనములని నిర్ధారణ చేయఁబడియున్నవి.

౪. దర్శి తామ్రపట్టిక:—(ఎ. ఇం. సం, ౧, పు. 3౯౭. ఇది కూచవర్మ మహారాజుయొక్క ప్రపౌత్రునిచే వ్రాయించి యీయఁబడినది. తామ్రపట్టికలోని మొదటిరేకు మాత్రమే లభ్యమగుటచేత, వీర కూచవర్మకు వెనుక వచ్చువారల నామములు తెలియవు)

౫. ఓంగోడు తామ్రపట్టిక:—౧ (ఎ. ఇం. సం. ౧౫, పు. ౨౪౬.) ఇది కుమారవిష్ణుని ప్రపౌత్రుఁడును, స్కన్దవర్మ పౌత్రుఁడును, వీరవర్మ పుత్రుఁడును నగు విజయస్కన్దవర్మ వ్రాయించి యిచ్చిన తామ్రపట్టిక.

౬. ఓంగోడు తామ్రపట్టిక:—౨. (ఎ. ఇం. సం. ౧౫. ఇది వీరవర్మ ప్రపౌత్రుఁడును, స్కన్దవర్మ పౌత్రుఁడును, విష్ణుగోపుని పుత్రుఁడును నగు సింహవర్మ వ్రాయించి యిచ్చిన పట్టిక.)

౭. ఉరువపల్లి తామ్రపట్టిక:—(ఇం. ఆంటిక్వేరీ, సం. ౫. పుటలు. ౫౦—౫౨.) ఇది స్కన్దవర్మ ప్రపౌత్రుఁడును, వీరవర్మ పౌత్రుఁడును, స్కన్దవర్మ పుత్రుఁడును నగు యువమహారాజు విష్ణుగోపవర్మ వ్రాయించి యిచ్చిన పట్టిక.

౮ పీకిర తామ్రపట్టిక:—(ఎ. ఇం. సం. ౮, పుట. ౧౫౯.) ఇది వీరవర్మ ప్రపౌత్రుఁడును, యువరాజు విష్ణుగోపవర్మ పుత్రుఁడును నగు మహారాజు సింహవర్మ వ్రాయించి యిచ్చిన పట్టిక.

౯. మంగళూరు పట్టిక:—(ఇం. ఆంటి. సం. ౫, పు. ౧౫౫.) ఇది వీరవర్మన ప్రపౌత్రుఁడును, స్కన్దవర్మన పౌత్రుఁడును, యువరాజ విష్ణుగోపుని పుత్రుఁడును నగు మహారాజ సింహవర్మన వ్రాయించి యిచ్చిన పట్టిక.

౧౦. చూరతామ్రపట్టిక:—(మదరాసు శాసన పరిశోధకసంఘపు వార్షిక కార్యనివేదన పత్రిక. ౧౯౧౩—౧౪, భా. ౨, నెం ౧, రు.) ఇది స్కన్దవర్మన ప్రపౌత్రుఁడును, మహారాజు విష్ణుగోపవర్మన పౌత్రుఁడును, సింహవర్మనపుత్రుఁడును నగు విష్ణుగోపవర్మన వ్రాయించియిచ్చిన పట్టిక.

౧౧ చెన్దలూరు తామ్రపట్టిక:—(ఎ. ఇం సం. ౮, పు. ౨౩౩. ఇది స్కన్దవర్మన ప్రపౌత్రుఁడును, కుమారవిష్ణుని పౌత్రుఁడును, బుద్ధవర్మన పుత్రుఁడును నగు కుమారవిష్ణువు వ్రాయించి యిచ్చిన పట్టిక.

౧౨. ఉదయేన్దిరముపట్టిక:—(ఎ. ఇం. సం. 3, పు. ౧౪౨) ఇది స్కన్దవర్మన ప్రపౌత్రుఁడును, సింహవర్మపౌత్రుఁడును, స్కన్దవర్మ కుమారుఁడును నగునందివర్మన వ్రాయించి యిచ్చిన పట్టిక.

౧3. అమరావతిశిలాస్తంభ శాసనము:—(సౌ. ఇం. ఇ. సం. ౧.) ఇందు పల్లవరాజుల వంశవృక్ష మొక్కటి వర్ణింపఁబడియున్నది. అందలి రాజులకును కంచి పల్లవులకును గలసంబంధ మిట్టిది యని నిర్ధారణ సేయుటకు వీలు లేకయున్నది.

౧౪. వాయలూరు శిలాస్తంభశాసనము:—(దుబ్రాయిలుగారి 'పల్లవులు') ఇందు పల్లవరాజుల జాబితాయొక్కటి కలదు. అయిన నొక రాజునకును మఱియొక్క రాజునకును గలసంబంధ మెట్టిదియైనదియు వర్ణింపఁబడలేదు. శాసన నిదర్శనములు లేనివే యనేకము లున్నవి. ఇది మొదటిపరమేశ్వరవర్మనాటిది.

౧౫. వేలూర్పాళెపు తామ్రపట్టిక:—(సౌ. ఇం. ఇ. సం, ౨, భా. ౫) ఇది మూడవనన్దివర్మ వ్రాయించి యిచ్చిన తామ్రపట్టిక. ఇందుఁగూడ పల్లవవంశవృత్త మభివర్ణితము. ఇది వాయలూరుశాసనము కంటె విశ్వసనీయమని పండితుల యభిప్రాయము.

ప్రాచీన పల్లవరాజచరిత్రరచనమున కాధారభూతములైన శాసనములివియే. వీనియం దన్నిటియందును నీరాజుల వంశావళి కొంచెము గనో గొప్పగనో వర్ణింపఁబడియున్నది. ౧౩, ౧౪, ౧౫ లలో దప్ప తక్కినవానియందు దాతయొక్క ముత్తాత, తాత, తండ్రులు మాత్రమే పేర్కొనఁబడియున్నారు. అనఁగా వీనిలోఁ బ్రతిదానియందును మూఁడు నాలుగు తరముల రాజులైనను పేర్కొనఁబడియున్నారు. ఈదానశాసనముల నిచ్చిన దాతలకు వారి తాతముత్తాతల పేర్లు తప్పక తెలిసియుండును. అందుచే వీనియందు వర్ణింపఁబడిన వంశావళులు విశ్వసనీయములని యంగీకరింపఁబడినవి. ౧౩, ౧౪, ౧౫ అట్టివి కావు. అమరావతి శాసనములోని పేర్లకును, ౧—౧౨ లోని పేర్లకును ఏలాటిసంబంధమును గానిపింపదు. వాయలూరు శాసనమున ౩౬ తరముల రాజులపేర్లు కలవు. ఒకరి కొకరి కున్న సంబంధము తెలియరాదు. వచ్చిన పేరు మరల వచ్చుటయే కాక, మూఁడు నాల్గు పేర్లు కలసి గుచ్ఛములుగ మరలి మరలి వచ్చుచుండును. శాసనమును వ్రాసినవారికి రాజులపేర్లును, వారు రాజ్యము చేసిన కాలక్రమమును నెఱుకలేకపోవుటచేత వారి యిచ్చవచ్చినట్లెల్ల వ్రాసిరి; పేర్లను గల్పించిరి. కావున, చరిత్రరచనయం దీశాసనముపై నాధారపడవలసినపుడు, జాగ్రతగ పరిశీలించి చూడవలయును; లేకున్న ప్రమాదము సంభవించును. వేలూర్పాళెపు శాసనమున ౧౯ రాజులపేర్లు గలవు. అందు కొంతమట్టుకును వారికున్న సంబంధము చెప్పఁబడియున్నది.

౧—౧౨ శాసనములలోని పేర్లవరుస కది వ్యతిరేకింపదు. కావున నది విశ్వసనీయమని నాయభిప్రాయము. ఇక వంశవృక్షరచన కారంభించెదను.

ప్రాకృతశాసనములు సంస్కృతశాసనములకంటె బ్రాచీనతరమైనవని శాసనపరిశోధక పండితులసిద్ధాంతమని యింతకుముందె చెప్పియున్నాను గదా; అందుచేత, ప్రాకృతశాసనములలోఁ బేర్కొనఁబడిన రాజులు సంస్కృతశాసనములలోఁ బేర్కొనఁబడిన వారికంటె పూర్వము రాజ్యమేలినా రనుట నిస్సంశయము. ప్రాకృతపల్లవ శాసనములు మూఁడు: మయిదవోలు, హీరహడగల్లి, గుంటూరు మండలశాసనములు. ఇందు మిక్కిలి పురాతనమైనది మయిదవోలు శాసనము. దీనియందు పేర్కొనఁబడినవాఁడు పల్లవవంశజుఁడు, భారద్వాజసగోత్రుఁడు, యువమహారాజు, శివస్కందవర్మ. హీరహడగల్లి శాసనమునఁ బేర్కొనఁబడినవాఁడు కాఞ్చీపురాధిపుఁడు, ధర్మమహారాజాధిరాజు, పల్లవకులోద్భవుఁడు, భారద్వాజసగోత్రజుఁడు, శివస్కన్దవర్మన్. ఈశాసనమునందు మహారాజు బప్పస్వామి పూర్వము చేసిన దానమును తాను పునరుద్ధారణము సేయుచున్నాడనని శివస్కన్దవర్మ చెప్పుకొనుటచేత, తత్పూర్వము పల్లవరాజ్యము నేలిన రాజులలో బప్పమహారాజొకఁడని తేలుచున్నది. ఈబప్పమహారాజు శివస్కన్దవర్మన్ తండ్రియని చరిత్రకారుల యభిప్రాయము. అట్లని హీరహడగల్లిశాసనమున పల్లవరాజులు రెండుతరములవారు పేర్కొనఁబడి యున్నారు.

బప్పమహారాజు
|
శివస్కన్దవర్మన్

చారుదేవియొక్క గుంటూరుశాసనమునఁ జెప్పఁబడినవారు మువ్వురు: మహారాజు విజయస్కన్దవర్మన్, భారద్వాజుఁడు, పల్లవుల యువమహా

రాజా విజయబుద్ధవర్మ. ఇతని కుమారుని పేరు 'కుర' యను పదముతో ముగించును. దీనిని హూల్ట్షుదొరగారు 'బుద్ధ్యాఙ్కుర' యని పూరించిరి. కావున ఈశాసనములలోని పల్లవులు—

విజయస్కన్దవర్మ
|
యు. మ. విజయ బుద్ధవర్మ
|
[బుద్ధ్యాఙ్] కుర

ప్రాకృతశాసనములలోని రాజులకు గలసంబంధ మెట్టిది? ఈశాసనముల కన్నిటికిని ఒక పేరు సామాన్యము. అన్నిటియందును స్కన్దవర్మ పేర్కొనఁబడియున్నాఁడు. ఈతనిపేరు మయిదవోలు శాసనములలో శివస్కన్దవర్మయని యున్నను, చారుదేవి శాసనమున విజయస్కన్దవర్మ యని యున్నది. 'శివ' 'విజయ' శబ్దములు శుభసూచకములగు నుపసర్గలుగ నుపయోగింపఁబడినవి. అర్థభేదము విశేషము లేదు. కావున శివస్కన్దవర్మయు, విజయస్కన్దవర్మయు, నొక్కని పేర్లే. ఇట్లే కదంబరాజులు 'శివ' 'విజయ' శబ్దములను ఉపసర్గలుగ తమనామములకు ముందు చేర్చుకొనియున్నారు. ఉ. శివ-మాంధాతృవర్మ, శివమృగేశవర్మ, శివకృష్ణవర్మ ఇత్యాదులు ఒక కదంబరాజు తనపేరునకు ముందు 'శివ' 'విజయ' పదములను రెంటినిం చేర్చుకొనియున్నాఁడు.(ఎపి. కర్ణా. సం. 8, పు. 8). కావున విజయస్కందవర్మయు, శివస్కందవర్మయు నొక్కరే యనుటకు శంకింపఁ బనిలేదు. అట్లు పై రెండువేర్లొక్కరివే యను సిద్ధాంత మేర్పడినపిమ్మట నీక్రిందివిధమున ప్రాచీనపల్లవవంశ వృక్షమును యుంపవచ్చును.

బప్పమహారాజు
|
శివస్కన్దవర్మ
|
బుద్ధవర్మ
|
[బుద్ధ్యాఙ్కుర] కుర

అయిన నీబప్పమహారా జెవ్వరు? 'బప్ప' యను మాట అంకిత నామధేయము కాదు. 'అప్ప' యనుమాటయే ప్రాకృతమున బప్ప యైన దేమో! ఇతని వాస్తవమైన నామధేయ మేమి? వేలూర్పాళెపుశాసన మీసందర్భమున కొంచెము తోడ్పడుచున్నది.

"తత్సుతా దజని చూతపల్లవా ద్వీరకూర్చ ఇతి విశ్రుతాహ్వయః,
యః ఫణీన్ద్రసుతయా సహాగ్రహీ ద్రాజచిహ్న మఖిలంయశోధనః."

పైశ్లోకములోని చూతపల్లవుఁడు చుటు, పల్లవ వంశములసంయోగమును సూచించు కల్పితపురుషుఁడుగాని యన్యుఁడు గాఁడు. ఆరెండు వంశముల సంయోగానంతరము బుట్టినవాఁడు వీరకూర్చుఁడు. ఇతఁడు నాగకన్యాకరమును, అఖిలరాజచిహ్నముల నేకకాలమందు గ్రహించెను. ఈదంపతులకు బుట్టిన పుత్రుఁడే స్కన్దవర్మ. ఇతనికి స్కాన్దశిష్యుఁ డనుపేరు నైతము గలదు.

"అన్వవాయనభశ్చన్ద్రః స్కాన్దశిష్యస్తతో భవత్."

ఈస్కాన్దశిష్యునిఁగూర్చి రాయకోటశాసనమున నిట్లు చెప్పఁబడి యున్నది:—

"అశ్వత్థామ్నాఽస్యతస్తు ర్ఘవతి ఖలు పురా, విక్రమవ్యాకృతారి [రాజ."
జ్జాతో...ద్విజిహ్వాంగనిపుత్రాహ్వ హ్వాతి 1యత జగతాం స్కన్దశిష్యాధి

ఈపైశ్లోక మెట్టి దుస్థితియందున్నను తాత్పర్యము విశదముగ తెలియుచున్నది అశ్వత్థామవంశమున ద్విజిహ్వాంగనవలన యనఁగా నాగకన్యకవలన స్కన్దశిష్యుఁడు పుట్టెను. ఇచ్చట నాగకన్యతోడి తగులాట మశ్వత్థామకే యంటఁగట్టబడినదని హూల్ట్జుగారు వ్రాసినది పొరబాటు. రాయకోటశాసనకర్త క్రీ. శ. ౯, ౧౧ శతాబ్దములమధ్య నున్నవాఁడు. కాన నతఁడు నాగకన్యమూలమున తన పూర్వికులకు రాజ్యము లభించెనన్నగాథనుమాత్ర మెఱుఁగును. ఏరాజు నా నాగకన్య వరించుటచే రాజ్యలబ్ధి గాంచెనదియు నెఱుఁగఁడు. ఏది యెట్లున్నను పల్లవులు నాగకన్యా మూలమున రాజ్యలాభమును బొందుట నిజము. అశ్వత్థామ పురాణములలోని వ్యక్తి. అతని యునికికి కవిప్రతిభయే కారణము. అట్టివానివలన దక్షిణదేశమున ౧౦వ శతాబ్దములవఱకును రాజ్యమొనర్చిన పల్లవవంశ ముత్పన్నమైనదనుట యసంభవము. వీరకూర్చుఁడను రాజుండెననుటకు శాసననిదర్శనము గలదు. వాయలూరు శాసనము2 ఈ పేరు గలరాజుల నిర్వురను పేర్కొనుచున్నది. ఈశాసన మంత విశ్వాసనీయము గాదని యింతకు పూర్వమే వచించియున్నాను. దర్శిశాసనదాత తన ముత్తాత వీరకూర్చవర్మ యని చెప్పుకొనియున్నాఁడు. కావున వీరకూర్చుఁడు చరిత్రపురుషుఁడు. ప్రాచీనపల్లవరాజులు కొంద రాతని దమ వంశమునకు మూలపురుషుఁడుగ వర్ణించియున్నారు. నాగకన్యకాపతి యితఁడనుటయే సమంజసము. పైపరిశోధనవల్ల దేలిన విషయ మేమనః-

1. ఎపి. ఇండి. సం. ౫, పుట ౪౯. ఈశాసనగ్రంథము తప్పులతప్పు. దీని పరిష్కరించి ప్రకటించిన డా. హూల్ట్జుదొరగారుకూడ దీనితప్పుల నన్నిటిని సవరింపలేకపోయిరి. 2. దుబ్రాయిలు : పల్లవులు.

బప్పమహారాజు లేక వీరకూర్చవర్మఁడు
(నాగరాజకుమార్తె నుద్వాహము చేసికొని తన్మూలమున రాజ్యమును బడసినవాఁడు.)

|

శివ లేక విజయ స్కన్దవర్మన్
(ఇతనికే స్కన్దశిష్యుఁ డను పేరు గలదు)

|

విజయబుద్ధవర్మన్ (చారుదేవిభర్తన్)
[బుద్ధ్యాఙ్క] కురుఁడు.

ఇక సంస్కృతశాసనములలోని వంశములనుగూర్చి చర్చ సల్పుదము. ప్రథమమున పైపట్టికయందలి ౫—౧౦ శాసనములనుఁ గూర్చి విచారింతము. ఇవి యేవియన, ఓంగోడుశాసనములు ౧, ౨, ఉరువపల్లి, పీకిర, మంగళూరు, చూరశాసనములు. వీనియందలి రాజుల

## వంశక్రమము:




ఈ పై రెండుశాసనములలోని రాజు లొక్కవంశమువా రనుట పై వంశవృక్షములవల్ల విదిత మగుచున్నది. ఇందు ఆరుతరముల రాజులు పేర్కొనఁబడియున్నారు.




ఈ పై నాలుగు శాసనములలోని రాజవంశము ఒంగోదు శాసనములలోని రాజవంశము లొక్కటియే యనుట స్పష్టము. కావున నీవంశవృత్తపుతునుకలను సంకలితము చేసిన నీ క్రిందివంశ మేర్పడును:-






ఇట్లు పై యారుశాసనములవల్లను ౭ పురుషాంతరములుగల వంశవృక్ష మేర్పడినది. ఇంకను నిందొకటిరెండువిషయములు గమనింపదగినవి గలవు. ఉరువపల్లి, మంగళూరు, పీకిర శాసనములలోని విష్ణుగోపుఁడు యువమహారాజనియే పిలువఁబడియున్నాఁడు. ఏతత్కారణమున కొందరీతఁడు తనతండ్రి కాలముననే మృతినొందెనని తలచిరి. ఇది పొరపాటు. ఉరువపల్లి శాసనదాత యగు యు. మ. విష్ణుగోపుఁడు ఆ దానశాసనమును (సింహవర్మయను రాజుయొక్క యేకాదశవర్షమున సింహవర్మ మహారాజస్య విజయసంవత్సరే ఏకాదశే) ఇచ్చినట్లు చెప్పియున్నాఁడు. కావున హూల్ట్షుగారన్నట్లు ఈ సింహవర్మ విష్ణుగోపుని జ్యేష్ఠభ్రాతగ నుండవలయును వీరితండ్రియగు స్కన్దవర్మకు పిమ్మట నాతనిపెద్దకుమారుఁడు సింహవర్మ రాజాయెను. అతఁడు తనతమ్ముని యౌవరాజ్యాభిషిక్తునిగ చేసి రాజ్యములోని యుత్తరార్థమున కధిపతిగ జేసెను. అతని సంతతివారు మహారాజులమని చెప్పుకొన్నను సింహవర్మకు, కంచి రాజ్యము నేలిన యాతనివంశస్థులకులోబడియే రాజ్యము సేయుచుండిరి. కావున విష్ణుగోపుఁడు తనతండ్రికి పూర్వమే మృతి నందెనని కాని, తత్కారణమున నాతఁడు శాసనముల యందు యువమహారాజని పిలువబడె నని కాని యనుకొనవలసినయవసరము లేదు. కావున నీవంశవృక్షమిట్లుండవలెను:—

కుమారవిష్ణువు
|
స్కన్దవర్మ
|
వీరవర్మ
|
స్కన్దవర్మ
|
సింహవర్మ — యు. మ. విష్ణుగోప
(యు. మ. విష్ణుగోప)
|
సింహవర్మ
|
విష్ణుగోప

పై పట్టికలోని (౧౩) ఉదయేన్దిరపు శాసనమున నీక్రిందివంశము వర్ణింపబడియున్నది:—

స్కన్దవర్మ
|
సింహవర్మ
|
స్కన్దవర్మ
|
నన్దివర్మ

ఈరాజులు పై వంశవృక్షములోని స్కన్దవర్మయొక్క జ్యేష్ఠపుత్త్రుఁడగు సింహవర్మ వంశజులుగ నుండవలయును. కావున నీవంశవృక్ష మి ట్లుండవలయును:—




ఇక (౧౧) చెందలూరు శాసనమునందు వర్ణింపఁబడిన రాజుల విషయము విచారింతము. వీరు—




చెందలూరు (౧౧) శాసనమందుఁ జేర్కొనఁబడిన రాజు లెప్పుడు రాజ్యము చేసిరి? అను విషయము ప్రథమమున విచారణీయము.

హాల్ట్జుగా రిట్లనుచున్నారు:—"చెందలూరు శాసనపు లిపి...పీకిర, మంగళూరు, ఉరువపల్లి దానపత్రములలోని లిపిని పోలియున్నది. అక్ష రముల తలకట్లపై యడ్డగీట్లు చెందలూరు శాసనమున లేకపోవుటయే దానికిని ఇతర శాసనములకుఁ గల భేదము. మఱియు దీనియందు 'ర', 'క', 'య' (కొమ్ము)ను సమమైన రెండు నిలువుగీళ్లు యున్నవి; ఈయక్షర ములను తెలియఁజేయు నిలువుగీట్లు పీకిర, మంగళూరు, ఉరువపల్లి శాసన ములలో మిక్కిలి కురుచలుగ నున్నవి. ఈవిషయము చెందలూరు శాస నముపై యర్వాచీనముద్ర నిడుచున్నది. కావున చెందలూరు శాసన మున బేర్కొనఁబడిన పల్లవరాజులు సింహవర్మ, సింహావిష్ణువుల మధ్య కాలమున ప్రభుత్వము సల్పియుండవలయును."1

కేవల మక్షరముల స్వరూపమునుబట్టి దానశాసనములను, నందు బేర్కొనఁబడినవారి కాలమును నిర్ణయించుటకు గొంతవఱకును సాధ్య మే. స్థూలముగ నక్షరముల స్వరూపమునుఁబట్టి శాసనముల ప్రాచీ నార్వాచీనత్వములను నిర్ణయింపవచ్చును. అట్లుగాక అక్షరస్వరూప బట్టి యీశాసన మిప్పటిదని నిశ్చయించి చెప్ప వీలుగాదు. హాల్ట్జు గారు పై జేసిన సిద్ధాంతముపై దుబ్రూయు లిట్లు వ్యాఖ్యానమునుఁ జేసి యున్నాఁడు:—

"పీకిర, మంగళూరు, ఉరువపల్లి శాసనములలోని యాయక్షర ములు స్వరూపము చక్కఁగ నేర్పడినవనియు, తత్కారణమున నది యర్వాచీన మైనదనియు లిపిశాస్త్రదృష్టితో నీశాసనములలోని యక్షర ములను బరిశీలించి చూచిన హాల్ట్జుగా రనియున్నారుగదా. నేను స్వయముగ నీ నాలుగు శాసనములలోని యక్షరములను బరీక్షించి

1. ఎ. ఇం. సం. ౮ పు. ౨౩౩.

నప్పుడ, (చెందలూరు శాసనమున) 'ర' 'శ'ల స్వరూపము గొంచెము జక్కఁగ నేర్పడియున్నను, వానికి బదులు 'హ' 'య'లః స్వరూపము చక్కఁగ నేర్పడక యున్నది. అక్షరముల నొక్కొకదానితో పోల్చి చెప్ప గలిగినదంతయు చెందలూరు శాసనము దక్కిన మాటితోడను సమకా లీన మనియే.

"అయితే, అక్షరముల నొండొంటితో పోల్చుటకు బదులు, లిపులయొక్క సామాన్యస్వరూపములను పోల్చి చూచితిమేని, చెంద లూరు శాసనపులిపి, ప్రాచీన శాసనములందువలె, వంకరటింకరగనున్నది. ఉరువపల్లి, మంగళూరు, పీకిర శాసనములందున్ననో, అర్వాచీన శాసనము లందువలె, లిపి చక్కఁగ కుదిరియున్నది. అయినప్పటికిని సామాన్యముగ నక్షరములపోలిక యథార్థస్థితిని తెలుపగలదని నేను నమ్మను. శాసనము లను వ్రాయు చెక్కడపు బనివాండ్రనుబట్టి శాసనాక్షరములు భేదించు విషయము పల్లవశాసనములవలననేకాక, గాంగ, కాదంబ శాసనములవల నను ఋజువగుచున్నది. ఒక్కొకపుడొక రాజు కాలమునందలి శాసన ములే యొకదాని నొకటి పోలియుండవు. కడపటిమాట: కాంచీపురమున నొసఁగఁబడిన చెన్దలూరుశాసనమును పలక్కడయం దిచ్చిన యురువపల్లి శాసనముతోడను, దశనపుర, మేన్మాతురలనుండి యిచ్చిన మంగళూరు పీకిర శాసనములతోడను పోల్పవలసిన యావసరము లేదని నాయభిప్రా యము. పలక్కడ, దశనపుర, మేన్మాతుర లనుపట్టణములు గుంటూరు సీమలోనివై యుంశవచ్చును. అనగా నవి కాంచీపురమునకు బహుదూర మున నుండినవి. కావున, దేశభేదమే (పైశాసనములందలి) యక్షరభేద మునకు గారణమని విశదమగుచున్నది".[1]

---

1. ప్రా. శ. చ. పుట. [illegible].

ఇట్లు చెన్దలూరుశాసనము ఉరువపల్లి, పీకిర, మంగళూరుశాసనములకాలమప్పటిదో, లేక తత్పూర్వపుకాలముదో యను నభిప్రాయము దుబ్రాయలుగా రిచ్చియున్నారు. ఇదియే సరియైన యభిప్రాయమని నా తలఁపు.

చెన్దలూరు శాసనములోని రాజులు సింహవర్మ సింహవిష్ణువుల మధ్యకాలమున రాజ్యము చేసియుందురని హూల్ట్షు అభిప్రాయపడియున్నాఁడు. ఇది సాధ్యము కాదు. ఏలనఁగా, ఉదయేందిర శాసనమునఁ బేర్కొనఁబడిన రాజులు సింహవర్మ వెనుక కంచియందు రాజ్యము చేసినట్లు తెలియుచున్నది. "లిపిస్వభావమునుబట్టి చూడఁగా నీ (ఉదయేన్దిరపు) శాసనము ఉరువపల్లి శాసనముకంటె దరువాతిదని యభిప్రాయపడుచున్నాను"[2] అని కీల్హారను చెప్పుచున్నాఁడు. కావున చెన్దలూరు శాసనములోఁ బేర్కొనఁబడిన రాజులు సింహవర్మకు వెనుక కంచియందు రాజ్యము జేసిరనుట కవకాశము లేదు. వారు సింహవర్మకు పూర్వమే చేసియుండవలయును.

ఇట్లు చెన్దలూరు శాసనపురాజుల కాలమును స్థూలముగ నిర్ణయించితిమి. ఈశాసనమున నిద్దరు కుమారవిష్ణువులు పేర్కొనఁబడియున్నారు. వీరిద్దరిలో ఒంగోడు (౧)పట్టికయందు వర్ణింపఁబడిన కుమారవిష్ణు వెవ్వఁడు? ప్రథముఁడా, ద్వితీయుఁడా? ఒంగోడు (౧) శాసనమందలి వంశావళి యిది:—

2. ఎ. ఇం. సం. 3, పు. ౧౪౩.




ఈశాసనము విజయస్కందవర్మ నాటిది. ఇతఁడు ఉరువపల్లి శాసనదాతయగు యు. మ. విష్ణుగోపునియొక్క తండ్రి. ఓంగోడు (౧) శాసనములోని "యక్షరములు ఉరువపల్లి, మంగళూరు, పీకిరశాసనాక్షరములవంటివి" అని కృష్ణశాస్త్రులగారనుచున్నారు. పితాపుత్త్రుల శాసనములకంతటి బంధుత్వముండుట వింతగాదుగదా! చెన్దలూరు శాసనపు టక్షరములు నైతము ఉరువపల్ల్యాది శాసనముల యక్షరములవంటివని పండితుల యభిప్రాయము. కావున చెన్దలూరు శాసనములోని రెండవ కుమారవిష్ణువు ఓంగోడు (౧) శాసనపు విజయస్కన్దవర్మతో నించుమించుగ సమకాలీనుడుగ నుండవలయును. అట్లయిన చెందలూరుశాసనపు ౨-వ కుమారవిష్ణువును, ఓంగోడు శాసనపు కుమార విష్ణువును భిన్నపురుషులు. ఓంగోడు (౧) శాసనపు విజయస్కందవర్మయు, చెన్దలూరు శాసనపు ౨-వ కుమార విష్ణువును ఇంచుమించు సమకాలికులైన, ఓంగోడు (౧) శాసనపు కుమారవిష్ణువు చెన్దలూరు శాసనపు కుమారవిష్ణువునకు మూఁడు నాలుగుతరముల ముందటివాఁడగును. చెందలూరు శాసనము ప్రకారము ౨-వ కుమారవిష్ణుని తాతపేరుకూడ కుమారవిష్ణువే కదా! వేలూర్పాళెయపు శాసనమున రాజులవరుస యిట్లు గలదు:—

స్కన్దశిష్య

|

కుమారవిష్ణు

|

బుద్ధవర్మ

కావున పల్లవ వంశవృక్షస్వరూప మిట్టిదిగ నుండవలయును.

వీరకూర్చ

|

స్కందవర్మ (౧) *

(స్కన్దశిష్యుఁడు)

|

కుమారవిష్ణువు (౧) *

- బుద్ధవర్మ *
  - కుమారవిష్ణువు (౨) *
- స్కందవర్మ
  - వీరవర్మ
    - స్కందవర్మ
      - సింహవర్మ *
        - స్కందవర్మ (౨) *
          - నందివర్మ (౧) *
      - యు. మ. విష్ణుగోప
        - సింహవర్మ
          - విష్ణుగోప

---

* కంచిరాజులు.

ఇక ప్రాకృతశాసనపు రాజులకును, వీరికిని ఎట్టి సంబంధము గలదో విచారింతము. వీరు :




వీరకూర్చ మహారాజొకఁ డుండె ననుటకు ప్రబల నిదర్శనము దర్శితామ్రపట్టిక. దీనిభాష సంస్కృతము. ఇది వీరకూర్చుని మునిమనుమనికాలమునాటిది. అక్షరములు కడు ప్రాచీనములు. దర్శితామ్రపట్టికను ఉరువపల్లి హిరహడగల్లి శాసనములతో బోల్చిచూచితిని. అక్షరములు ఉరువపల్లి శాసనాక్షరములకంటె బ్రాచీనములుగను; హిరహడగల్లి శాసనాక్షరములకు దరువాతివిగను గన్పట్టుచున్నవి. దర్శిశాసనదాత ఉరువపల్లి, హిరహడగల్లి శాసనముల మధ్యకాలమున నుండెననుటకు సంశయము లేదు. ఉరువపల్లి శాసనదాతయగు యు. మ. విష్ణుగోపుని తాత వీరవర్మ యని యొకరా జున్నాఁడు. అతఁడే యీవీరకూర్చ రాజని కృష్ణశాస్త్రిగారి వాదము. శాసనపరిశోధకులయ్యు వీర లిట్టిపొరపాటునకు లోనగుట చిత్రము. దర్శిశాసనము ఉరువపల్లికంటె ముందటిదని లిపియే సాక్ష్యమిచ్చుచున్నది. కృష్ణశాస్త్రిగారు 'వాయలూరుశాసనమున వీరవర్మపే రొక్కమారుఁ గాన్పించుచున్నది. కావున వీరకూర్చుఁడే వీరవర్మ'[1] యని తమ వాదము నుద్ధరింపఁ జూచిరి. శాస్త్రిగా రేదృష్టితో జూచిరో కాని, సదరు శాసనమున వీరవర్మ నామమునకు బైన రెండు పర్యాయములు వచ్చు వీరకూర్చనామము వారికంటఁ బడకపోయెను.

1. ఎ. ఇం. సం. ౧౫. పు. ౨౫౩.

వాయలూరు శాసనమున (౫,౧౧) రెండు పర్యాయములును వీరకూర్చ నామము స్కందవర్మ, కుమారవిష్ణునామములకు ముందే వచ్చియున్నది. వేలూర్పాళెయపు శాసనమునను నట్లే యున్నది. దర్శిశాసనపులిపి చెందలూరు శాసనపు లిపికంటె ప్రాచీనముగ గన్పడుచుండుటచే తచ్ఛాసనదాత రెండవ కుమారవిష్ణువునకు పూర్వమున్నవాఁడనుట స్పష్టము. కావున నాతని ముత్తాతయగు వీరకూర్చవర్మ హీరహడగల్లి శాసనదాతయగు మొదటి స్కందవర్మయొక్క జనకుఁడేకాని యన్యుఁడు గాఁడు. దుబ్రాయలుగారేకారణముచేతనో వీరకూర్చునివే రెత్తురెరి. పల్లవవంశవృక్షమున లేనివేళ్లను కల్పించిరి. బప్ప, స్కందవర్మ, యు. మ. బుద్ధవర్మ, బుద్ధ్యాంకురులకు పిమ్మట విష్ణుగోపు నొక్కని సృజించి, తదనంతర మొక స్కందవర్మను వానికంటగట్టి, వానికి పల్లవవంశవృక్షము నతికించిరి. ఇట్లు దుబ్రాయలు పల్లవవంశమును బహూలీకరించుట కొక కారణము గన్పడుచున్నది. క్రీ. శ. నాల్గవ శతాబ్దిమధ్య కాలమున దక్షిణదేశముపై దండెత్తివచ్చిన గుప్తరాజు సముద్రగుప్తుఁడు కాంచీశ్వరుఁడగు విష్ణుగోపుని నోడించెనని హరిసేనుఁడు అలహాబాదు శిలాస్తంభశాసనమున జెప్పియున్నాఁడు. ప్రాచీన శాసనముల నన్నిఁటిని గాలించి చూచినను విష్ణుగోపనామపల్లవరాజైదవశతాబ్దమధ్యమువఱకెక్కడను గాన్పింపఁడు. కావున విశ్వాసానర్హమగు వాయలూరు శాసనము నాధారపఱచుకొని ప్రాకృతశాసన రాజులకు వెనుక నొక విష్ణుగోపునికి రాజ్యాభిషేక మొనర్చెను.

సముద్రగుప్తుని దక్షిణదండయాత్ర క్రీ. శ. 350-60 ల మధ్య జరిగియుండునని స్మిత్తుగారనిరి [1]హరిసేనుఁడు సముద్రగుప్తుని యుత్తరదిగ్విజయమునకు ముందు దక్షిణ దిగ్విజయమును వర్ణించియుండుటను

1. ఎర్లీహిస్టరీ ఆఫ్ ఇండియా.

కారణముగాఁ గొని దక్షిణ దిగ్విజయము క్రీ. శ. 335 సం. నకో 340 సం. నకో నడచియుండునని దుబ్రాయిలుగారనుచున్నారు.[1] తన యిరుగు పొరుగు దేశముల నుండు శత్రువుల నట్టె యుంచి ముందు దూర దేశములపై నేరాజునకు దండయాత్ర వెడలుట సంభవింపదు. ఉత్తరాపథము నందలి శత్రువులను లోఁబఱచుకొనక దక్షిణ దిగ్విజయమునకై సముద్రగుప్తుఁడు బయలుదేరెననుట నాకు నమ్మకము కలిగింపలేదు. కావున స్మిత్తుగారి యభిప్రాయమే సరియైనదని నాకు తట్టుచున్నది. సముద్రగుప్తుని దండయాత్ర యెప్పుడు నడచియుండినను ఆకాలమున విష్ణుగోపుఁ డను పల్లవరాజొకఁ డుండియుండవలయును. అట్టి రాజెవ్వఁడైన నున్నాఁడేమో కనుగొందము. ఉరువపల్లి శాసనదాతయగు విష్ణుగోపుని యన్న యగు సింహవర్మ క్రీ. శ. 436 మొదలు 460 వఱకును రాజ్యము చేసినట్లు ఫ్లీటుగారు నిర్ధారణ చేసియున్నారు.[2] విష్ణుగోపుఁడుగూడ నప్పటివాఁడనుట నిస్సంశయము. ప్రాకృత శాసనములందుగాని, సంస్కృత శాసనములయందుగాని విష్ణుగోప నామముగల వారలలో ప్రథముఁ డితఁడే. ఇంతకుముం దావేరుగల రాజెవ్వఁడును లేఁడు. ఉరువపల్లి విష్ణుగోపుఁడే సముద్రగుప్తుని ప్రతిపక్షి కాజాలఁడు. ఏలనఁగా వారి కించుమించుగ నొక శతాబ్దమెడ మున్నది. కావున నురువపల్లి విష్ణుగోపున కొకశతాబ్దముపూర్వ మొక విష్ణుగోపుఁ డుండియుండవలయును. అనఁగా నాతఁడు క్రీ. శ. 350 ప్రాంతమున రాజ్యము సేయుచుండియుండవలయును. సింహవర్మకు ముందు కంచియం దైదుగురు పల్లవరాజులు రాజ్యము చేసిరి. తరమునకు ౨౫ సంవత్సరములు విడిచిన, ౧౦౦ సంవత్సరము

1. ప్రా. ద. చ. పుట ౩౭.
2. ఇ. రా. ఏ. సొ. ౧౯౧౫, పు. ౪౧౭.

లలో నాలుగుతరము లగును. సింహవర్మకు నాలుగుతరముల ముందు న్నవాఁడు మొదటి స్కంధవర్మ. ఈతని కాలమున సముద్రగుప్తుని దండయాత్ర నడచియుండవలయును. అలహాబాదు శాసనపు విష్ణుగోపుఁడు స్కందవర్మ జ్యేష్ఠపుత్త్రుఁడై యాతని తరువాత రాజ్యమునకు వచ్చియుండవలయును. సంతానహీనుఁడుగనో, కయ్యముననో, పసితనముననే మడియుటచేత నాతని పేరు సంస్కృత ప్రాకృతశాసనములయందు గానరాకపోయెను.

టి. జి. శంకరయ్యరు, మొదటి స్కందవర్మ పుత్త్రుఁడగు యు. మ. విజయబుద్ధవర్మయు, చెందలూరు శాసనములోని బుద్ధవర్మయు నొక్కఁడే యనిరి. 1 చెందలూరిశాసనపు బుద్ధవర్మ తండ్రి పేరు కుమారవిష్ణుఁ డగుటచేత వీరేకపురుషు లను వాదము సాగదు; కావున మొదటి స్కందవర్మకు ముప్వురుపుత్త్రు లుండిరని యొప్పుకొనితీరవలయును. ఇంతటితో పల్లవ వంశావళింగూర్చిన తర్కమును చాలింతము.

ఈ క్రింది వంశవృక్షమునందలి రాజుల కాలము స్థూలముగ నిర్ధారణ చేయఁబడినది. సింహవర్మకాల మొక్కటియే నిశ్చయముగ దెలిసినది. తక్కిన రాజులకాలములు పురుషాంతరమునకు ౨౫ సంవత్సరములు తగ్గించుటవల్లను, హెచ్చించుటవల్లను తేలినవి. కావున భావిపరిశోధనవలన వాస్తవస్థితి బయల్పడవలయును.

---

1. ఇం. హి. క్వా. సం. ౩.

## వంశవృక్షము.

- వీరకూర్చవర్మ లేక, బప్పమహారాజా (౨౭౫-౩౧౦)
  - శివస్కన్దవర్మన్ ౧. (స్కన్దశిష్యుఁడు) (౩౧౦-౩౩౫)
    - విష్ణుగోపుఁడు (సముద్రగుప్తుని శత్రువు) (౩౩౫-౩౬౦)
    - కుమారవిష్ణువు ౧. (౩౬౦-౩౭౫)
      - బుద్ధవర్మ (౩౭౫-౪౧౦)
        - కుమారవిష్ణువు ౨. (౪౧౦-౪౩౫)
      - స్కన్దవర్మ
        - వీరవర్మ
          - స్కన్దవర్మ
            - సింహావర్మ (౪౩౫-౪౬౦)
              - స్కన్దవర్మ ౨ (౪౬౧-౪౭౫)
                - నన్దివర్మ (౪౭౫-౫౧౦)
            - యు. మ. విష్ణుగోప
              - సింహావర్మ
                - విజయవిష్ణుగోపవర్మ
    - యు.మ.విజయబుద్ధవర్మ చారుదేవిభర్త
      - [బుద్ధ్యాఙ్క]కుర

## 3

పై ప్రకరణమునందు పల్లవ వంశవృత్తమును రచించితిమి. ఆ వంశజుల చరిత్ర మింకను వర్ణింపవలసియున్నది పల్లవులకు నాగకన్యా మూలమున రాజ్యలాభము గలుగుట నింతకుపూర్వమే వచించియున్నాము. అటుపిమ్మటి వృత్తాంత మింకను జెప్పవలసియున్నది. దీని కాధారములు పల్లవరాజుల ప్రాకృతసంస్కృత శాసనములే. ఇవిగాక ఆకాలపు పరరాష్ట్రముల రాజుల శాసనములందును, కొన్ని పురాతన గ్రంథముల యందును పల్లవరాజుల విషయము చెప్పఁబడియున్నది. అందు ముఖ్యమైనవి.—

౧. సముద్రగుప్తుని యలహాబాదు శిలాస్తంభశాసనము: ఇందు సముద్రగుప్తుఁడు దక్షిణమున జయించిన రాజ్యములును, తదధిపుల నామములును వర్ణింపఁబడియున్నవి.

౨. కదంబ కకుత్స్థవర్మ తాళగుండశాసనము: (ఎ. ఇం. సం. ౬) కదంబరాజ్యస్థాపనను వర్ణించుచున్నది.

3. ,, మృగేశవర్మ రవివర్మల శాసనములు, (ఇం. ఆం. సం. ౬, పుట ౨౪, ౨౯.)

౪. కృష్ణవర్మ (౧) నాటి అణజిశాసనము: (ఎ. కర్నా. సం. ౯. దా. గి. నె. ౧౬౧.). కృష్ణవర్మ సైన్యము నెట్లు పల్లవులు హతము చేసినదియు వర్ణించుచున్నది.

౫. పెనుగొండశాసనము: (ఎ. ఇం. సం. ౧౫) గాంగపల్లవ రాజుల మైత్రిని దెల్పును.

౬. లోకవిభాగము: జైనభూగోళ విషయిక గ్రంథము. మొదటి సింహవర్మకాలమును దెలియఁజేయుచున్నది.

## వీరకూర్చ మహారాజు.

ప్రాచీనపల్లవ రాజులలో ప్రథముఁడు వీరకూర్చనామమహారాజు. నాగరాజు కొమార్తెను పెండ్లాడుటచే రాజ్యలాభము గలిగెనని వేలూర్పాళెయపు శాసనము పల్కుచున్నది.

"యః ఫణీన్ద్రసుతయా సహాగ్రహీ
ద్రాజచిహ్న మఖిలం యశోధనః".

దర్శి శాసన మీతఁడు "స్వబాహుబలార్జితోర్జితక్షాత్త్రుఁ" డని చెప్పుచున్నది. ఇంతకుమించి యీతని విషయ మేమియు మనకుఁ దెలియదు. ఇతని కుమారుఁడగు మొదటి స్కన్దవర్మ యీతని 'బప్ప మహారాజ'ని పేర్కొని, "అప్రతిహతశాసనుఁ" డనియు, "అనేక హిరణ్యకోటి గోహలశతసహస్రప్రదాత" యనియు జెప్పుచున్నాఁడు. హాల శత సహస్రప్రదానమును గూర్చి డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారి ట్లనుచున్నారు:—

"దీనికి (గోహలశతసహస్ర యనుదానికి) నేమైన నర్థమున్నచో నరణ్యమును నరికించి భూమిని వ్యవసాయార్హముగుదానిగ మార్ప నీ రాజు ప్రయత్నము జేసెనని నిస్సంశయముగ సూచించుచున్నది. ఈసందర్భమున నొక విషయమును గమనింపవలయును. తమిళుల కీదేశము (సాతవాహనాహారము: దత్తమండలము) దండారణ్య మనుపేర నెరుక పడియుండినది. ఇదియే సంస్కృతపు దండకారణ్యము. ఇచ్చట పశుపాలనము ముఖ్యోద్యోగము; పశుహరణము ముఖ్యక్రీడ. ఈ బప్పదేవుఁడే యరణ్యమును వ్యవసాయార్హముగఁ జేయ—ప్రయత్న మెంతవఱకు సఫలమో చెప్పజాలము—ప్రయత్నము జేసెను. కావున నీరాజు జనులకు మహోపకార మొనర్చెను. ఇట్టి ప్రభువులను దత్తమండలములోని జను లింకను స్మరించుచున్నారని స్థానిక చరిత్రలవలన దెలియుచున్నది."

ఈతని రాజ్యకాలమున పల్లవరాజ్య విస్తీర్ణ మెంత? ఈతని కుమారుఁడగు శివస్కన్దవర్మ శాసనములవలన నీవిషయమును దెలిసికొన వచ్చును. సాతవాహనరాష్ట్రము (అనఁగా ప్రస్తుత దత్తమండలములో గొంతభాగమును, మైసూరు సీమలోని గొంతభాగమును), కంచీపురము (అనఁగా తొండమండలము), ఆంధ్రపథము (అనఁగా కృష్ణవఱకుగల యాంధ్రరాజ్యము) పల్లవులకు స్వాధీనముగ నుండెను.

మఱియు నీతని రాష్ట్రమున కుంతలదేశముకూడ జేరియుండెను. పశ్చిమ సముద్రమె పల్లవరాష్ట్రమునకు పడమటి సరిహద్దుగ నుండెను. ఈవిషయమున పండితులు భిన్నాభిప్రాయమును గనఁబఱచియున్నారు. వారిలో ప్రముఖుఁడు ప్రొఫెసరు రాప్సన్ అను నతఁడు. ప్రస్తుతము మైసూరుసీమలోని షికారిపురతాలూకాయందు మలవల్లి యను గ్రామము గలదు. ఆయూర పురాతనప్రాకృతశాసనములు రెండు చెక్కఁబడిన శిలాస్తంభ మొకటి కలదు. అందొకటి, "హారీతిపుత్ర విష్ణుకడ్డ చుటుసాతకంణి" యను నతనిది. ఇతఁడు నాగవంశజుఁడగు నాంధ్రభృత్య రాజు. రెండవది, పేరులేని కదంబరాజుది. ఈ రెండు శాసనములను విమర్శించుచు రాప్సన్ ఇట్లు వ్రాయుచున్నాఁడు:—

"ఈశాసనము (మొదటిది) ఆగ్రామమందలి దానమును తెల్పుచున్నది. ఇది రాజునకు 'వైజయంతీపుర రాజా' యను బిరుదు నిచ్చుచున్నది. ఇదే స్తంభముపై నీశాసనమును క్రింద వేఱొక శాసనము గలదు అక్షరములనుబట్టి చూడ నిది పైశాసనముకంటె విశేషము పిమ్మటిదిగాదు. ఇందువలన బనవాసిరాజ్యము (కుంతలము) చుటువంశము వారికడనుండి కదంబులహస్తగత మైనట్లు తెల్లమగుచున్నది" ప్రొఫెసరు రాప్స నన్నట్లు కుంతలరాజ్యలక్ష్మి చుటుకులమును వీడి తత్క్షణమే కదంబవంశము నాశ్రయించలేదు. మొదటికారణ మేమన, చుటువంశ

మంతరించిన కాలమున కదంబరాజవంశ ముత్పత్తి కాలేదు. మఱియు కదంబులకు కుంతలరాజ్యప్రాప్తి పల్లవనరపాలుర యనుగ్రహమువలన గలిగినది. ఈవిషయము కదంబరాజవంశమునకు మూలపురుషుఁడగు మయూరవర్మ మనిమనుమఁడగు కకుత్స్థవర్మయొక్క తాళగుండశిలా శాసనముచేఁ దెలియుచున్నది. మయూరవర్మకు రాజ్యప్రాప్తిగల్గిన విధమునుగూర్చి యిట్లు చెప్పఁబడియున్నది:—

సంశ్రిత స్తదా మహీపాలా నారాధ్య యుద్ధేషు విక్రమైః;
ప్రాపపట్టబంధసంపూజాం కరపల్లవైః పల్లవేన్ద్రాణాం.
భంగురోర్మికావల్లిలీలైన్నృత్య దపరార్ణవాంభః కృతావధిం;
ప్రేహారాన్త మనన్యసఞ్చరణ సమయస్థితాం భూమి మేవచ.

పైశ్లోకములవలన మయూరవర్మ పల్లవరాజుల నాశ్రయించి అనేక యుద్ధములయందు విక్రమమును బ్రకటించుటచే వారిప్రసాదమునకుఁ బాత్రుఁడాయెననియు, దక్కారణమున ప్రేహారము మొదలు పశ్చిమ సముద్రమువఱకు గలరాష్ట్రమున కాతని నధిపతిని జేసి స్వకరపల్లవములచే నాతనికి పట్టబంధముఁ జేసిరనియుఁ దెలియుచున్నది.

కావున కుంతలము కదంబులకు పూర్వము పల్లవుల స్వాధీనమందుండె ననుట స్పష్టము. ఆంధ్రభృత్యుల యనంతరము పల్లవులును, పిమ్మట కదంబులును కుంతలముపై రాజ్యముచేసిరి. వీరకూర్చుని కాలమున కుంతలము పల్లవుల యేలుబడికి లోనై యుండెననుట నిస్సంశయము. ఒక కుంతలమే కాదు. కొంగుదేశమునసైత మాతని యధికారము చెల్లియుండవలయును. కావున నాతఁడు భార్యమూలమున లబ్ధమైన ఆంధ్రసామ్రాజ్యపు దక్షిణార్థమున కధిపతియై యుండెను. అతని రాజధాని కంచి.

## (శివస్)స్కందవర్మ క్రీ. శ. 310-33?

శివస్కందవర్మ వీరకూర్చుని పుత్రుఁడని యింతకు పూర్వమే చెప్పి యున్నాము. ఇతనివి రెండు శాసనములు దొరకినవి. అందు మొదటిది మైదవోలు శాసనము. ఇది శివస్కందవర్మ యువరాజుగ నున్నకాలమున నిచ్చినది.

> "యువమహారాజో భారదాయసగోత్తో
> పలవానాం శివఖ[ం]దవమ్మో."

ఇది బప్ప లేక వీరకూర్చ మహారాజు 10 వ రాజ్యవర్షమున నొసగఁబడెను, అని మైదవోలు శాసనమున నున్నది.

రెండవది, హిరహడగల్లి శాసనము. ఇది రాజైన పిమ్మట 8-వ రాజ్యవర్షమున నిచ్చినది. రాజు తన్నుగూర్చి యిట్లు చెప్పుకొని యున్నాఁడు:—

> "అగ్గిథోమ వాజపేయాస్సమేధయాజీ ధమ్మమహారాజాధిరాజో
> భారద్దాయోపల్లవాణ సివఖందవమో."

ఈ రెండుశాసనములు గాక యీతని రాజ్యకాలమున నీయఁబడిన శాసనము మఱియొకటి కలదు. దీనిని చారుదేవియొక్క గుంటూరుమండల శాసన మందురు. ఈమె (విజయ) స్కందవర్మయొక్క పుత్రుఁడును, యువమహారాజును నగు విజయబుద్ధవర్మయొక్క భార్య. ఈదంపతులకు "అంకుర" శబ్దాంత నామధేయుఁ డగు పుత్రుఁడొకఁ డుండెను. వానిపేరు బుద్ధ్యాంకుర యని హుల్ట్షుగారనిరి. శాసనదాత్రి యువమహారాజ్ఞి యగుటచే నప్పటికి యువమహారాజు బ్రదికియుండెనా యను సంశయము కలుగుచున్నది. ఇది నిజమైనను కాకపోయినను బుద్ధవర్మ శివస్కన్దవర్మ

ప్రథమపుత్రుఁ డనుట నిజము. దీని కితఁడు యౌవరాజ్యపట్టాభిషిక్తుఁ డగుటయే సాక్ష్యము. ప్రాచీన పల్లవరాజులు తమ ప్రథమ పుత్రుని గాని, సోదరునిఁ గాని యౌవరాజ్యమున కభిషిక్తునిఁగ జేయుచుండినట్లు తోఁచుచున్నది. శివస్కన్దవర్మ తన తండ్రి కాలమున యువరాజుగ నుండెను. అట్లే బుద్ధవర్మయును. సింహవర్మ రాజ్యకాలమున నాతని సోదరుఁడు విష్ణుగోపుఁడు యువరాజుగ నుండెను. ఇంతేకాక మహారాజు రాజధాని యగు కాంచీపురినుండి పల్లవరాజ్యములోని దక్షిణభాగము నేలుచుండెను. ఉత్తరార్ధము యువమహారా జేలఁబడియుం డుండె ననుట స్పష్టము. శివస్కన్దవర్మ యువరాజుగ నున్నప్పుడు ఆంధ్రపథమునందలి విరిపరయను గ్రామమును దానముసేయుచు ధాన్యకటకములోని తనవ్యాపృతుని కడి యొఱుకపఱచెను. యువరాజగు బుద్ధవర్మ భార్యయగు చారుదేవి దాలూరునందలి విష్ణుదేవాలయమునకు భూదానమును జేసి తద్వర్తమానమును "కడక", అనగా ధాన్యకటమునందలి యధికారి కెఱుకపఱచెను. తరువాతి కాలమున సింహవర్మ యనుజుఁడగు విష్ణుగోపవర్మయు, తద్వంశజులును ప్రస్తుతపు నెల్లూరు గుంటూరు మండల సంగమ ప్రాంతములలోని దశనపుర, పలక్కద (పులికాటు), తాంబ్రాప (చేబ్రోలు) యను స్థలములనుండి పల్లవరాజ్యపు టుత్తరార్ధముపై ప్రభుత్వము సేయుచుండిరి. ఈయుదాహరణములవలన పల్లవ యువరాజులు పల్లవసామ్రాజ్యములోని యుత్తర విషయముల కధిపతులై యుండిరని తేలుచున్నది.

శివస్కందవర్మ కాలమున బల్లవరాజ్య విస్తీర్ణమునుగూర్చి యిదివఱకే చెప్పియున్నాము. ఈతని శాసనములు ఈతఁడు అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధ యాగములను జేసెనని చెప్పుచున్నవి. కడపటి యాగమును దిగ్విజేతలును, సామ్రాజ్యపట్టభద్రులును నగు రాజులే చేయ

దగినది, తదితరుల కసాధ్యము. కావున నీతఁడు మహాశూరుఁడై రాజ్యములను గెల్చినట్లు తోచుచున్నది. ఈతఁడు జయించిన రాజ్యము లెవ్వియో, రాజు లెవ్వరో తెలియదు. అయినను వేలూర్పాళెయపు శాసనమున స్కందశిష్యుఁడు, అనఁగా స్కన్దవర్మ సత్యసేనుఁ డనురాజును జయించి, బ్రాహ్మణఘుటికను దీసికొన్నట్లు చెప్పఁబడియున్నది :

"అన్వవాయనభశ్చన్ద్రైః స్కన్దశిష్య స్తతో భవ;
ద్విజానాం ఘుటికాం రాజ్ఞః స్సత్యసేనా జ్జహార యః,"

ఈసత్యసేనుఁ డెవ్వఁడో తెలియరాదు. డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారీతఁడు క్షాత్రపుఁడగు స్వామి సత్యసింహుఁ(సేను)డే యనుచున్నారు. కాని యది నిజముగాదు.

అప్పటి రాజ్యపరిపాలనవిధానము శివస్కన్దవర్మ శాసనములవలన కొంత దెలియుచున్నది సర్వాధికారమును రాజునందే యుండెను. రాజ్యపాలనమున రాజునకు యువరాజు తోడ్పడుచుండెను. రాజు నిరంకుశుఁడు గాఁడు. రాజధానియందు మంత్రాంగసభ యొక్కటియుండెను. ఈసభవారి యిష్టానుసారము వర్తించినను లేకున్నను వారి యభిప్రాయములను ముఖ్యవిషయములయం దడుగుట రాజున కాచారమని తోచెడిని. ఈమంత్రాంగసభలో సభ్యత్వమున కెవ్వరర్హులో చెప్పుటకు వీలులేదు. హీరహడగల్లి శాసనముప్రకారము కొలివాల గ్రామభోజకుఁడు భట్టిసమ్మ యీసభకు జేరిన సభ్యుఁడు,

"కొలభోజకస రహసాధికత భట్టిసమ్మస"

యని శాసనము. ఇంతమాత్రముననే భోజకు (అనఁగా యినాందారు)లకు మంత్రాంగసభలో సభ్యత్వము తమభోజకత్వమువలన లభించెడిదని తలఁపరాదు. భట్టిశర్మ బ్రాహ్మణుఁడు. ఈతని బ్రాహ్మణత్వము

వలననే యాతఁడు రహస్యాధికృతుఁ డయ్యెనని గ్రహించవలయును. పూర్వపు క్షత్రియుల సభలయందుఁబోలె పల్లవరాజుల సభలయందు మంత్రి రాజకుమారులతోపాటు బ్రాహ్మణులుగూడ మంత్రము చెప్పుచుండుట యాచారము.

పాలన సౌకర్యార్థమై పల్లవరాజ్యము రాష్ట్రములుగ విభజింపఁబడియుండెను: సాతవాహనరాష్ట్రము, ఆంధ్రపథము, ముండకరాష్ట్రము, కర్మరాష్ట్రము ఇత్యాదులు. ఈరాష్ట్రములపై నధిపతులను రాజేర్పఱచుచుండెను, ఇందు కొందఱు రాజకుటుంబమునకు సంబంధించినవారు; తక్కినవారు సామాన్యులు. ప్రతిరాష్ట్రమును మాడంబము లను పేరుగల భాగములుగ మరల విభజింపఁబడియుండెను. మాడంబమున కధిపతి మాడంబికుఁడు, లేక మాడబికుఁడను పేరుగల యధికారి. వీరుగాక స్థానికాధికారులును, గ్రామాధికారులునుఁ గూడ నుండిరి. హీరహడగల్లి శాసనమున నింక ననేకులు రాజభృత్యులు పేర్కొనఁబడియున్నారు: పల్లవులు, గోవల్లవులు, అమాత్యులు, ఆరక్షకాధికృతులు, తిథూకులు, నైయోగికులు మొదలగువారు. ఈయుద్యోగస్థుల నామములను, పరిపాలనావిధానమును జర్చించునపుడు కౌటిలీయార్థశాస్త్రమునందును, నశోకుని శిలాశాసనములలోను వర్ణింపఁబడిన మౌర్యసామ్రాజ్యపు కట్టుదిట్టములు జ్ఞప్తికి వచ్చును. పినాకినపర్యంతము వ్యాపించియుండు దక్షిణదేశము అశోకచక్రవర్తికాలమున మౌర్యులయేలుబడికి లోనైయుండుట సుప్రసిద్ధమైన విషయమే. తదనంతర మాంధ్రరాజులకాలమున పరిపాలన పద్ధతులు మాఱక పల్లవులకాలమువఱకు కల్లే యుండినట్లు తోచెడిని.

శివస్కందవర్మకాలమున జను లెంత సుఖ మనుభవించిరో తెలియదు. అయినను వారిపై విధింపఁబడిన పన్నులను జూడ వారు విశేష

సుఖ మనుభవించిరని తలంచుట కవకాశము లేదు పన్నులను రాజున కిచ్చుటయేగాక రాజభృత్యు లగు నధికారులకు పాలు మజ్జిగలను సరఫరా చేయవలసి యుండెను. ఉప్పు పంచదారలమీఁది పన్నును సర్కారున కు చెల్లింపవలసి యుండెను. అంజేపను లధికారుల యిష్టప్రకారము చేయవలసియుండెను. అధికారులు గ్రామస్థులకడనుండి పచ్చిక, కలప, పశువులు, పండ్లు, పుష్పములును గొనుట యాచారమైయుండెను. ఇట్లు జనులు సర్కారువారి కీయవలసిన పన్నులకుగాని, చేయవలసిన చాకిరులకుగాని "బాధ" లని పేరు. ఇటువంటి బాధలు పదునెనిమిది. వీని యం దొక్కటి ప్రజల నుపద్రవించుచున్నట్లు తోఁచెడి. సంచరింతల (సిపాయీల) వల్లబాధ విశేషముగ నుండెడిది. వీ రిచ్చవచ్చినట్లు రాజ్యమునం దంతటను సంచరించుచు జనులను బాధించెడివారు. సంచరింతల వలె గూఢపురుషులు రాజ్యమంతటను సంచరించెడివారు. గూఢపురుషుల స్వభావ మెఱింగిన మన తరమువారికి వారివల్ల గలుగు నుపద్రవ మిట్టిదని వర్ణింప నవసరము లేదుగదా.

### కాంచీపురము: ప్రాచీనపల్లవ రాజధాని.

బప్పదేవుఁడు లేక వీరకూర్చవర్మయొక్క రాజ్యకాలమునుండి యు పల్లవులకు రాజధాని కాంచీపురము. మైదవోలు శాసనము కాంచీపురమున నీయఁబడినది.

> "కాంచీపురాతో యువమహారాజో భారదాయసగోత్తో పలవానం
> సివఖందవమ్మో ధంఞకడే వాప్తం ఆణపయతి"

యని శాసనము. ఇందువల్ల శివస్కందవర్మ యువరాజుగ నున్నప్పుడు కంచి పల్లవులరాజధాని యగుట స్పష్టము. అట్లే హీరహడగల్లి శాసనమునను

"కాంచీపురా అగ్గిత్థోమ వాజపేయాస్సమేధయాజీ ధమ్మ మహా రాజాధి రాజో భారద్దాయో పల్లవాణ శివఖందవమ్మో"

యని చెప్పఁబడియున్నది. కావున శివస్కందవర్మ రాజధానియు కాంచీపురమేయని స్పష్టము. పల్లవరాజ్య ముత్పన్నమైనది మొదలు వారికి కాంచీపురమే రాజధాని.

## విష్ణుగోపుఁడు (335-360)

శివస్కందవర్మ యనంతరము పల్లవ రాజ్యాధిపత్య మెవ్వరు వహించినదియు నిశ్చయించి చెప్పుటకు వీలుగాదు. శాసనములును అనేకసందేహముల కాస్పదము లగుచున్నవి. ఇంతకుపూర్వము నాచే నిర్ణయింపఁబడిన కాలనిర్ణయపట్టికను బట్టి శివస్కందవర్మ గుప్తచక్రవర్తియగు మొదటిచంద్రగుప్తునకు (310-330) కొంచె మించుమించుగ సమకాలీను డగుచున్నాఁడు. మొదటి చంద్రగుప్తునియనంతర మాతనిపుత్త్రుఁడు సముద్రగుప్తుఁడు చక్రవర్తి యాయెను. ఇతడు దిగ్విజేత. దక్షిణ దిక్కుపై దండువెడలి తూర్పుసముద్రతీరమున బ్రభుత్వము సేయుచున్న రాజుల నదిమి కప్పముగొని, యుత్తరాపథనృపాలురను నిర్మూలము గావించి, యశ్వమేధ యాగము నొనర్చి, మహారాజాధిరాజపదమును బడసెనని హరిసేనకృతమగు నలహాబాదు శిలాస్తంభశాసనము పలుకుచున్నది. హరిసేనుఁడు పైప్రశస్తియందు సముద్రగుప్తునిచే బరిభవింపఁబడిన రాజులను, వారి రాజ్యములనుఁ బేర్కొనియున్నాఁడు. వారెవ్వరన్న :

| | |
|---|---|
| ౧. కోసలరాజు | మహేంద్రుఁడు. |
| ౨. మహాకాంతారాధిపుడు | వ్యాఘ్రరాజు. |
| 3. కౌరాళకనృపాలుఁడు | మంతరాజు. |

| | |
|---|---|
| ౪. పిష్ఠపురీశ్వరుఁడు | మహేంద్రుఁడు. |
| ౫. కొట్టూరాధిపతి | స్వామిదత్తుఁడు. |
| ౬. ఏరాణ్డపల్లి రాజు | దమనుఁడు. |
| ౭. కంచిరాజు | విష్ణుగోపుఁడు. |
| ౮. అవముక్తాధిపుఁడు | నీలరాజు. |
| ౯. వేంగీశ్వరుఁడు | హస్తివర్మ. |
| ౧౦. పాలకరాజు | ఉగ్రసేనుఁడు. |
| ౧౧. దైవరాష్ట్రనాథుఁడు | కుబేరుఁడు. |
| ౧౨. కుస్థలపురరాజు | ధనంజయుఁడు. |

ఈరాజులను సముద్రగుప్తుఁడు బద్ధులనుగ జేసి పిమ్మట విడిచెను. ఈరాజ్యము లుండినస్థలములు దెలియకపోవుటచే చంద్రగుప్తుఁడు కేరళ పర్యంతముగల దక్షిణదేశమును జయించెనన్న భ్రమ యొక్కటికలిగెను. కాని యిటీవల దుబ్రాయలుగారి పరిశ్రమలవలన సముద్రగుప్తుని దండ యాత్ర తూర్పుసముద్రతీరదేశములపై గృష్ణానది యుత్తరపుటొడ్డు వఱకు వ్యాపించెనని తెలుచున్నది. గుప్తపల్లవసైన్యములు కృష్ణ కావలి యొడ్డుననే తారసిల్లెననియు, సముద్రగుప్తునకే పరాజయము కలుగుటచే యప్పటినుండియే వెనుకకుఁ దరలెననియు దుబ్రాయ లనుచున్నాఁడు. దీనికి శాసనస్థమగు నాధార మెద్దియు లేదు. అట్టియాధారమును గల్పింప సమకట్టి ఆర్. సుబ్బారావుగారు సాలంకాయనరాజగు మొదటి నంది వర్మ పెదవేగి శాసనములోని

"విజయవేంగీపురానైక సమరవాప్తవిజయినో హస్తివర్మ మహా రాజస్య"

యన్నవాక్యము నాధారపఱచుకొని, హస్తివర్మయే సముద్రగుప్తుని గెల్చెనన్న భావమును సూచించిరి. ఇచ్చట విజయశబ్దము శుభసూచ

కము. దీని కంతకంటె విశేషార్థ మున్నట్లగపడదు. విజయకాంచీపుర, విజయదశనపుర, విజయపలక్కడలలోని 'విజయ'శబ్దమున కేయర్థము గలదో ఆయర్థమే 'విజయవేంగీపురము'లోని 'విజయ' శబ్దమునకును కలదని నాభావము. అట్లుగాక 'విజయ' శబ్దము జయమును దెల్పునదే యని వాదమునకై యొప్పుకొన్నను, హస్తివర్మ సముద్రగుప్తు నోడించె ననుట కది యెట్లాధారము కాగలదు ?

వాస్తవము విచారించిన సముద్రగుప్తుడు కృష్ణను దాటినట్లే తోచుచున్నది. కంచిరాజగు విష్ణుగోపుని మాత్రమే కాక పాలకరాజగు నుగ్రసేనునిగూడ జయించినట్లున్నది. పాలక (పాలక్కడ) యనునది కృష్ణకు దక్షిణదేశమున నున్న పల్లవముఖ్యపట్టణములలో నొకటి. కావున పాలకరాజు పల్లవుల సామంతుడనుట నిజము. కంచివిష్ణుగోపుని జెప్పి పాలకయుగ్రసేనుని జెప్పుటచే సముద్రగుప్తుడు వారితో వేరు వేరుగ యుద్ధముజేసియుండును. పాలకరాజును పాలకపురముననే జయిం చెనని తోచుచున్నది. భావిపరిశోధనవల్లగాని నిజము తేలదు.

పై వాదములోని నిజానిజము లెట్లున్నను ఒకవిషయమునుగూర్చి మనము సందేహపడవలసిన యవసరములేదు. అది యెద్దియన, సముద్ర గుప్తుని సమకాలికుడగు పల్లవరాజు పేరు విష్ణుగోపుడనుటయే. అందువలన క్రీ. శ. ౪-వ శతాబ్దారంభమున కంచియందు రాజ్యముసేయుచున్న శివస్కందవర్మకును, నీతనికిని నేదేనిసంబంధ ముండవలెననుట నిశ్చయము. ఈబంధుత్వమును నిర్ధారణసేయుట కేశాసనమును దోడ్పడదు కావున దుర్భాయ లీతనికొఱకై ౫౧ వర్షము లెడము సంపాదించవలసివచ్చెను. ఒంగోడు (౧) శాసనములోని (మొదటి) కుమారవిష్ణువును చారుదేవి కుమారుడగు బుద్ధ్యాంకురునికి మునిమనుమనిగ జేసి ప్రాకృతసంస్కృత

శాసనములమధ్య విష్ణుగోప స్కందవర్మల నిరికించెను. వాయలూరు వేలూర్పాళెయదర్శిశాసనములు వీరకూర్చుఁ డనురా జొందెనని చాటుచున్నను దుబ్రాయ లాతని నామమును స్మరింపలేదు. స్మరించియున్న యాతనివాదము డొంక తప్పియుండెడిది. వాయలూరు శాసనమున వీరకూర్చనామధేయులిద్దరు (౫, ౧౧) గన్పించుచున్నారు. విష్ణుగోపుఁడు ౮-వ వాఁడు; అనఁగా, వానిపేరు పై యిద్దరు వీరకూర్చుల మధ్య నున్నది. వేలూర్పాళెయపు శాసనమున పల్లవరాజులలో ప్రథముఁడు వీరకూర్చుఁడనియు, తత్పుత్రుఁడు స్కందశిష్యుఁడనియు, వాని కొడుకు కుమారవిష్ణువనియు చెప్పఁబడియున్నది. కావున వీరకూర్చుఁడు పల్లవరాజులలో గడుప్రాచీనుఁడని తెలుచున్నది. ఈవిషయమును కృష్ణశాస్త్రిగా రొప్పుకొన్నారు. పై శాసనములనుబట్టి యీతఁడు ప్రాకృతశాసనముల కాలమువాఁడని యొప్పుకొనవలసియున్నది. ఇతని మనిమనుమఁ డచ్చినదే దర్శిశాసనము. దీనిభాష సంస్కృతము. వీరకూర్చుని కొడుకు శివస్కందవర్మ కాలమునకు శాసనములభాష ప్రాకృతము. అతని మనుమని కాలమున సంస్కృతము. ఇట్లు శాసనములభాష రెండు తరములలో మారిపోయెను. కాని దర్శిశాసన మెప్పటిది? ఈప్రశ్నకు సమాధానము చెప్పుట సులభముగాదు. అయినను ప్రయత్నము చేయుదము. పల్లవశాసనములలో బహుపురాతనమైనది హిరహడగల్లి శాసనము. దాని యక్షరములు చక్కఁగ తీరియుండక పోవుటగాక నానాఘాటు శిలాశాసనాక్షరములను బోలియున్నవి యువమహారాజు విష్ణుగోపవర్మ యురువపల్లి శాసనము క్రీ. శ. ౪౪౭నం దీయఁబడినది. దీని యక్షరములు చక్కఁగ తీరియుండుటయేకాక దుబ్రాయలుగా రన్నట్లు "నిజమైనపెట్టెతలలు" గల్గియున్నవి. ఓంగోడు (౧) శాసనములోని లిపి యురవపల్లి లిపికంటె పురాతనమైనదని కృష్ణశాస్త్రిగారు వచించియు

న్యాయ. దర్శిశాసనపు టక్షరములను పైశాసనాక్షరములతోఁ బోల్చి చూచిన నొక్కవిషయ ముందరని తప్పక బోధపడగలదు. దర్శిశాసనపు టక్షరములు హీరహడగల్లి శాసనాక్షరములకంటె నవీనములుగను, ఓంగోడుకన్న ప్రాచీనములుగను, ఉరువపల్లికన్న ప్రాచీనతరములుగను గాన్పించుచున్నవి కావున దర్శిశాసనము హీరహడగల్లి ఓంగోడు (౧) శాసనముల మధ్యకాలమునదని తెలియుచున్నది. హీరహడగల్లి శాసన దాత వీరకూర్చుని కుమారుఁడగు శివస్కందవర్మ, దర్శిశాసనము నిచ్చిన వాఁడితని మనుమఁడు ఉరువపల్లి శాసనదాతయగు యు. మ. విష్ణుగోప వర్మయొక్క తాత యగు వీరవర్మయో, యాతని సమకాలికుఁడగు నింకొక పల్లవరాజో దర్శిశాసనము నిచ్చియుండవలయును. యు. మ. విష్ణుగోపవర్మయొక్కయు,దత్పుత్రపౌత్రులయొక్కయు శాసనములన్నియు దశనపుర పలక్కడ కాంచీపురములనుండి యీయఁబడియుండుటచేతను, దర్శిశాసనమున 'విజయదశనపురాధిష్ఠాన' యని యుండుటచేతను నా శాసనమును యు. మ. విష్ణుగోపవర్మయొక్క తాతయగు వీరవర్మయే యిచ్చెనని నాతలఁపు. ఇది నిజమేని దర్శిశాసనకాలమును నొక తెఱఁగున గనిపెట్టవచ్చును. యు. మ. విష్ణుగోపుని యన్నయగు సింహవర్మ ౪౩౬ మొదలు ౪౬౦ వఱకు రాజ్యముచేసెను. అతని తండ్రి స్కందవర్మ ౪౧౦ మొదలు ౪౩౬ వఱకును, తాతయగు వీరవర్మ ౩౮౫ మొదలు ౪౧౦ వఱకును రాజ్యముచేసి యుండవలయును. కాబట్టి దర్శిశాసనము ౩౮౫-౪౧౦ ల మధ్యకాలమున నీయఁబడియుండవలయును. ఈకాలనిర్ణయము సరియైనచో వీరకూర్చుఁడు క్రీ. శ. ౨౮౫ మొదలు ౩౧౦ వఱకును, శివస్కందవర్మ ౩౧౦ మొ. ౩౫౩ వఱకును రాజ్యపాలనము జేసి యుండవలయును. సముద్రగుప్తుని దండయాత్ర దుబ్రాయులుగారు చెప్పినట్లు ౩౩౫-౪౦ ల మధ్య నడచినను శివస్కందవర్మకు దరువాతి కాల

ముననే నడచియుండవలయును. కావున నేను రచించిన పల్లవవంశావళి యందు ప్రయాగశాసనములోని విష్ణుగోపుఁడు శివస్కందవర్మ పుత్రుఁడై యుండునని శంకించితిని. అయినను చారుదేవి శాసనము శివస్కందవర్మకు బుద్ధవర్మ యను కుమారుఁడు యువరాజుండెననియు, నాతని పుత్రుఁడు బుద్ధ్యాంకురుఁ డనియు తెల్పుచున్నదిగదా! యువమహారాజగుటచే బుద్ధ వర్మ శివస్కందవర్మయొక్క జ్యేష్ఠపుత్రుఁ డనుట నిజము. అయినను వాయలూరు శాసనమునందుగాని వేలూర్పాళెము శాసనమునగాని స్కంద వర్మ యనంతరము బుద్ధవర్మగాని, బుద్ధ్యాంకురుఁడు గాని రాజ్యమునకు వచ్చినట్లు చెప్పలేదు. ఒకవేళ ఏకారణముచేతనైనను బుద్ధవర్మ తండ్రికి పూర్వము మృతినందగా నతని కుమారుఁడు బుద్ధ్యాంకురుఁడే శివస్కంద వర్మకు పిమ్మట రాజ్యాభిషిక్తుఁడై యుండవచ్చును. బుద్ధ్యాంకుర యను నది బిరుదని యందరొప్పుకొన్న విషయమే ఇతని పేరు వాస్తవముగ విష్ణుగోపుఁడై యుండవచ్చును. యుద్ధముననో, మరియొక విధముననో విష్ణుగోపబుద్ధ్యాంకురుఁడు మరణమొంద, నాతని పినతండ్రి మొదటి కుమారవిష్ణువు కంచిరాజ్యమున కధిపతియై యుండవచ్చును. శాసనముల లోని రాజులు తమ పితృ పితామహ ప్రపితామహులనే పేర్కొను నాచారమును పాటించువారగుటచే ఈవిష్ణుగోపుని స్మరింపరైరి.

డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు ఉరువపల్లి శాసనదాతయగు యు. మ. విష్ణుగోపుఁడే సముద్రగుప్తునితోఁ బోరాడిన విష్ణుగోపుఁ డను చున్నారు. ఇది సాధ్యముగాదు. కారణ మేమన 'లోకవిభాగ'మను జైనభూగోళగ్రంథము వలన కంచిరాజగు సింహవర్మ (యు. మ. విష్ణు గోపునియన్న) శ. ౩౫౮, అనగా క్రీ. శ. ౪౩౬న రాజ్యాధిపత్యమును వహించినట్లు తెలియవచ్చుచున్నది కావున యు. మ. విష్ణుగోపున కొక శతాబ్దమునకు పూర్వమే సముద్రగుప్తుని దండయాత్ర నడచెను. అందు

వలన యు. మ. విష్ణుగోపుఁడు సముద్రగుప్తుని సమకాలీనుఁ డనువాదము నిలువజాలదు. మన ప్రస్తుత చరిత్రజ్ఞానమునుబట్టి చూడ యు. మ. విష్ణుగోపునకు పూర్వ మింకొక విష్ణుగోపుఁడు రాజ్యము చేసిన ట్లగపడుచున్నది. నిజము భావిపరిశోధనవలన గాని బయల్పడదు.

శివస్కందవర్మకు దరువాతి కాలమున బల్లవరాజ్యమున గొంత యల్లకల్లోల ముండినట్లు గాన్పించుచున్నది. శివస్కందవర్మ కాలమున కాంచీపురము పల్లవరాజధాని యనుట నిరూపింపఁబడెనుగదా! వేలూర్పాళెయపు శాసనము నిజము పల్కుచుండు పక్షమున కుమారవిష్ణుప్రరాజ్యాభిషిక్తుఁ డైనప్పుడు కంచి పల్లవుల స్వాధీనమందు లేదనుట నిజము. వేలూర్పాళెయపు శాసనము దిట్లున్నది:—

"గృహీతకాఞ్చీనగర స్తతోఽభూ
త్కుమారవిష్ణు స్సమరేషు జిష్ణుః."

కావున కుమారవిష్ణునికి పూర్వము కంచి పరహస్తగత మైనదనుట నిజము. కాని కంచిని పల్లవుల కడనుండి యొడిచికొన్న శత్రువు లెవ్వరు? ఈ సంశయమును పై శాసనమే నివారించుచున్నది:

"భర్తా భువోఽభూ దథ బుద్ధవర్మా
య శ్చోళసైన్యార్ణవ బాడబాగ్నిః"

అనుటచే నీప్రాంతమునయందు పల్లవులతో బోరాడుచుండిన శత్రువులు చోళులనుట తెల్లము. కావున కుమారవిష్ణునికి పూర్వము కంచిని గల్చినవారు చోళరాజులై యుండవలయును. ఇందువలన శివస్కందవర్మయనంతరము పల్లవరాజ్యమున నల్లకల్లోలము గల్గినదనుట నిజము.

సముద్రగుప్తుని దండయాత్రవలన పల్లవరాజుల బలమును, యశమును గొంతవఱకు క్షీణించియుండవలయును, ఈకాలముననే

కదంబవంశస్థాపకుఁడగు మయూరశర్మయు పల్లవరాజుల నెదుర్కొని యుండవలయును. ఈతని విషయము తాళగుండశాసనమున చక్కఁగ వర్ణింపఁబడియున్నది.

హారీతిపుత్రులును, మానవ్యసఋషి గోత్రజులును, వేదాధ్యయన సంపన్నులును, సద్గుణోపేతులును నగు బ్రాహ్మణుల కుటుంబ మొకటి యుండెను. "వివిధ యజ్ఞావభృథ పుణ్యజలములయందు పలుమారు తడిసిన సిగలు గలవారును; ప్రవచనావగాహననిష్ణాతులును; విధిప్రకారము సమిధల నగ్నియందు హోమము చేసినవారును; సోమపానము జేసిన వారును; ప్రణవపూర్వకముగ నాలుగువిధముల వేదమును పఠించు వారి కంఠస్వరములచే మారుమ్రోగు గృహాంతరాళములు గలవారును; చాతుర్మాస్యము, హోమము, ఇష్టి, పశుబంధము, పౌర్ణమాస్యశ్రాద్ధపౌష్టిక క్రియలను జేయువారును; అతిథులచే నిరత మాశ్రయింపఁబడినదియు, సవనత్రయములు సేయని దినము లేనిదియు నగు వసతిగలవారును నగు నీ బ్రాహ్మణుల గృహసమీపప్రదేశమున వికసించిన పుష్పములచే. నిండిన కదంబ పాదప మొక్కటి యుండెను. వారీవృక్షమును పెంచుటచేత వారి కా చెట్టుతోడి 'సామాన్య' 'సాధర్మ్యము'లు గలిగి యచ్చటి వారిచే కదంబులని చెప్పఁబడిరి

ఇట్టి కదంబుల వంశమున శ్రీమంతుఁడును, శ్రుతశీలశౌచాద్యలంకృతుఁడును, మయూరశర్మాభిధుఁడును నగు ద్విజోత్తము డొక్కఁడు పుట్టెను. ఆతఁడు ప్రవచనమును సర్వమును జదువఁగోరి తన యుపాధ్యాయుఁ డగు వీరవర్మతోఁగూడ పల్లవేంద్రునిపురికిపోయి తర్కుకుఁడై ఘటికను బ్రవేశించెను. అచ్చట పల్లవాశ్వసంస్థయందు గలిగిన తీవ్రమగు కలహముచే రోషితుఁడై, 'అక్కటా! ఈ కలియుగమందు క్షత్రియుల కంటె బ్రాహ్మణు లెంతసత్వహీనులై యున్నారు! గురుకులమును

చక్కఁగ నారాధించుచు, స్వశాఖను బ్రయత్నముతో బఠించినవానికి నైతము బ్రహ్మసిద్ధి యనుట నృపాధీనమైన సంతకు మించిన దుఃఖ మేమి కలదు?' అని చింతించి, భూమిని జయింపఁగోరి, కుశసమిద్ద్బృషస్పృగాజ్య చరుగ్రహణమునకు దగిన హస్తమునఁ జేత నుండుచున్న ఖడ్గము నొరనుండి పెరికెను. పల్లవేంద్రుని యంతఃపాలురను సత్వరముగ నోడించి శ్రీపర్వత ద్వారమువఱకు వ్యాపించియుండు నరణ్యదేశమును స్వాధీనపఱచుకొనెను. బృహద్బాణప్రముఖబహురాజమండలముల నడిమి కప్పము గొనుటచే పల్లవేంద్రుని కనుబొమలముడికి గారణభూతుఁడై ముగింపఁబడిన స్వప్రతిజ్ఞావ్రతమును, సులభముగ ప్రాప్తమైన కృతార్థత్వమును సముత్థాపిత యుద్ధయాత్రకోడ భూషణములై చెలఁగ నాతఁడు విరాజిల్లెను. శత్రువులగు కంచి రాజులు బలముతో యుద్ధము సేయుటకు పలుమా రాతనిపైకి రాగా, వారిసేనాసాగరముపై రాత్రులయందు విషమదేశములయందు బయనము సల్పునపుడు గాని, విశ్రమించినప్పుడుగాని, అవస్కంద భూములయందుగాని, డేగవలె మహాతీవ్రముగ దాకి, ప్రహరించుచు, వచ్చిన కష్టములను చేతనున్న కత్తినే తోడుగగొని యోర్చుకొనుచుండెను. పల్లవేంద్రు లాతనిశక్తిప్రతాపములను, వంశమును గనుగొని యట్టివానికి హానిసేయుట శ్రేయము గాదని తలఁచి సత్వరముగా నాతని మిత్రునిగ జేసికొనిరి, అతఁడు నా రాజుల కొలువునందు జేరి, యనేక యుద్ధములయందు స్వపరాక్రమమును బ్రకటించి వారిని సంతోషపఱచి, పల్లవులకరపల్లవములచే సంపూజితమైన పట్టుబంధమును బొందెను. దానితోఁగూడ వల్గితరీతి నృత్యము సేయు వంకరయలలుగల పశ్చిమ సముద్రతీరమునుండి ప్రేహారము వఱకు గలదేశమును బడసెను.''

తాళగుండ శాసనములో వర్ణింపఁబడిన కదంబవంశోత్పత్తిక్రమము విశ్వాసార్హమైనదని యందరు నొప్పుకొన్న విషయమే. అయినను ఆ

శాసనములోని కొన్ని విషయముల నీసందర్భమున జర్చింపవలసి యున్నది.

౧. మయూరశర్మ పర్వతసానుభూములను జేరి, బృహద్బాణాది పల్లవసామంతరాజులకడనుండి కప్పము గైకొనెనని శాసనము చెప్పుచున్నది. ఇందువలన మయూరశర్మకు లోబడి బృహద్బాణాదిరాజు లాతనికి బ్రాపై నిలిచిరనుట తెల్లము. మయూరశర్మచే సముత్థాపనమైన తిరుగుబాటు బలీయమైనదనుట నిస్సంశయము. కావుననే పల్లవేంద్రుం డీతిరుగుబాటు నణంగద్రొక్కుటకు పలుమారులు దండెత్తి రావలసి వచ్చెను. ఇది

"అభియుయుక్షయా గతేషు, భృశం కాంచీనరేంద్రేష్వరాతిషు"

అన్న శాసన వాక్యముచే నిర్ధారితము. అట్లు వచ్చిన సైన్యములను నిర్జించుచు పల్లవరాష్ట్రముపై దండెత్తిపోవుచుండెనని

"విషమదేశ ప్రయాణసంవేశ రజనీష్వవస్కందభూమిషు ప్రాప్య సేనాసాగరం తేషాం ప్రాహాబలీశ్యేనవత్తదా"

యన్న వాక్యములవల్లను,

"బలవద్యాత్రా సముత్థాపనేన చ"

యన్నమాటలవల్లను విదితమగుచున్నది. ఈవిషయముల నన్నిటిని చక్కంగా నాలోచించి చూడ, పల్లవరాజులు మయూరశర్మను లోం బఱచుకొనుటకై యనేక ప్రయత్నములు చాలకాలమువఱకు జేయుచుండిరని తోంచుచున్నది.

౨. ఇట్లు పోరాడుచున్న మయూరశర్మను జయలక్ష్మి నిరంతరము వరించియుండెనని చెప్పుట కవకాశము లేదు. అతండు నిరంతరము శేత

యగుటయే వాస్తవమేని పల్లవులతో సంధికేల ఒడంబడవలయును? ఆసంధిసమయము లెట్టివి? మయూరశర్మ పల్లవులకు లొంగిన, వారీతనికి సేనాధిపత్యము నిచ్చుట కంగీకరించిరి. మయూరుం డందుల కొప్పుకొని పల్లవసేనాధిపత్యము వహించెను. కావున నాతండు పల్లవులచే పరాజితుండై జయముపై నాస విడిచెను. పల్లవరాజుల కట్టివారున కింక నుపద్రవము గలుగంజేసిన దమకు ముప్పువాటిల్లు నను సంశయము గలుగుట చేత నాతనితో సంధి చేసికొనిరి.

3. అనేకులు చరిత్రకారులు తాళగుండశాసనమందలి కదంబోత్పత్తికథనము నాశ్రయించుకొని, మయూరశర్మ పల్లవులను సంపూర్ణముగ జయించి స్వతంత్ర రాజ్యమును స్థాపించినట్లు వ్రాసియున్నారు. కాని యిట్టి వ్రాతల కేయాధారమును గానరాదు. శాసనమున నిట్లున్నది:—

"సంశ్రిత స్తదా మహీపాలా నారాధ్య యుద్ధేషు విక్రమైః
ప్రాప పట్టబంధసంపూజాం కరపల్లవైః పల్లవైః ర్ధృతామ్."

పల్లవులను సంపూర్ణముగ జయించియే యుండినయెడల వారి నాశ్రయించుట యేల? వారికొలువునజేరి యుద్ధమున స్వవిక్రమప్రకటనముచే వారి నారాధించుట యేల? ఇట్లు పల్లవుల నారాధించుటవలనగదా పట్టబంధప్రాప్తియును, నపరార్ణవప్రేమారమధ్యదేశ లాభమును గల్గినది? బంటుచేసిన యూడిగమునకు మెచ్చుకొన్న రాజు బంటును సామంతుని జేయుట సహజముగాని స్వతంత్రునిగ జేసి తనరాజ్యమును పంచియిచ్చుట నెచ్చటను వినియుండలేదు.

మఱియు పైశాసనమున కకుత్స్థవర్మ తాను 'కదంబసేనానీ బృహదాన్వయవ్యోమచంద్రముండ' నని చెప్పుకొనియున్నాడు. కావున, మయూరశర్మయు, నతని తరువాతి కదంబరాజులును పల్లవసేనానులే

కాని స్వతంత్ర రాజులు గారు. ఇందువలననే తరువాతి కాలమున పల్లవ రాజులు కదంబరాజ్య విషయములందు పలుమారు జోక్యము గలిగించు కొనియుండిరి.

కకుత్‌స్థుని పుత్రుడగు ప్రథమకృష్ణవర్మ పల్లవులచే యుద్ధమున పరాజితుడాయెను. ఈతని కుమారుడు విష్ణువర్మ తన హెబ్బటశాసనమున తాను "శాంతివర్మ మహారాజ పల్లవేంద్రాభిషిక్తుడ"నని చెప్పుకొన్నాడు. ఉరువపల్లి శాసనమందు యు. మ. విష్ణుగోపవర్మచే నాజ్ఞాపితుడై కణ్ణుకూరునందు విష్ణుహారదేవకులము నిర్మించిన విష్ణువర్మ సేనాపతి యొకడు పేర్కొనబడియున్నాడు. ఇతడే కదంబకృష్ణవర్మకుమారుడగు విష్ణువర్మయని మోరేయాభిప్రాయము. విష్ణువర్మయొక్క జ్యేష్ఠపుత్రుడు తాను

'తుణ్ణగజ్జతలోత్పాదీ పల్లవ ప్రళయానలః'

అని ప్రగల్భములు పల్కియున్నాడు. ఈతని యనుజుడగు రవి పై విష్ణువర్మను నిర్జించి యాతనికి తోడుపడిన చండదండుడను కాంచీశ్వరుని పరిభవించెను.

ఈవిషయముల నన్నిటిని తరచిచూడగ కదంబులు పల్లవుల నాశ్రయించియుండిన సామంతరాజులే కాని స్వతంత్రులు గారను విషయము స్థిరపడచున్నది.*



*విభవసంవత్సర ఆశ్వయుజమాస భారతినుండి పునర్ముద్రితము.

# పల్లవులు.

## మొదటి కుమారవిష్ణువు.

సముద్రగుప్తుని దండయాత్రవలనను, మయూరశర్మ తిరుగుబాటు వలనను పల్లవసామ్రాజ్యసౌధము మూలబంధమువఱకు గదిలెను. ఇదియే యదననితలఁచి చోళులు స్వతంత్రులగుటయే కాక, పల్లవరాజధాని యగు కాంచీపురము నాక్రమించుకొనిరి. మొదటి కుమారవిష్ణువు యొక్క రాజ్యాభిషేకకాలమున కాంచీపురము శత్రుహస్తగతమై యుండెను. కావున కాంచీపురిని స్వాధీనపఱచుకొనుటకై యాతఁడు ప్రథమమున ప్రయత్నము సేయవలసియుండెను. వెలూర్పాళెపు శాసన మీతఁడు సమరములయందు జిష్ణుఁడనియుఁ, కాంచీపురమును శత్రులకడ నుండి యొడిచికొనెననియుఁ జెప్పుచున్నది. ఓంగోడు ౧. శాసనమున నీతఁ డశ్వమేధయాజియని చెప్పఁబడియున్నది. ఈతనిగుఱించి యింతకుమించిన విశేష మేమియు మనకు దెలియదు.

ఇతనికుమారుఁడు బుద్ధవర్మ. ఇతఁడు 'చోళసైన్యార్ణవ బాడబాగ్ని'యని వేలూర్పాళెపు శాసనమునం దున్నది. చెందలూరుశాసనమునం దీతఁడు 'భగవద్భక్తి సంభావిత సర్వకల్యాణ స్యాదిరాజప్రతిస్పర్ధిగుణసముదయ స్వామితాత్మ' డని యున్నదిగాని విశేష మేమియు లేదు.

బుద్ధవర్మకుమారుఁడు రెండవ కుమారవిష్ణువు. ఇతఁడు తన ద్వితీయరాజ్యవర్షమున చెందలూరుశాసనమును వేయించినాఁడు. స్వపరాక్రమముచేత అన్యనృపశ్రీనిలయముల నపహరించితిననియు అనేకాశ్వ

మేధములను జేసితిననియును జెప్పుకొనియున్నాఁడు. ఇతని కాలమున పల్లవరాజ్యము తొండమండలమునుండి కృష్ణానదివఱకును వ్యాపించి యుండెను. పశ్చిమమున పల్లవులయధికార మెంతవఱకు చెల్లుచుండెనో చెప్పుటకు వీలులేదు.

## మొదటి సింహవర్మ (435-460)

రెండవ కుమారవిష్ణునకు సంతానముండినట్లు కానరాదు. అతని పిమ్మట మొదటిసింహవర్మ కంచిపల్లవసింహాసనమును నధిష్ఠించెను. ఇతఁడు మొదటికుమారవిష్ణుని ద్వితీయ పుత్త్రుఁడగు స్కందవర్మయొక్క మనుమఁడు. ఇతని రాజ్యకాలమున పల్లవసామ్రాజ్య మత్యుచ్చస్థితికి వచ్చినది. సామ్రాజ్యపాలనమునందేమి రణరంగమునవేమి ఇతనితమ్ముఁడు యువమహారాజు విష్ణుగోపవర్మ యితనికి సాయ మొనర్చుచుండెను. రాజధాని కాంచీపురము నెలవు చేసికొని దక్షిణరాజ్యభాగము నంతటిని మహారాజును పలకడ మేన్మతురాదిస్థానములనుండి కృష్ణానదిపర్యంతము వ్యాప్తమైన తీరభూమిని యువమహారాజును పాలించుచుండిరి. పశ్చిమమున కర్ణాటదేశమున గంగకదంబాది రాజవంశములవారు పల్లవుల కరిగాపులై యుండిరి.

సింహవర్మ శూరుఁడును పరాక్రమశాలియు నైనరాజు. ఇతని కాలమున పల్లవులకు కదంబులతో గొప్పపోరాటము సంభవించెను. రెండవ కుమారవిష్ణువు మరణానంతరము, పల్లవుల యధికారము కొంతవఱకు క్షీణించిన ట్లున్నది. కదంబరాజ్యము కకుస్థవర్మ యనంతరము రెండుపాయలుగ జీలెను. కకుస్థవర్మయొక్క ప్రథమపుత్త్రుఁడగు శాంతివర్మయు నాతని సంతతివారును వైజయంతీపురము రాజధానిగ దక్షిణభాగమునను, రెండవకొడుకగు మొదటికృష్ణవర్మయు నాతనిసంతతివారును పలాశికా, త్రిపర్వతములు రాజధానులుగ నుత్తర

భాగమునను రాజ్యముసేయుచుండిరి. క్రీ॥ శ॥ 2-వ శతాబ్దారంభమున దక్షిణ కర్ణాట కొంగుదేశములయందు క్రొత్తరాజ్య మొకటిప్రబలెను. ఈరాజ్యము నేలు రాజవంశమునకు పేరు గంగవంశమగుటచే రాజ్యమునకు గంగరాజ్యమని పేరుగల్గెను. గంగరాజ్యమును, కదంబరాజ్యమువలె మొదటి మాధవవర్మ యనంతరము రెండు శాఖలుగ జీలెనని దుబ్రా యిలు వ్రాయుచున్నాఁడు. మాధవవర్మ పెద్దకొడుకగు నార్యవర్మయు నాతని సంతతివారును పరువీపురమున రాజ్యముజేయుచుండిరి. అందుచే వారికి పరువిగంగులని పేరు గల్గెను. రెండవ కొడుకగు హరివర్మయు నాతని వంశమువారును తాళవనపురమున రాజ్యము సేయుటచే వారికి తాళవనపురగంగు లనిపేరువచ్చెను. ఇరుతెగల గంగులును పల్లవులకు సామంతులనుటకు నిదర్శనములు గలవు. పెనుగొండ శాసనమందు పరువిగంగరాజు ఆర్యవర్మ పల్లవేంద్రుఁడగు సింహవర్మచేతను ఆర్యవర్మ కుమారుఁడగు మాధవుఁడు సింహవర్మకొడుకగు స్కందవర్మచేతను నభి షిక్తులైనట్లును మాధవునకు సింహవర్మయును సామాంతరముున్నట్లును జెప్పఁబడియున్నది. ఇందుచే పరువిగంగరాజులు పల్లవుల సామంతులనుట తెల్లము.

మొదటి మాధవవర్మయొక్క రెండవకుమారుఁడగు హరివర్మ తాళవనపుర గంగవంశమునకు మూలపురుషుఁడు. ఈతఁడు పరువివంశ స్థాపకుఁడగు ఆర్యవర్మకు తమ్ముఁడు. అందుచే సమకాలికుఁడుగూడ. ఈ హరివర్మ పుత్రునిపేరు విష్ణుగోపుఁడు. దక్షిణదేశచరిత్రము జదివినవారి కందఱకు విష్ణుగోపనామము పల్లవవంశమునదప్ప మఱియెచ్చటను గాన రాదనుట తెలిసినవిషయమే. తాళవనపురవంశపురాజున కొక్కనికి మాత్ర మీపేరుగల్గుటకు గారణమేదైన నుండవలయును. పరువి ఆర్య వర్మసమకాలి తాళవనపుర హరివర్మయు దన యేలికయగు పల్లవసింహ

వర్మ యనువాఁడగు యువమహారాజ విష్ణుగోపుని పేరును దన కొడుకు నకు బెట్టియుండవలయును. గంగవంశమున విష్ణుగోపనామ ముండుట కింతకంటె వేఱుకారణము గాన్పింపదు. కావున పరువిగంగులవలె కాళ వనపురగంగులుగూడ పల్లవసామంతులే.

కకుస్థవర్మ యనంతరము కదంబులు స్వాతంత్ర్యులగుటకు బ్రయత్నిం చిరి. ఏతత్కారణముచే బల్లవులకును గదంబులకును సమరము వాసఁ గెను. ఈసమరమున గంగరాజులు బల్లవులకు బాసటలై నిల్చి కదంబు లను చిదుగగొట్టిరి. ఈ యుద్ధము పాలాశి కదంబరాజగు మొదటి కృష్ణ వర్మ కాలమున నడిచెను. కృష్ణవర్మ సైన్యము 'ఆత్రేయగోత్రజాఁడును, సోమవంశసంభూతుఁడును, ఇక్ష్వాకులతో వివాహసంబంధములు గల కేకయవంశజాఁడు"ను నగు శివనన్దవర్మ యను నాతని యాధిపత్యము క్రింద పల్లవవాహిని కెదురు నడిచెను. సంకులసమరము సంప్రాప్తమై కృష్ణవర్మ సైన్యము హతము గావింపఁబడెను. స్వదేశక్షయముగుటను గాంచి విదారితహృదయుఁడై సేనాపతి శివనందవర్మ దర్భశయ్యపై బ్రాయోపవిష్టుఁడై నశ్వరమగు దేహమును దృజించి యింద్రలోకము నకుఁ జనెను. ధీరులు మానహాని నోర్చుకొనజాలరుగదా!

ఇట్లు కదంబసైన్యమును నాశముగావించినది. 'నణకాసపల్లవ రాజ'ని యొక శాసనమున నున్నది. ఈతఁడెవ్వఁడో పల్లవ వంశవృక్షమున లేని పురుషుఁడు. పల్లవదండనాథుఁడేమో! ఈ యుద్ధము సింహవర్మ రాజ్యకాలమున జరిగియుండవలయును. ఏలన సింహవర్మ క్రీ. శ. 435 మొదలు 460 వఱకు రాజ్యముచేసెను. కృష్ణవర్మయు నప్పటివాఁడే. మఱియు గృష్ణవర్మ మనుమఁడు సింహవర్మ యొకఁడున్నాఁడు. ఈతని కీ పేరు పల్లవసంపర్కమువలన గలిగినదనుటకు సందేహము లేదు.

సింహావర్మ కదంబులను చిదుగగొట్టి కర్ణాటకమున పల్లవుల యధికారమును నిరంకుశముగ సాగించెను. ఈతని రాజ్యకాలము క్రీ. శ. 460 సంవత్సరమున నంతమొందెను.

రెండవ స్కందవర్మ (460—475)

ఈతని పరిపాలననుగూర్చి మనకు తెలిసినవిషయ మొక్కటియే. పరువి గంగరాజగు మాధవవర్మ కీతఁడు రాజ్యాభిషేకము చేసెను. పాలాశికదంబుల గర్వమడఁచి సింహావర్మ పల్లవుల యధికారమును కర్ణాటమున సాగించెనని చెప్పియుంటిమికదా. పల్లవకదంబ కలహామంతటితో సమాప్తముగాలేదు. వైజయంతి కదంబులును దమకు లోఁబఱచుకొనవలయునని ప్రయత్నములు చేయఁదొడగిరి. కృష్ణవర్మపుత్రుఁడగు విష్ణువర్మ తన్ను 'శాంతివర్మ పల్లవరాజా'భిషేకించినట్లు చెప్పుకొనియున్నాఁడు. శాంతివర్మ యను పల్లవరా జెవ్వఁడును గాన్పింపఁడు. రెండవస్కంద వర్మ కదియొక పేరేమో. శాంతివర్మ యెవ్వరైనను పాలాశికదంబులు పల్లవ భృత్యులైరనుటకు సందేహము లేదు మఱియు విష్ణువర్మ పల్లవుల నాశ్రయించి తన దాయాదులకడనుండి వైజయంతి రాజ్యమునుగూడ నపహరించుటకై ప్రయత్నములు సేయుచున్నట్లు శాసనములు సాక్ష్యములు చెప్పుచున్నవి.

పై కారణములచే రెండవ స్కందవర్మ వైజయంతిపురాధీశ్వరుఁడగు మృగేశ్వరునిపై యుద్ధయాత్ర సల్పెను. ఈయుద్ధయాత్ర నడచిన విధమిట్లని చెప్పుటకు మనకేయాధారములు లేకపోయినను, పర్యవసాన మిట్టిదని చక్కగ నెఱుఁగుదుము. పల్లవులతోగూడ పరువిగంగులు కదంబులపై నడిచిరి. యుద్ధమందు మృగేశ్వరునికే జయము గల్గిన ట్లాతని శాసనములు వల్కుచున్నవి.

"తుఙ్గగఙ్గకులోత్సాదీ పల్లవప్రలయానలః."

"తుఙ్గగఙ్గ" యన పదము గంగులని నాభావము. ఇట్లు పల్లవగంగ సైన్యములు పరాజయమునుబొంది వెనుకకు మరలెను. మృగేశ్వరుడును అతని తమ్ముడగు మాంధాతృడును పల్లవులచే బాధలేక సుఖముగ రాజ్యము జేసిరి.

స్కందవర్మనుగూర్చి మనకింతకంటె నేమియు విశేషములు తెలియవు.

మొదటి నందివర్మ (485—510)

నందివర్మ "అనేక సమరసాహసావమర్దలబ్ధ విజయయశుడని యుదయేందిర శాసనము జెప్పుచున్నది. 'ఈశ్వరుని యనుగ్రహమువల్ల దృష్టివిషుడను ఫణీంద్రు సాధించెన'ని వేలూర్పాళెపు శాసనమున నున్నది. ఇందువల్ల నందివర్మ శూరుడును, శివభక్తుడును, నాగరాజుపై జయము నందినవాడును అని తెలియుచున్నది.

కదంబరాజగు రవివర్మ శాసనములయందు చండదండుడను కంచి రాజొకడు గాన్పించుచున్నాడు. చండదండుడనుమాట బిరుదేగాని పేరుగాదనియు, చండదండ బిరుదాంకితుడు కంచిరాజగు మొదటి నందివర్మ యనియు కె. వి. శంకరయ్యరుగారు జెప్పుచున్నారు. ఇది నిజ మేని నందివర్మ కాలమున పల్లవులు వైజయంతి కదంబులను లోబఱుచు కొనుటకు మరల బ్రయత్నము జేసిరని తలపవలసియున్నది.

మాంధాతృవర్మ మరణానంతరము వైజయంతి రాజ్యమున కతని పుత్రుడగు రవివర్మ యధిపతియాయెను. రవి పసివాడగుటచే నాతని దాయాదియు, పల్లవరాజాశ్రితుడు నగు విష్ణువర్మ వైజయంతిని హరింప గోరెను. కంచిరాజగు చండదండుని బ్రాపువడసి విష్ణువర్మ యాతనిపై

గయ్యమునేయదొడఁగెను. ఈయుద్ధమున రవివర్మకే జయము గలిగెను. యుద్ధమున విష్ణువర్మ మడిసెను. చండదండుఁడు వెకలింపఁబడెను.

"శ్రీవిష్ణువర్మప్రభృతీన్నరేంద్రాన్ నిహత్యజిత్వాపృథివీం సమస్తాం
ఉత్సాద్యకాంచీశ్వరచండదండం పాలాశికాయాం సమవస్థితస్సః.

కర్ణాటకమున దమ యధికారమును నేయుటకై పల్లవులు జేసిన కడపటి ప్రయత్న మిదియే. ఇంతటితో కర్ణాటకమున వారి ప్రభుత్వ మంతరించెను. చండదండుఁడను బిరుదుగల నందివర్మ ప్రాచీన పల్లవరాజులలో గడపటివాఁడు. అతని తరువాత పల్లవ రాజ్యము నశించెను.

ఈనందివర్మయే మన వాఙ్మయమునను శాసనములందును బ్రఖ్యాతివడసిన త్రిలోచనపల్లవరాజని కె. వి. శంకరయ్యరుగారు చెప్పుచున్నారు. నందివర్మయే త్రిలోచనపల్లవుఁడని చెప్పుట కేయాధారమును లేదు. అయినను త్రిలోచన పల్లవుఁడను ప్రఖ్యాతుఁడగు కంచిరాజు క్రీ. శ. ౬ వ శతాబ్దారంభమున నుండెనని కొన్ని నిదర్శనములు గలవు. ప్రాచీన పల్లవుల శాసనములనుబట్టి చూడ మొదటి నందివర్మ యీకాలమున కంచియందు రాజ్యము నేయుచుండెను కావున నందివర్మయే త్రిలోచన పల్లవుఁడను నూహ పొడమెను.

## త్రిలోచనపల్లవుఁడు.

ఈతఁడెవఁడు? ఈతని చరిత్ర యెట్టిది? అను ప్రశ్నలకు సమాధానము చెప్పవలసియున్నది. ఈతని చరిత్ర కాధారములు (౧) శాసనములు, (౨) వాఙ్మయము. త్రిలోచనపల్లవునిగూర్చి వచించు శాసనములుగాని గ్రంథములుగాని క్రీ శ. ౧౦ వ శతాబ్దమునకు తరువాతివే.

క్రీ. శ. ౧౦ వ శతాబ్దమునాటి శాసనమున నొకదానియందు పూర్వము తూర్పు మైసూరుదేశముపై రాజ్యము నేయుచుండిన నోలంబ పల్లవులు దాము త్రినయన పల్లవునివంశమువారమని వచించియున్నారు.

"శ్రీమాన్ ఈశ్వరవంశజః త్రిణయనః కాంచీపతిః పల్లవః" ఇత్యాది. తూర్పు చాళుక్యరాజగు విమలాదిత్యుఁడు తనరణ_స్తిపూండి శాసనమున (1011) త్రిలోచన పల్లవుని చళుక్యవంశస్థాపకుఁడగు విజయాదిత్యునికి సమకాలికునిగ జేసియున్నాఁడు.

"విజయాదిత్యో నామరాజా విజిగీషయా దక్షిణాపథంగత్వా
త్రిలోచనపల్లవమధిక్షిప్య దైవదురీహయా లోకాన్తరమగమత్."

క్రీ. శ. ౧౨, ౧3 శతాబ్దములనాటివి నెల్లూరుజిల్లాలోని యాంధ్రచోడుల శాసనము లీతఁడు కరికాల చోడరాజునకు సమకాలికుడని వచించుచున్నవి. ఇవియన్నియు.

"స్వస్తి చరణసరోరుహ విహత(విహి)విలోచన త్రిలోచన ప్రముఖాఖిల పృథివీశ్వర కారిత కావేరీతీర కరికాలకులరత్నప్రదీప" యని యారంభమగుచున్నవి.

ఇవిగాక మెకంజీ కలెక్షనులో సంకలితమైన దుర్జయరాజుల శాసనమునందు త్రిలోచన పల్లవునిగూర్చిన సమాచారము గొంతకలదు.

తతఃతో(తా)భూసుర కన్యకాయాం జాతస్త్రినేత్రాదణి మాదిసిద్ధః,
బభూవ కాంచీనగరే నరేంద్రః త్రిలోచనః పల్లవనామధేయః.
రుద్రాప్తవీర్యా సరిదిగ్జయాత్రా
సంప్రార్థ్యరుద్రాంగ భవస్సవాయార్,
సమర్జయా(క) స్త్రీ(క) స్వపురం నినాయ
భక్తేంధ్రదేశేషు చమండలేశాన్.
నిర్జిత్యతేషా మథదుర్జయానాం బాహోర్బలేనైవ దిశాస్సమస్తాః,
కాంచీపురేశ స్సభువం శశాస వారాశికల్లోల విశాలకాంచీం.
తే పుత్రకృష్ణం విరజాధినాథం సబద్ధవర్మాణ మనంతవీర్యం,
మేనేనజాదీన గజాశ్వజిత్ప స్వసాత్కృతాయేన గజాంతలక్ష్మీః.

... ... ... ...

కులేస్మిఞ్జాతేష్వథ బుద్ధవర్మా చాళుక్యవంశాధిప రాజ్యలక్ష్మీం.

పైశ్లోకములయందు తప్పు లనేకములున్నను వానిలోని యర్థము విశదముగ దెలియవచ్చుచున్నది. పూర్వము విరజామండలమును ముప్పురు దుర్జయులు స్వభుజబలముచే జయించి రాజ్యముసేయుచుండిరి. అప్పుడు భూమియందు భాసుకకన్యయందు బుట్టినవాఁడును, త్రినేత్రకడ నణిమాదిసిద్ధిని బొందినవాఁడును నగు త్రిలోచనపల్లవుఁ డను రాజు కాంచీనగరమున నుండెను. అతఁడు దిగ్జయమునుసేయు బయలువెడలి యాముగ్గురు దుర్జయులను ఆంధ్రదేశపు టుంకిశేశ్వరులతోఁగూడ తనపట్టణమునకుఁ గొనిపోయెను. తరువాత ఆదుర్జయులను జయించినట్లే సమస్తదిశలను బాహుబలముచే జయించి, సముద్రపు టంచులతో యొద్దాణముగ గల విశాలమగుభూమిని ఆ కాంచీపురేశ్వరుఁడు యేలెను. ఆ దుర్జయులకు పుత్రుడగు కృష్ణుడు విరజాధినాథుఁ డాయెను. ఆతనివంశస్థు లనేకులు రాజ్యక్రమమున స్వర్గమునకుఁ బోఁగా బుద్ధవర్మ పుట్టెను.

కొండపడమటి రెండవబుద్ధరాజు వంశవోలుశాసనమున పైబుద్ధరాజు కుబ్జవిష్ణుని సామంతుఁడని చెప్పియున్నది.

దేవ శ్చైతయయాభివంశతిలకః శ్రీకుబ్జవిష్ణుర్నృపః,
యస్యారాతి నరేంద్రమార్త్యవిలస ద్ధూమ స్తనీలాంబోద్గత,
క్షోభోత్సంగ కుపంగశైలశిఖరా శ్యాప్తశ్చ స్త్రీలోభాంద ధా,

... ... ... ...

ఆసీత్పృథు ర్ధాభిజనాంతరే కః శ్రీబుద్ధవర్మా కృతపుణ్యకర్మా,
సంగ్రామరంగే నిజనాథవర్మా సంపాదితాశేష కవీంద్రశర్మా.
భృత్యైకృత్య వినయేనరంజయ న్నాంజనేయ ఇవ రావణచ్ఛిదం,
వైనతేయ ఇవ చక్రిణం చ తం సార్వభౌమతిలకం ససేవతే.

కావున మొదటిబుద్ధవర్మ కుబ్జవిష్ణువర్ధనునికి ముందటివాఁడు. కుబ్జవిష్ణువు వెంగిదేశమును క్రీ. శ. ౬౨౮ లో జయించెను. త్రిలోచనపల్లవుఁడు కుబ్జవిష్ణువునకు ముందటివాఁడు.

పై శాసనములవల్ల త్రినేత్రపల్లవునిచరిత్ర మిట్లు తెలియుచున్నది: ఇతఁడు భూసురకన్యకయొక్క పుత్రుఁడు, పల్లవుఁడు, కంచిరాజు. దిగ్జయము గావించి కృష్ణపర్యంతమున్న భూమిని గెల్చి దుర్జయాది యాంధ్రరాజుల నోడించి వారిని తనకు సామంతులుగ జేసికొని సముద్రమువఱకుగల భూమిని కాంచీపురము రాజధానిగఁ బరిపాలించెను. చళుక్యవంశస్థాపకుఁడగు విజయాదిత్యుఁడు దక్షిణదేశముపై దండెత్తిరాగా, నాతని నెదుర్కొని సమరమున సంహరించెను. అటుపిమ్మట చోళరాజగు కరికాలునితో నీతనికి పోరాటము గల్గెను. ఈపోరాటమున త్రిలోచనపల్లవుఁడు కరికాలునిచే నిర్జితుఁడై యాతనికి సామంతుఁ డాయెను.

ఈశాసనముల సాక్ష్యమువల్ల దెలియు ముఖ్యాంశ మొకటి గమనింపఁదగియున్నది. చోళరాజగు కరికాలుఁడును, చాళుక్యవంశమునకు మూలపురుషుఁడగు విజయాదిత్యుఁడును, త్రిలోచనపల్లవుఁడును సమకాలికులు. దీనినిబట్టి త్రిలోచనునికాల మొకవిధముగ గనుగొనవచ్చును.

విజయాదిత్యుఁడు చాళుక్యవంశమునకు మూలపురుషుఁడని యంటిమిగదా. ఈతని కైదవతరమువాఁడగు రెండవపులకేశి క్రీ. శ. 610 వత్సరమున సింహాసనము నధిష్ఠించెను. పురుషాంతరమునకు 25 సంవత్సరములచొప్పున లెక్కవేసిచూచిన విజయాదిత్యునికి పులకేశికిని 125 సంవత్సరము లెడముండినట్లు తెలియును. అనఁగా విజయాదిత్యుఁడు క్రీ. శ. 485 ప్రాంతమున జీవించియుండెను. అతని సమకాలికులగు కరికాల, త్రిలోచనులును నాకాలమువారై యుండవలయును.

ఇఁక వాఙ్మయ మీాతనిగుఱించి యేమిచెప్పునో చూతము. ఈ సందర్భమున వాఙ్మయమును రెండ తరగతులుగ విభజింపవలయును. ౧. ద్రావిడము. ౨. ఆంధ్రము.

౧. ద్రావిడ వాఙ్మయమున నీకథకుసంబంధించిన విషయమును మన్మిత్రులు టి. జి. అరవాముదయయ్యంగారలు దమ "కావేరి-మహాఖరు"లను గ్రంథమునఁ గ్రోడీకరించి చెప్పియున్నారు. దానిప్రకారము "కావేరినిగట్టుటకు జనకు దోడ్పడుటకు కరికాలుఁడు ముకరి ప్రముఖాఖిలసామంతరాజులను బిలువనంపించెను. సామాన్యులగు పనివాండ్రవలె సామంతరాజులుగూడ మట్టితట్టలను మోయవలయునన్న రాజాజ్ఞయును బంపఁబడెను. ఇతర సామంతరాజులు వచ్చినను ముకరిరాలేదు. కరికాలున కాసంగతి తెలిసెను. అతఁ డెటువంటివాఁడో కనుఁగొనుటకై తనముం దాతని ప్రతిమను వ్రాయించిచూచి, ముకరిస్వభావముచేత గర్వితుఁడని యెఱిఁగి యాతఁడు కావలయుననియే రాకపోయెననితలఁచి, కరికాలుఁ డాతనికన్నుల మీాఁద బెరుక నాజ్ఞయొసంగెను. తత్క్షణమే ఆ యాజ్ఞ నెరవేర్పఁబడెను."

తమిళ వాఙ్మయములోని ముకరియే ముక్కంటి లేక త్రిలోచన పల్లవుఁడని నిర్ధారణచేయుచు క్రైస్తవకళాశాల త్రైమాసికపత్రికయందు రెండువ్యాసములు వ్రాసియున్నాము. ఆవిషయమునుగూర్చి యిచ్చట మరల చర్చించుట యనవసరము.

౨. ఆంధ్రవాఙ్మయములో త్రిలోచనపల్లవుని విషయమై ముఖ్యముగ మూఁడుగ్రంథములయందు జెప్పఁబడినది. ఇవి పాల్కురికి సోమనారాధ్యుని పండితారాధ్యచరిత్ర, లింగన నవచోళచరిత్ర, తిక్కన సోమయాజిగారి నిర్వచనోత్తరరామాయణము. మొదటి రెండును

ముక్కంటికాడువెట్టి, ముక్కంటి చోడనామముగలవారి విషయమై పైఁజెప్పఁబడిన తమిళవాఙ్మయమందలి కథ జెప్పఁబడియున్నది. ముక్కంటి కాడువెట్టియే త్రిలోచనపల్లవుఁడని యందరు నొప్పుకొన్నవిషయమే. ముక్కంటిచోడుఁడనునది ముక్కంటిపల్లవునకు బదులు గ్రంథకర్త ప్రమాదవశమున వ్రాసియుండవచ్చు నని యూహించుచున్నాను. తిక్కనగారుమాత్రము త్రిలోచనపల్లవుఁడే కరికాలునివైరి యని చెప్పి యున్నారు. కరికాలుని గొప్పతనమును వర్ణించుచు,—

"హరించెఁ బల్లవోర్వీశు నుల్లాసం బొందగ ఫాలలోచనము"

అని చెప్పియున్నాఁడు.

వాఙ్మయము త్రిలోచన కరికాలురు సమకాలికులని యొత్తి చెప్పుచున్నది. శాసనములుగూడ నీవిషయమునే జెప్పుచుండుటను మన మిదివఱకే చూచియున్నారముగదా. కావున నీవిషయమును విశ్వసింపక పోవుటకు గారణ మగపడ లేదు.

త్రిలోచనపల్లవుఁడు క్రీ.శ. 1050 సంవత్సరప్రాంతమున నుండెనని యు-నిదివఱకు చెప్పియున్నారము. శ్రీ గ్రంథమునందు నిర్ణయింపఁబడిన పల్లవరాజ కాలనిర్ణయపట్టిక ప్రకారము ఆ పట్టిక క్రీ. శ. 850తో రాజ్యారంభమగుచువచ్చె ను. ఇందుపల్లనే టి. జి. అరవముదయ్యంగారు నందివర్మయుఁ త్రిలోచనపల్లవుఁ డును నొక్కరేయనిచెప్పిరి. ఒకవేళ చోళకదంబుల మైత్రియే త్రిలోచ నుని పతనమునకు హేతువైయుండు నేమోయని సంశయించిరి. ఈపై చర్చయొక్క నిజమెట్లున్నను క్రీ. శ. 11-వ శతాబ్దారంభమున చోళులు విజృంభించి పల్లవరాజ్యము నాక్రమించుకొనుటయేగాక దక్షిణాంధ్ర దేశమున చోళవంశముల స్థాపించిరి. ఈవంశజులనే యాంధ్ర చోళరాజు లని చరిత్రకారులు పేర్కొనుచున్నారు.

ప్రాచీన పల్లవుల శాసనములవల్ల యాకాలపు మతస్థితులు గొంత వఱకు తెలియుచున్నవి. వైదికమతము విశేషముగ గౌరవింపబడుచుండెను. పల్లవరాజులు తాము భారద్వాజస గోత్రజులగు బ్రాహ్మణులమని చెప్పుకొనుటయే గాక అగ్నిష్టోమ, వాజపే యాశ్వమేధాది యాగములను జేసితిమనుచున్నారు. వేదాధ్యయన తత్పరులును, వైదికకర్మ నిరతులును నగు బ్రాహ్మణులు సత్కరింపఁబడుచుండిరి. పల్లవరాజులు వైదిక విద్యల నభివృద్ధిజేయుచుండిరి. శివస్కందవర్మ సత్యసేనుఁడను రాజు కడనుండి బ్రాహ్మణుల ఘటికను గెల్చెనని వేలూర్పాళెపు శాసనము చెప్పుచున్నది. కాంచీపురమునందొక గొప్ప విద్యాపీఠముండెను విద్యాభ్యాసముకొఱకై దూరదేశములనుండి విద్యార్థు లచ్చటికి వచ్చుచుండిరి. కర్ణాటక దేశమునుండి మయూరశర్మ తన గురువగు వీరశర్మతోగూడి ప్రవచనమును నిఖిలమును బఠించుటకై కాంచీనగరమునకు వచ్చెను. "గురుకులమును చక్కఁగా నారాధించుచు, స్వశాఖను బ్రయత్నముతో బఠించువారికి సైతము బ్రహ్మసిద్ధి కలుగుట నృపాధీనమైన సంతకు మించిన దుఃఖ మేమికలదు" అను మయూరశర్మ వాక్యములను చక్కఁగ దఱిచి చూచితిమేని యతనికి విద్యాసంబంధమైన వివాదమేదో కలిగినట్లు తోచుచున్నది అశ్వికులతోడనే కలహించుట వాస్తవమేని "బ్రహ్మసిద్ధి కలుగుట నృపాధీనమైన" యన్న మాటల కర్థమేమి? అశ్వికులతోడి వివాదమునకును, బ్రహ్మసిద్ధికిని, రాజానకును సంబంధమేమి? నాకు చూడ ఘటికతోడ రాజునకు చక్కని సంబంధమున్నట్లు తోచుచున్నది. విద్యార్థులను బరీక్షించి వారిని సత్కరించుట రాజున కాచారమని తోచెడిని. అట్టి పరీక్షార్థమై కూర్పఁబడిన సభయందు, మయూరశర్మకు రాజుచే నవమానము గలుగ రోషితుఁడై యాతని నెదిరించెను. ఈవిషయ మింకను చక్కఁగ విమర్శింపఁదగినది.

జైన బౌద్ధమతములపొడ శాసనములయం దెచ్చటను గాన్పింపక పోయినను, దక్షిణదేశము నవి నశించెనని చెప్పరాదు. కుంతలరాజులగు మృగేశ, మాంధాతృ, రవివర్మలు జైనమతస్థులు. వారి శాసనములం దనేకములు జినదేవాలయముల కిచ్చిన దానశాసనములు గంగరాజులగు కొంగాణివర్మయు మొదటి మాధవుడును జైనులు. తరువాతి రాజులు కొందఱు జైనధర్మమును త్యజించి, వైదికధర్మము నవలంబించిరి. ఇది పల్లవ సంపర్కమువల్ల గలిగిన మార్పై యుండవచ్చును.

ఇవిగాక పౌరాణిక హిందూమతమునకు ముఖ్యదైవములగు శివ విష్ణువులు జక్కగ నారాధింపబడుచుండిరి. పల్లవరాజులం దనేకులు వైష్ణవు లనుటకు నిదర్శనములు గలవు. శివస్కందవర్మయొక్క కోడలగు చారుదేవి దాలూరులోని ధూళిమహాభటారక నారాయణదేవునకు గొంతభూమిని దానముచేసెను. రెండవ కుమారవిష్ణువు తాను 'భగవత్పాదానుధ్యాతుడ'ననియు 'పరమభాగవతుడ'ననియు జెప్పుకొని యున్నాడు. మొదటి సింగోడు శాసనదాతయగు స్కందవర్మయొక్క సంతతివారి శాసనములన్నియు 'జితంభగవతా' యను వాక్యముతో నారంభమగుచున్నవి ఉదయేందిరశాసనదాతయగు మొదటి నందివర్మ తాను భగవత్పాదానుధ్యాతుడననియు పరమభాగవతుడ ననియు చెప్పుకొని యున్నాడు. ఇక్ష్వా. యు. మ. విష్ణుగోపుడును నాతని కొడుకగుసింహవర్మయు,మనుమడగు విష్ణుగోపుడును భగవత్పాదానుధ్యాతులనియు పరమ భాగవతులనియును వర్ణింపబడియున్నారు. యు. మ. విష్ణుగోపుడు 'విష్ణుహార దేవకులమునకు' భూమిని దానము జేసినట్లు చెప్పబడియున్నది.

శైవమును ప్రాముఖ్యతకు వచ్చుచుండెను. దక్షిణదేశమున వైష్ణవమతముకంటె శైవమతమె పురాతనమైనదిగ గన్పించుచున్నది. కదంబ

కకుస్థవర్మ శివభక్తుఁడు. స్థానకుందూరునందలి శివాలయమున కాతఁడొక తటాకమును త్రవ్వించి శాసనము వేయించెను. ఈ శాసనమువల్ల దేవాలయము కడు పురాతనమైనదని తెలియుచున్నది: "సాతకర్ణ్యాదిభిశ్శ్రద్ధయాభ్యర్చితే" యన్న వాక్యమువల్ల నీదేవాలయ మాంధ్రరాజుల కాలమునుండి యున్నదని తెలియవచ్చుచున్నది. శైవము పురాతనమతమని యిందువల్ల బోధపడగలదు. మొదటి కృష్ణవర్మ సేనానియగు శివనందవర్మ తాను పరమమాహేశ్వరుఁడనని చెప్పుకొనియున్నాఁడు. మాహేశ్వరులను పేరు పాశుపతశైవులకు తఱచుగా గలదు. పాశుపతము గడుపురాతన మతము. అందుచే ప్రాచీనపల్లవుల కాలమున పాశుపతముగూడ నుండెనని తెలియుచున్నది పల్లవరాజులలో మొదటి నందివర్మ శైవపక్షపాతియని దోఁచుచున్నది. "అనుగ్రహాద్యేన పినాకపాణేః ప్రవర్తితో దృష్టివిషః ఫణీంద్రః" యను వేలూర్పాళెపు శాసనమే ఈ యూహకాధారము. నందివర్మయే త్రిలోచనపల్లవుఁడైన యాతఁడు పరమశివుని భక్తుఁడని వేఱుగ జెప్పఁబలయునా,

జనసామాన్యముయొక్క మతాచారములను గుఱించి శాసనముల యం దేమియును గానరాదు. రాజశాసనములు సామాన్యజనుల విషయముం దలఁపవు. జనసామాన్యముయొక్క మత మింకను బౌద్ధమతమై యుండవచ్చును. అయిన నట్లనుటకు శాసనములం దాధార మేమియును లేదు.

ప్రాచీనపల్లవుల యశమును పరిశోధకులగు పండితులుకూడ నింకను చక్కగ గుర్తింపలేదు. సింహవిష్ణుని వంశమే ప్రాచీనపల్లవవంశముకంటె బలీయమైనదనియు గొప్పదనియు పండితులయభిప్రాయము. కొన్ని యంశములను బట్టిచూడ సింహవిష్ణుని వంశజులు గొప్పవారని యొప్పు

కొనవలసినదే. పరిపాలిత రాజ్యవిస్తీర్ణము గొప్పతనమును సూచించు నేని ప్రాచీనపల్లవులు సింహవిష్ణుని వంశమువారికంటె గొప్పవారని యొప్పుకొనక తప్పదు. కృష్ణా కావేరులమధ్య పూర్వసముద్రముకడనుండి పశ్చిమ సముద్రమువఱకు వ్యాప్తమైన యాంధ్ర ద్రావిడ కర్ణాటక దేశములపై వారి యేలుబడి చెల్లెను. వేంగివారి యధికారమునకు లోబడినందులకు కొన్ని సూచన లున్నవి.

శివస్కందవర్మ యనంతరము కర్ణాటమున వారి యధికారము క్షీణించినను సింహవర్మ రాజ్యాధిపత్యము వహించిన పిమ్మట నాంధ్ర ద్రావిడ కర్ణాటములయందు వారి యధికారము నిరంకుశముగ సాగ నారంభించెను. వేంగియు మ. విష్ణుగోపుని స్వాధీనమున నుండెను. చోళులు మొదటి కుమారవిష్ణు బుద్ధవర్మలచే తిన్న దెబ్బలనుండి యిప్పటికి తేరుకొనలేదు. గంగులు సామంతులైరి. కదంబులు చిదుగగొట్టంబడిరి. సింహవర్మ దక్షిణ దేశమునకెల్ల నధిపతి యాయెను. ప్రాచీన పల్లవులలో కడు దొడ్డవాడీ రాజు. ఇంతవరు మించినవాడు ప్రాచీన పల్లవులలోనే కాదు, సింహవిష్ణుని వంశజులలోగూడ—ఒక మొదటి నరసింహవర్మ దక్క—గానరారు. కావున ప్రాచీన పల్లవ చరిత్రమును పఠించునప్పు డీవిషయమును జ్ఞప్తియం దుంచుకొనుట బాగు.



# కరికాళచోల మహారాజుల శాసనము



ఈశాసనము గుంటూరుజిల్లా ప్రుఁబవర్తి గ్రామమునం దున్నట్లు లోకలు రికార్డ్సు సం॥పు ౮౨ పుట ౩౮౧ లో చెప్పఁబడియున్నది. శాసనమంతయు, సంపూర్ణముగ వ్రాయఁబడలేదు, మనకు లభించినది శాసనమధ్యభాగములోని శకలము; లోకలు రికార్డ్సులో వ్రాయఁబడియుండు ఇతర శాసనములందువలె దీనియందును తప్పు లనేకము లున్నవి. అందలి విషయము ముఖ్యమైనది; దక్షిణ హిందూస్థానముయొక్క చరిత్ర నిర్మాణమున కత్యంతోపయోగము. శకలమైనను, తప్పులకుప్పయైనను, పరిశోధక పండితుల దృక్పథమునకు దాని నీపుట మంచిదని తలఁచి ప్రచురింప నుద్యమించియుంటిని. ఇంతలో నామిత్రులు ప్రభాకరశాస్త్రిగారు, ఏకారణముచేతనో, ఈశాసన ప్రతిబింబమును దెప్పించితినని చెప్పిరి. దానిని నాకొసఁగుమని వారిని యాచించితిని. నామీఁద వారికిగల విపులాభిమానముచే దానిని నాకొసంగిరి. ప్రతిబింబమును చదివితిని. కొన్ని సందేహములు కలిగినవి. నామిత్రులు సోమశేఖరశర్మగారు నాతో దానిని చదివి సంశయములను దొలఁగించిరి. ఇట్లు ప్రభాకర సోమశేఖరులు సహాయులు కాఁగా, ఈ శాసనశకలమునందలి తప్పులను దిద్దుకొంటిని. వారికి నానమస్కారశతములను సమర్పించి కృతజ్ఞుఁడ నగుచున్నాను.

### శాసనకాలము.

"కరికాలచోళ మహారాజుల శాసనము" అని లోకలు రికార్డ్సులో వ్రాయఁబడియున్నను, ఇది ఆమహారాజు శాసనము కాదు; ఏలన; కరికాలుఁడు క్రీ. శ. ౨-వ శతాబ్దమునకు ముందటివాఁడు; క్రీ. శ.

౭-వ శతాబ్దిమధ్య రేనాఁడుపై ప్రభుత్వముఁజేసిన పుణ్యకుమారుఁడను రాజు తాను కరికాలుని వంశమున జనించినట్లు చెప్పుకొనియున్నాఁడు[1]; తమిళ పరిశోధకులు ఈకరికాలుని కాలము క్రీ. శ. ౪, ౫ శతాబ్దముల నడుమనని నిర్ధారణచేసియున్నారు. లిపివైఖరిని బట్టి చూడ పులవర్తి శాసనము క్రీ శ. ౧౧ వ శతాబ్దమునకు ముందటిది కాదని తోఁచుచున్నది. కావున ఇది కరికాలమహారాజు శాసనము కాజాలదు. మఱియెవ్వరిదో! వెలనాటి ప్రభువులదని శ్రీప్రభాకరశాస్త్రిగారన్నారు; కాని అది పొరఁబాటు. వారు తెప్పించిన ప్రతిబింబము వెలనాటిప్రభువుల శాసనపు ప్రతిబింబముతో కలిసివచ్చుటచేతను, లిపి యొక్కరీతిగ నుండుటచేతను, ఆద్యంతములు లేని ఈశాసనపుతునుక పై వెలనాటిప్రభువుల శాసనఖండమనుభ్రమ వారికి కలుగుట కవకాశము కలిగినది. వెలనాటిరాజుల శాసనములలో కరికాలునివృత్తాంతము వచ్చుట కవకాశములేదు ఏలన, వారు చోళులుగారు; పరిశుద్ధాంధ్రచతుర్థకులజులు. వారి శాసనములలో కరికాలప్రస్తావన యెచ్చటను గాన్పించుటలేదు. కావున మన శాసనఖండము వెలనాటిరాజులది కాదు. మఱియెవ్వరిదన్న, ఆకాలముననే గుంటూరు సీమయం దచ్చటచ్చట సామంతులుగను స్వతంత్రప్రభువులుగను, రాజ్యములు సేయుచుండిన తెలుఁగుచోడరాజులదిగ నుండవలయును. ఈ తెలుఁగు చోడరాజులు, కరికాలుని వంశజులమని చెప్పుకొనిరి. కావున, శాసనములయందు వారు తమ వంశమునకు మూలపురుషుఁడగు, కరికాలుని ప్రశంసించుట యుచితమే. ఇట్టి ప్రశంస, ప్రచురింపఁబడిన ఆంధ్రచోళశాసనములం దన్నిటియందును గాన్పించుచున్నది. మఱియు, కరికాలచోళ త్రిలోచన పల్లవుల వైరకథ, ఆంధ్రచోళశాసనములయందు

1. E. I X 1. P 337.

దక్పు; మఱియెచ్చటను వర్ణింపఁబడియుండలేదు. పై కారణములవలన, ఈ పులవర్తి శాసన శకలము. క్రీ. శ. ౧౧-వ శతాబ్దమునాటి యాంధ్ర చోళరాజులదని నిర్ధారణ సేయుచున్నాను.

## శాసన విషయము.

చంద్రమౌళియొక్క పాదపద్మమునందలి భృంగమగు కరికాలుఁడు ఇక్ష్వాకుని (?) వంశమున బుట్టెను. ఆరాజు, ఈశ్వరుని ఆరాధించి, సర్వ సంపదలను సమృద్ధిపఱచుటకై స్వర్ణవృష్టిని కురిపించెను. త్రినేత్రపల్లవుఁడను నృపుని గర్వితునిగా నెఱింగి, వాని ఫాలలోచనమును భగ్నము చేసెను. భోజుఁడనురాజు చే సూర్యుని కర్పితములైన మూఁడు అర్ఘ్య పాత్రలను సూర్యునికడకు బోనీయక ఆకాశమున నాపి భోజుని దాసుని వలె చేసెను. ఇక్ష్వాకువంశ ప్రభువులకు రాజధానియు, మనుష్యులకు శుభావహాయు నగు అయోధ్యనుండి బ్రాహ్మణాదులగు నాల్గు వర్ణముల వారిని కొనివచ్చి పల్లవరాజు దేశమునందు రాష్ట్రములను, నగరములను యిచ్చి శ్రీ పర్వతచ్ఛాయయందు ప్రతిష్ఠించెను. అచ్చట తనపేరిట లింగ ప్రతిష్ఠ చేసెను.

## విమర్శ.

కరికాలుఁడు, చిరకాలము క్రిందట చోళదేశమున రాజ్యముచేసిన ప్రభువు. తొలుదొల్త నితని రాజధాని కావేరి తీరమున ప్రస్తుతపు తిరుచినాపల్లికి పశ్చిమమున మైలు దూరముననున్న ఉరయూరు. విదేశ వాణిజ్య సౌకర్యార్థమై కావేరి ముఖద్వారముకడనున్న పుహారు లేక కావేరి పూంపట్టినమును కరికాలుఁడు రాజ్యమునకు ముఖ్యస్థానముగ జేసెను. ఇతఁడు దిగ్జేత. పాండ్య కేరళ సింహళములను జయించి ఆదేశపు ప్రభువులను దాసులనుగ జేసికొనెను. ఇంతేకాక సింహళవాసులను

చేసవేలుగ గొనివచ్చి కావేరికి వేలగట్టు పెట్టివాండ్రనుగ జేసెను. రాజుల నెత్తిపై తట్టలు పెట్టి మట్టి మోయించెనట! ఉత్తరదేశమును హిమాచలమువరకును జయించి ఆకొండసానువులపై చోళరాజపతాకములను జెక్కించెనట!

ఈవిషయములన్నియుఁ ద్రమిళపరిశోధకుల గ్రంథములనుండి సంగ్రహింపఁబడినవి. ఆంధ్రకావ్యములయందును ఇట్టి వర్ణనలే కన్పడుచున్నవి. తిక్కన్నగా రిట్లనుచున్నారు:

శా. చేసేతం బృథివీశు లందుకొన గాశీసింధుతోయంబులన్
జేసెన్ మజ్జన, ముంగుటంబున హరించెం బల్లవోర్వీశు ను
ల్లాసంబందగ ఫాలలోచనము, లీలం గట్టె కావేరి, పే
లాసాధ్యాఖిలదిఙ్ముఖుండు కరికాలక్ష్మావిభుం డల్పుఁడే[1].

ఈవిషయములే విపులముగ నవచోళచరిత్ర[2]యందు వర్ణింపఁబడినవి. ప్రస్తుతము ఇచ్చట విమర్శింపఁబడు శాసనము మనకు పైవిషయములను జెప్పుటయేకాక కొన్ని క్రొత్తవిషయములను తెలియజేయుచున్నది. శాసనమువలన మనకుఁ దెలియువిషయములు:

1. కరికాలుఁడు గొప్పశివభక్తుఁడు. ఈతని భక్తివిశేషమును ద్రావిడశైవగ్రంథములు కొనియాడుచున్నవి. ఆంధ్రశైవులుఁగూడ నీతఁడు శివునకు నచ్చిన భక్తుఁడనియే తలఁచుచున్నారు. పండితారాధ్యచరిత్ర నవచోళచరిత్రలయం దీతని భక్తిప్రభావములు కీర్తింపఁబడినవి.

2. సర్వసంపదల సమృద్ధికై స్వర్ణవృష్టిని గురిపించెను. ఇది చరిత్రకు అందనివిషయము.

1. నిర్వ. ఉ. రా.

2. ఆంధ్రపత్రిక ఆఫీసు ప్రకటన.

3. త్రినేత్రపల్లవుఁడు గర్వితుఁడగుట నెఱింగి వాని ఫాలలోచనమును భగ్నముచేసెను. ఈవిషయమే నిర్వచనోత్తర రామాయణము నందు "హరించెం బల్లవోర్వీశు నుల్లాసం బందగ ఫాలలోచనము" అను వాక్యముచే సూచింపఁబడినది. ఇతనికి ముక్కంటికాడ్వెట్టియను మారు పేరు గలదు. ఈ యుదంతము పాల్కురికి సోమన్న పండితారాధ్యచరిత్ర యందును గలదు.

"ఏఁ యిట్టివి వేయు నెన్న ముక్కంటి
కాళి[దు] వెట్టియటన్న గణనాథుఁ డొకఁడు

*          *          *          *          *

మేదురభక్తిమై మించి లోకముల
నాది సాక్షాత్త్రినయనుండని నుడువ
కరికాల చోడుఁడన్ గణనాయకుండు

*          *          *          *          *

విభ్రమలీలఁ గావేరిఁగట్టుచును
మట్టినమహిమమై ముక్కంటి కాడు
వెట్టి నా కావేరివెట్టికిఁ బిలువ
ముక్కంటి వాఁడేల మను వెట్టిజేయు
ఇక్కంటివానికి నేజేయ ననుడు;
ఇచ్చినవాఁ డెవ్వఁ డీనేత్రమనుచు
నచ్చుగా ముక్కన్ను నతనిరూపఁబు
ముంగల వ్రాయించి మొగిఁ దనకాలి
యుంగుటంబున నట యొత్త ముక్కంటి
కాళి[దు] వెట్టి నొసటి కన్నటుపగుల
కాళివెట్టిన యహంకారం బడంగె 1

1. పండితారాధ్యచరిత్ర. ప్రక. 4.

ఈకథను విపులముగ నెఱుఁగ దలఁచుగలవారలు నవచోళచరిత్రను జదువవలయును. ప్రతి యాంధ్రచోళశాసనమునందును "చరణ సరోరుహావిహతవిలోచన త్రిలోచన ప్రముఖాఖిలపృథ్వీశ్వర కారిత కావేరీ తీర కరికాలకుల రత్నప్రదీప" యను వాక్య మీకథనే సూచించు చున్నది. ఇదే కొణిదెనలోని ఒప్పిలిసిద్ధి శాసనమున నించుక విపులముగ స్మరింపఁబడినది.

క. కావేరిదరులు గట్టఁగ, వేవేఁ పల్లవుఁడు దనదు వెట్టికి రామిఁగా
డా వానినుదుటి కనువో, గా వడిఁ గరికాలవిభుఁడు గాలందుడిచెఁగా.

ఇట్టివి శాసనములయందు పలుచోట్ల గాన్పించుచున్నవి. వీనివల్ల కరికాలుఁడు త్రినేత్రపల్లవుని జయించెననుట నిశ్చయమని తోచుచున్నది ఈత్రినేత్రపల్లవు డెవ్వఁడు? ఈవిషయమును గూర్చి ప్రత్యేకించి యొక వ్యాసమును వ్రాయవలసియున్నది. గ్రంథవిస్తరభీతిచేతను, సందర్భ మిది కాకపోవుటచేతను, ఇచ్చట సూక్ష్మముగ నాతని విషయము వచించి విరమించుచున్నాఁడను.

ఇతఁడు పల్లవుఁడు; కంచిరాజు. పూర్వపశ్చిమసముద్రములకును, గృష్ణా కొల్లడములకును మధ్యనున్న దేశము నేలిన ప్రభువు. చాళుక్య వంశమునకు మూలపురుషుఁడగు విజయాదిత్యు డితనితో పోరి సమసెను. ఇతఁడు శైవమతాభిమాని. అనేక శివాలయములను నిర్మించెను. శూద్రుల అర్చకత్వమును దొలగించి బ్రాహ్మణుల నర్చకులనుగ జేసి వేద శాస్త్రవిహితముగ శివార్చనను నడపెను. జైనబౌద్ధమతములయు నాశము చేసెను. జైనవసతులను, బౌద్ధవిహారములను పడగొట్టించెను. బ్రాహ్మణ మతము నుద్ధరించెను. దక్షిణదేశమున ఆర్యనాగరకతను బ్రవేశపెట్టి

1. S. I I. Vol VI.

దేశమును బర్బరాక్రాంతమును గాకుండజేసెను. ఆర్యావర్తమునుండి బ్రాహ్మణులను, బ్రాహ్మణేతరులను బిలిపించి అగ్రహారములను, భూములను ఇచ్చి వారు దక్షిణాంధ్రమున శాశ్వతముగ నుండునట్లు చేసెను. అడవులను నరికించి గ్రామములను, పట్టణములను నిర్మించి వానిని వాసయోగ్యములుగ జేసెను. కడపట ఇతనికి కరికాలునితో వైరము పొసగెను. పరాజితుడై కప్పము నిచ్చెను కంచిరాజ్యము చోళుల స్వాధీనమైనది. వారు దక్షిణాంధ్రమండలము నాక్రమించుకొనిరి. రేనాడు, పాకనాడు మొదలగు సీమలు ఆంధ్రచోళుల కుక్కిపట్టులాయెను. త్రిలోచనుడు ధరణికోట రాజధానిగా గుంటూరుమండలమును పాలించుచుండెను శాసనములలోను, వాఙ్మయములోను, లోకల్ రికార్డులలోను ఉన్నకథలలోని అద్భుత చిత్రములను తొలగించిన దొరకు చారిత్రకసంబంధవిషయ మింతయే.

ఇట్లు త్రినేత్రుని నిర్జించి, యతనిరాజ్యమున విశేషభాగమును కరికాలు డాక్రమించుకొనెను. కృష్ణకు దక్షిణముననున్న సర్వదేశములకును జక్రవర్తి యాయెను.

[1] భోజుని జయించి దాసునిగ జేసుకొనెను.

ఒప్పిలి సిద్ధకొటిదేవ శాసనమునందు ఈవిషయము సంస్మరింపఁబడియున్నది.

"ఇనుపాదము లర్చింపగ, జనుభోజుని యర్ఘ్యమంత్ర జలపాత్రలుదా
వినువీథి నాగబంచెను, ఘనముగ దన మానవాడిచి కరికాలుడిలన్.[2]

ఈభోజునికథ కరికాలుని మాహాత్మ్యమును దెలియఁజేయు అద్భుతవిషయములో మునిగియున్నది. మహాత్త్వసూచకములగు అమా

1. జర్నల్ ఆఫ్. ఇం. హి. Vol, VI.
2, S. I. I. VI. 628.

నుష చర్యలవలె భోజుని కథయు, చరిత్ర రచనమున విసర్జనీయమా? అట్లనుకొనిన భోజుఁడే మిథ్యాపురుషుఁ డగును. వితర్కమున కవసర ముండదు. అటుగాక చారిత్రాత్మకుఁడగు వ్యక్తియని తలఁచితిమేని ఎవఁ డాతఁడను ప్రశ్న కెడముగల్గుచున్నది. ఆకాలము (అనగా క్రీ. శ. 3, ౬ శతాబ్దముల మధ్యయుగము) నందలి, శాసనములందు కృష్ణ దక్షిణభూముల నేలిన రాజులలో భోజుడను రాజుగాని, తన్నామాంకిత మగు రాజవంశముగాని, పొడకట్టదు. కృష్ణ దాటిన దక్కనుపీఠ భూమిపై వాకాటకరాజవంశ మొకటి గాన్పించుచున్నది. ఆంధ్రులకు వెనుక దక్కనుపీఠభూమిపై సామ్రాజ్యపదము నార్జించి, క్రీ. శ. 4, 5 శతాబ్దములలో మహావైభవముతో నేలిన వంశమిది. వాకాటక రాజ కుటుంబమునకును, సకలోత్తరాపథనాథులగు గుప్తచక్రవర్తులకును బంధుత్వముగలదు. ఇట్లే వేంగి నేలిన విష్ణుకుండినులకును వాకాటకుల కును. ఈవాకాటక రాజ్యజన్మస్థానము విదర్భ. విదర్భ భోజులకు బుట్టి నిల్లు. భోజయను పదము జాతిని సూచించునది. 'యదువృష్ణి భోజుల' నామములందఱును గుర్తెరింగినవే. భోజులరాజు భోజరాజు. సంగ్రహముగ వాకాటకదేశము భోజదేశమనియు, వాకాటక రాజు భోజరాజనియు, గీర్వాణవాఙ్మయము దెల్పుచున్నది. ఈశాసనపు భోజుడు చరిత్రాత్మకవ్యక్తి యేని, అతడు విదర్భదేశపురాజై యుండ వలయును. హూణుల దండయాత్రలు గుప్తసామ్రాజ్యమును విచ్ఛిన్నము సేయుచుఱకును వాకాటక రాజ్యమును చెడక నిలిచినది. తదనంతరము రాజ్యవిప్లవము జరిగినది. దేశమంతయు. సంక్షోభము నందినది. క్రీ. శ. ౬-వ శతాబ్దారంభమునందే పూర్వవాకాటక రాజ్యమునఁ నల చళుక్యాదులగు నూతన రాజవంశములు దలలు పైకెత్తినవి. కరికాలుఁడు భోజుని గెల్చి యుత్తరాపథముపై దండెత్తిపోవుట నిక్క

మేని వాకాటకుల యంత్యదశయందు, అనఁగా క్రీ. శ. ౬వ శతాబ్దారంభముననో, ఇంచుక తత్పూర్వముననో మహాకార్యములకు జేసియుండవలయును.

5. అయోధ్యనుండి బ్రాహ్మణులు మున్నగు నాలుగువర్ణములను తోడ్తెచ్చి శ్రీపర్వతచ్ఛాయయందు పల్లవరాజు రాజ్యమున పట్టణములును, గ్రామములును, వారికిచ్చి తగినయేర్పాట్లను జేసెనట! ఇది పైవిషయమునుఁబోలి నూతనమైనదే. ఒకానొకశాసనము చోళులయోధ్యనుండి దక్షిణమునకు వచ్చి రాజ్యనిర్మాణమునుఁ జేసికొనిరని తెలుపుచున్నది. ఇది విశ్వసనీయమగునా? అగునేని కరికాలుఁడు అయోధ్యనుండి బ్రాహ్మణులనే కాక తదితరవర్ణములవారినిఁ గూడ దోడ్తెచ్చుటకు గారణముఁ దెలియుచున్నది. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చోళులు ఆద్యము దక్షిణాపథస్థులు గారనియు, ఉత్తరదేశమునుండి వచ్చిరనియుఁ జెప్పియున్నారు; నిజమేమో! భావిపరిశోధనమువల్ల సత్యము తేలఁగలదు.

6. కావేరికి వేలకట్టుట సుప్రసిద్ధవిషయము. దీనిపై వ్యాఖ్యానమవసరముగాదు.

ఈశాసనము శకలమైనను కరికాలునిగురించి నూతనవిషయములను దెలియఁజేయుచున్నది. కాన, చరిత్రరచయిత కిది మిక్కిలి యుపయోగకారి. ఇంకను లోకలురికార్డులవల్ల కరికాలునిచరిత్రము గొంత తెలియుచున్నది. ఇతఁడు ప్రజలసౌఖ్యమునకై పాటుపడిన మహారాజు. దేశమును వెల్లువయందు మునుఁగనీయక కావేరికి దరులు గట్టుట యింతకుముందే తెల్పితిని. ఇంతేకాక అడవులను నఱికించి పురములను గ్రామములను నిర్మించెను. నాగరకులగు ఆర్యజాతులవారినిఁ దోడ్తెచ్చి దేశమునుండి బర్బరత్వమును వెడలనడచెను ఎన్నియో అగ్రహారములను బ్రాహ్మణుల కొసఁగెను. లెక్కలేని దేవాలయములను గట్టెను. వ్యవసాయాభివృద్ధికై చెఱువులను త్రవ్వించెను. నదులకు అనకట్టలుగట్టి కాలువలద్వారా నీటిని తెచ్చి చెఱువులను నిండించెను. అరణ్యభూములు

వ్యవసాయమున కనుకూలము లగునటులను పన్ను నడుగక రైతులకు ఉచితముగ నిచ్చెను. పిమ్మట పన్నుల నేర్పఱచెను. నూతనగ్రామము లభివృద్ధికి రాఁగా రాజ్యపాలనసౌకర్యమునకై వానిని నాడులుగ విభజించెను. ఇట్లు ప్రజాభివృద్ధికై యీమహారాజు పలువిధముల పాటుపడెను. ఇట్టి మహోపకారిని ఆంధ్రులు మఱచుటెట్లు? కావుననే దత్తమండల వాసు లాతని నిప్పటికిని స్మరించుచున్నారు. తిక్కన్నగా రన్నట్లు, "కరికాలత్వావిభుం డల్పుడే!"

తద్వంశజాతో కరికాలచోడః, శశాంకభృత్పాదపయోజభృంగః. ౧
సర్వసంపత్సమృద్ధ్యర్థం స్వర్ణవృష్టిం తథాకరోత్,
బాధామృడం సమారాధ్య రాజా రాజతరామభవత్. ౨
త్రినేత్రపల్లవం భూపం కృత్వాగవినతమాజ్ఞయా,
తస్యాంఘ్రికం లలాటస్థం భగ్నం కృత్వా వ్యరాజత. 3
భోజపూజాఖ్యపాత్రాణి త్రీణి సూర్యార్పితానిచ,
నిజాజ్ఞయాంబరస్థాని చక్రే తం దాసవన్నృపం. ౪
సహ్యపాదోద్భవాం దేవీం కావేరీం చోడమండలే,
ఖత్వా చోడమహీపాలో రరక్ష వసుధామిమాం. ౫
ఇక్ష్వాకువంశజాతానాం నృపాణాం నగరీశుభా,
శుభావహా మనుష్యాణా మయోధ్యా రాజతే సదా. ౬
తత్రస్థాన్ బ్రాహ్మణాదీంశ్చ చతుర్వర్ణసముద్భవాన్,
నీత్వాపల్లవరాజశ్చ రాష్ట్రాణినగరాణిచ. ౭
దత్వా శ్రీపర్వతచ్ఛాయే ప్రతిష్ఠామకరోద్భ [ని*]
[తత్ర*] లింగంప్రతిష్ఠాప్య, స్వనామ్నాపల్ల........* ౮

---

1. S. I. I. VI. 651.

*విభవసంవత్సర పుష్యమాస భారతినుండి పునర్ముద్రితము.

# మంగళేశ్వరుఁడు.

౧

ఈతఁడు బాదామిపురమును రాజధానిగ నేర్పఱచుకొని కర్ణాట కుంతల కొంకణదేశముల నేలిన పాశ్చాత్యచాళుక్యరాజులలో నైదవ వాఁడు. ఈతనిచరిత్ర మీక్రిందిశాసనములన దెలియుచున్నది.

౧. బాదామిగుహాలోని శిలాశాసనము[1] ౨. నేరూరుతామ్ర శాసనము [2] 3. మహాకూట శిలాస్తంభశాసనము.[3]

ఈమూఁడును మంగళేశ్వరుని శాసనములు. ఇవిగాక,

౪. రెండవ పులకేశియొక్క అయ్యవొళెశాసనమును,[4]
౫. ఆఱవ విక్రమాదిత్యుని ఏవూరుశాసనమును [5] మంగళేశ్వరునిచరిత్రమునకు సంబంధించిన కొన్ని ముఖ్యాంశములను దెలియఁజేయుచున్నవి.

తనవంశమునుగూర్చి మహాకూట శిలాస్తంభశాసనమున మంగళేశ్వరుఁ డిట్లు చెప్పుకొనియున్నాఁడు. మానవ్యసగోత్రుఁడును, హారీతిపుత్త్రుఁడును, చళిక్యవంశసంభూతుఁడును నగు జయసింహుఁడను నరపాలుఁ డొకఁడుండెను. ఆతనిపుత్త్రుఁడు రణరాగుఁడు. ఆ రణరాగుని తనయుఁడు సత్యాశ్రయ శ్రీపృథివీవల్లభ రణవిక్రమాంకుఁడు. (ఈతనికి మొదటిపులకేశి యనుపేరును గలదు). ఈతని కిరువురుపుత్త్రులు, బలభద్ర

1. Ind. Ant. X, P. 59.
2. „ VII, P. 161.
3. „ XIX, P. 7.
4. „ Ep. Ind. VI, P. 1.
5. „ Ind. Ant. VIII, P. 114.

వాసుభద్రులను బోలువారు, కీర్తివర్మ మంగళేశ్వరు లనువారు జనన మందిరి.

కీర్తివర్మయు మంగళేశ్వరుఁడును ఒక తల్లిబిడ్డలుఁగారు; సవతుల బిడ్డలు. ఈ విషయము మహాకూటశాసనములోని యీ క్రిందివాక్యము వల్ల దెలియుచున్నది.

"తస్యధ [ర్మ] రతబుద్ధే ర్వసుదేవ ప్రతిమ ప్రభావస్య బలవా సుభద్రోపమగుణౌ సుతౌ సముత్పన్నౌ. జ్యేష్ఠ [ః] శ్రేష్ఠగుణ సము దయోదిత పురురణవిక్రమా జ్కాప్రియః......కనీయాన్ ఉరురణ విక్రాన్తమంగళేశ శ్రీపృథివీవల్లభేన్ద్రాభిఖ్యనృపో బభూవ."

"ఆధర్మరతబుద్ధికి వసుదేవునితో సమమగు ప్రభావము గలవానికి (రణవిక్రమునకు) భలభద్రవాసుభద్రులతో తుల్యమైన గుణముగల వారలు పుత్రులు ఇరువురు పుట్టిరి. అందు శ్రేష్ఠములగు గుణములచే నతిశయించినవాఁడు పురురణపరాక్రమాఙ్కుఁడు ప్రియుఁడు జ్యేష్ఠుఁడును; ఉరురణవిక్రాన్త మంగళేశ శ్రీపృథివీవల్లభేంద్రుఁ డనువేరుగల రాజు కనిష్ఠుఁడును అయిరి."

"మదయన్తీమివ మహాపతివ్రతాం బట్వారకుల లలామభూతాం నైకవిధధర్మ ఫలభాగ్యపవిత్రీకృత శరీరాం స్వగురుపత్నీం దుర్లభా నామ ధేయాం దేవీమాహూయ."

"మదయన్తిని బోలు మహాపతివ్రతను, బట్వారికులమునయొక్క నొసటిమాణిక్యమును, అనేకవిధములగు ధర్మకార్యముల ఫలముచే పవిత్రము సేయఁబడిన దేహముగలదానిని, దుర్లభయను నామధేయము గల దేవిని తన తండ్రి భార్యను పిలిచి."

ఈవాక్యములపై ఫ్లీటుగారిట్లు వ్యాఖ్యానము జేసియున్నారు:

"అతఁడు (మంగళేశ్వరుఁడు) మొదటి కీర్తివర్మకు సవతితల్లి గర్భమునఁ బుట్టిన తమ్ముఁడు. ఏలన, యీశాసనముయొక్క ౧౩-వ పంక్తిలో దుర్లభదేవిని "స్వమాతరం" అనక "స్వగురుపత్నీం" అని సంబోధించియున్నాఁడు. ౫-వ పంక్తిలో తండ్రి వసుదేవునితోడను తనయు లిరువురును బలభద్రవాసుభద్రులతోడను బోల్పఁబడియుండుటయు నట్లే సూచించుచున్నది. వసుదేవునికి (=రణవిక్రమునకు) రోహిణి (=దుర్లభదేవి)యు, దేవకి (=?)యు నను నిద్దరుభార్య లుండిరి. బలభద్రుని లేక బలరాముని (=మొదటికీర్తివర్మను) ప్రథమమున దేవకియే గర్భమున ధరించినను, పిమ్మట నామె గర్భస్థమగు పిండమును యోగమాయ నేర్పుతో మెల్లన తిగిచి రోహిణికడుపున నిడియెను. తత్కారణమున బలభద్రుఁడు రోహిణి గర్భమునుండి యుదయమాయెను. అతని తమ్ముఁడు వాసుభద్రుఁడు, వాసుదేవుఁడు, లేక కృష్ణుఁడు (=మంగళేశుఁడు) దేవకి గర్భమున జన్మించెను. (కాబట్టి బలభద్రుఁడును వాసుభద్రుఁడును అనఁగా కీర్తివర్మయును మంగళేశ్వరుఁడును సవతులబిడ్డలు). పురు రణపరాక్రమ ఉరు రణవిక్రాన్త అను బిరుదములలోని 'పురు' 'ఉరు' శబ్దములు ఈవిషయమునే సూచించినను సూచింపవచ్చును. బాదామిగుహాశాసనమున మంగళేశునకు "రణవిక్రాంతుడ"ను బిరుదముమాత్ర మున్నట్లు చెప్పఁబడియున్నది. ఇచ్చట పైఁ బిరుదములలోని "పురు" "ఉరు"శబ్దములు కీర్తివర్మ మంగళేశ్వరుల భిన్నమాతృత్వమును చూపుటకై తెచ్చి పెట్టఁబడి యున్నట్లున్నవి. సెంటుపీటర్సుబర్గునిఘంటువు ప్రకారము "అధికము" "అనేకము" అను నర్థముగల "పురు" అను వైదికపదము, ఇతిహాసములలోను తరువాతి వాఙ్మయమునందును నామపదములకు (Proper names) ముందు కనిపించుచున్నదనియు; ప్రాతవియును, అసాధారణములును నగు పదములపై నభిమానముగల భాగవతపురాణ కర్త

వీని నిట్లే ప్రయోగించి యున్నాఁడనియు నాకు దెల్పుచు ఈయన్నదమ్ము లిద్దరును చాళుక్యమునకు పుత్రకుమారులగు 'పుర', 'ఉరు' అనువారలకు బోల్పఁబడి యుందురని ప్రొఫెసరు కీలుహారన్ గారు చెప్పిరి. ఇందువల్ల మంగళేశుని కాలమున "పుర" శబ్దమును విశేషణముగ బ్రయోగించు టకు వీలుకాదని తేలుచున్నది. కాబట్టి యదియొక నామపద (Proper noun) మని తెలిసికొన వలయును. "పుర" శబ్దమునకు సమమగు "ఉరు" శబ్దమునకు గూడ నట్లే యర్థము చేసికొనవలయును. అయితే "పుర" "ఉరు" అనువారలు సవతుల బిడ్డలో కారో నేను చెప్పఁ జాలను."[1]

ఫ్లీటుగారి చర్చనుబట్టి చూడఁగా కీర్తివర్మయు మంగళేశ్వరుఁడును సహోదరులు కారనియు, సవతులబిడ్డలనియు తేలుచున్నది.

## మంగళేశుని రాజ్యాభిషేకము.

మొదటి పొలకేశి మరణానంతరము మొదటి కీర్తివర్మ రాజ్యము జేసెను ఆతని మరణానంతరము మంగళేశ్వరుని రాజ్యాభిషేక మహోత్సవము జరిగెను. కాని యీ రాజ్యాభిషేకము జరిగిన దెప్పుడు? ఈ ప్రశ్నకు సమాధానము చెప్పుట సులభమైనపని కాదు. ఏలన, మంగళేశుని రాజ్యాభిషేకకాల నిర్ణయము చళుక్యులచరిత్రలోని గూఢతమమగు సమస్య. ఈపై ప్రశ్నకు మంగళేశుని కాలపు శాసనములు మూఁడువిధములగు సమాధానము లిచ్చుచున్నవి.

౧. బాదామిగుహాశాసనమునం దిట్లున్నది:

"శ్రీమంగళీశ్వరో రణవిక్రాన్తః ప్రవర్ధమానరాజ్యసంవత్సరే

1. Indian Ant. Vol. .XIX.P.7

ద్వాదశే శకనృపతిరాజ్యాభిషేక సంవత్సరేష్వతీతేషు పఞ్చాసు శతేషు"
"మహాకార్తిక పౌర్ణమాస్యాం." ఇత్యాది.

దీనినిబట్టిచూడ మంగళేశ్వరుఁడు శకాబ్దము ౫౦౦ నాటికి ౧౨ సంవత్సరములు రాజ్యము చేసియుండె నని తెలియుచున్నది. కాబట్టి అతని రాజ్యాభిషేకసంవత్సరము శకాబ్దము ౪౮౯ లో నగుగా క్రీ. శ. ౫౬౭-౬౮ సంవత్సరమున జరిగెనని తెలియుచున్నది.

౨. మహాకూటశిలాస్తంభశాసనమునం దిట్లున్నది:

"ఉత్తరోత్తర ప్రవర్ధమాన రాజ్య పఞ్చమవర్షే ప్రవర్ధమానే సిద్ధార్థే వైశాఖపౌర్ణమాస్యాం."

ఇందువల్ల మహాకూటశాసనము మంగళేశ్వరుని ఐదవ సంవత్సరమునకు సరియగు సిద్ధార్థివర్ష వైశాఖ పౌర్ణమాస్యనాఁడు వ్రాయించినట్లు తెలియుచున్నది. అయితే, మంగళేశ్వరుని రాజ్యపఞ్చమవర్షమునకు సరిపోవుశకాబ్ద మిందు చెప్పఁబడలేదు. కాబట్టి యీశాసనకాలమును నిర్ధారణసేయుటకు వీలులేదు. బాదామిగుహాశాసనమున రచించినట్లు మంగళేశ్వరుని రాజ్యారంభము శ. ౪౮౯-వ సంవత్సరమైనయెడల మహాకూట శాసనము శ. ౪౯3 లోఁ జెక్కించి యుండవలయును.

వాస్తవము విచారించిచూడ నిది బాదామిగుహాశాసనముకంటెను నేరూరు తామ్రశాసనముకంటెను తరువాతిదిగా తోఁచుచున్నది. బాదామిగుహాశాసనమున మంగళేశ్వరుని శౌర్యధైర్యాదిగుణములు గణింపఁబడినవి గాని యాతనిచే జయింపఁబడిన దేశములుగాని పరాజితులగు శత్రువులుగాని పేర్కొనఁబడియుండలేదు. నేరూరుతామ్రశాసనమున తాను శంకరగణునిపుత్రుని గజతురగపదాతి కోశబలసంపన్నుని బుద్ధరాజును వెడలనడచితి ననియు, చళిక్యవంశసంభవుని పదునెనిమిది యుద్ధ

ములయందు గెలుపుగొన్న ప్రోశను స్వామిరాజును హతము చేసితినని యుఁ జెప్పుకొనియున్నాఁడు.

"తేన రాజ్ఞా శంకరగణపుత్రం గజతురగపదాతికోశబలసంపన్నం బుద్ధరాజం విద్రావ్య చలిక్యవంశసంభవం అష్టాదశ సమరవిజయినం స్వామిరాజం చ హత్వా" ఇత్యాది.

మహాకూటశిలాస్తంభ శాసనమున తాను ఉత్తరదిగ్విజయము జేసి పై బుద్ధరాజు నోడించి, యాతని ధనమును సర్వమును గ్రహించి; అటు పిమ్మట భాగీరథీకూలమున దనశక్తిజయస్తంభమును నాటుట మేలని తలఁచి మకుటేశ్వరనాథునికి దనమాఱుదల్లియగు దుర్లభదేవిచే భూదానమును చేయించితినని చెప్పుకొనియున్నాఁడు.

"సఉత్తరదిగ్విజయకృతబుద్ధి ర్బుద్ధనృప మవిజిత్య తస్య వసుమశేష ముపగృహ్య భాగీరథీకూలేశక్తి జయస్తంభనిరోపణోత్సుక్యేన మనసా ధర్మజయస్తంభశక్తిః ప్రథమతర మేవ నిరోపయిత వ్యే త్యవధృత్య తదనుకరణయోగభూతాం మదయన్తీమివ మహాపతివ్రతాం బటుస్వారకులలలామభూతాం నైకవిధధర్మఫలభాగ్యపవిత్రీకృతశరీరాం స్వగురుపత్నీం దుర్లభానామధేయాన్ దేవీమాహూయ"

ఈబుద్ధరాజు కలచ్చూరివంశజుఁడని యీ శాసనములోని ౧3-వ పంక్తివలన తెలియుచున్నది.

ఇందువల్ల తెలియున దేమన:

బాదామిగుహాశాసనకాలమువఱకు మంగళేశ్వరునకు ప్రఖ్యాతి గల శత్రువులతోఁ బోరాటము కలుగలేదు. బాదామి నేరూరు శాసన కాలములమధ్య కలచ్చూరిబుద్ధరాజును చాళిక్యస్వామిరాజును కలసియో వేఱువేఱుగనో మంగళేశ్వరునిరాష్ట్రముపై దాడివెడలిరి. ఇరు తెగలకును

పోరు సమకూరెను. ఈ యుద్ధమున స్వామిరాజు హతుఁడయ్యెను. బుద్ధరాజు పరాజితుఁడై పలాయన మొనర్చెను. నేరూరు మహాకూటశాసనముల మధ్యకాలమున మంగళేశ్వరుఁడు కలత్చూరిరాష్ట్రముపై దండు వెడలి బుద్ధుని పరాఙ్ముఖునిచేసి వాని సర్వస్వమును హరించెను.

కాబట్టి మహాకూటశాసనము నేరూరు శాసనమునకు పిమ్మటను నేరూరుశాసనము బాదామిశాసనమునకు పిమ్మటను లిఖింపఁబడినవి. అనఁగా మంగళేశ్వరుని శాసనములలో బాదామిశాసనము మొదటను, నేరూరుశాసనము దానికి దరువాతికాలమునను మహాకూటశాసనము కడపటను వ్రాయింపఁబడినవి.

మఱియు మహాకూటశాసనము ప్రవర్ధమానరాజ్యపఞ్చమ శ్రీవర్షమునకు సరియగు సిద్ధార్థిసంవత్సరపు వైశాఖపౌర్ణమాస్యకాఁడు నెలకొల్పఁబడినది. మంగళేశ్వరుని రాజ్యకాలమున (శ. ౪౮౮-౫౩౨) నొక సిద్ధార్థి సంవత్సరము వచ్చినది. ఫ్లీటుగారి లెక్కప్రకారము అది శ. ౫౨౫ కు సరిపోవుచున్నది. అంతకు పూర్వపు సిద్ధార్థి శ. ౪౬౫ న వచ్చినది. మంగళేశ్వరుని రాజ్యారంభము శ. ౪౮౮ అగుటచేత నతని రాజ్యకాలమందలి సిద్ధార్థి శ. ౫౨౫ నకు సరియైనదిగానే యుండవలయును. కావున ఫ్లీటుగారు మహాకూటశాసనకాలము శ ౫౨౫ అని సిద్ధాంతీకరించిరి. శ. ౫౨౫ మంగళేశ్వరుని రాజ్యపఞ్చమశ్రీవర్షమైన అతఁడు శ. ౫౨౦ న సింహాసనారోహణము గావించియుండవలయును. బాదామిశాసనము రాజ్యాభిషేకవర్షము శ. ౪౮౮ అనుచున్నదిగదా! కాబట్టి యీ రెండుశాసనములును ఒకదానితో నొకటి విరోధించుచున్నవి.

(3) ఇంతేకాక కొందఱి మతానుసరణమున సత్యాశ్రయ ధ్రువరాజ యింద్రవర్మ గోవాశాసనము [1] శ. ౫౩౨ వఱకు సరిపోవు మంగళే

1. Jr. Bom R. A. S. X. 365-6.

శ్వరుని ౧౦-వ రాజ్యవర్షమున లిఖింపబడినది. కావున మంగళేశ్వరుడు శ. ౫౨౧ మొదలు రాజ్యమేల నారంభించె నని భండార్కారేత్యాదు లనుచున్నారు. బాదామి గుహాశాసనమున రాజ్యారంభము శ. ౪౮౯ అని చెప్పబడియున్నదే యన్న దానికి సమాధాన మిట్లు చెప్పుచున్నారు. శాసనమున మంగళేశ్వరుడే శ. ౫౦౦లో రాజ్యము సేయుచున్నట్లున్నను వాస్తవముగ నప్పు డాతడు రాజుగాడు. అతని యన్నయగు కీర్తివర్మయే అప్పుడు రాజ్యము సేయుచుండెను. మంగళేశ్వరు డాతని యన్నకు సహాయభూతుడుగ నుండెను. గుహాను ఖననముచేసి విష్ణువు నచ్చట స్థాపించిన ఫలము తనయన్నదని మంగళేశుడు బాదామి శాసనమున చెప్పుకొనియున్నాడు. కాబట్టి కీర్తివర్మ యప్పటికి బ్రతికియున్నాడనుట నిక్కము. అతని రాజ్యకాలము శ. ౫౨౧ తో పరిసమాప్తి నొందెను. అప్పటినుండియే మంగళేశ్వరుని రాజ్యకాలము పరిగణింపబడవలయును.

పైన జెప్పినరీతిని చరిత్రకారులు మంగళేశ్వరుని రాజ్యాభిషేక సమయ నిర్ణయమునుగూర్చి భిన్నాభిప్రాయులై యున్నారు. నిజము తెలిసికొనుమార్గ మేదైన నున్నదో కనుగొనవలసియున్నది. బాదామి గుహాలోని శాసనమున జెప్పినట్లు మంగళేశ్వరుని రాజ్యాభిషేకము శ. ౪౮౯ లో జరిగియుండుటయే నిక్కమని నాకు దోచుచున్నది. అందు మంగళేశ్వరుడు తాను రాజ్యము చేయునట్లు చెప్పుకొని యుండుట అందరును అంగీకరించిన విషయమే. గుహాను ఖననముచేసి విష్ణ్వాలయమును స్థాపించిన ఫలము తన యన్న దన్నంతమాత్రముననే యాతడప్పటి కింకను బ్రతికియుండెనని తేలదు. చనిపోయిన పిమ్మట గూడ నతని కాఫలము చెందవచ్చును. దేవాలయము నిర్మాణముచేసి దేవుని స్థాపించి తత్ఫలమును దన యన్నమీదిభక్తిచేత ఆతనికి జెంద

వలయునని కోరి యిట్లు చెప్పినాడు. కావున నీవాక్యము సాధారణము గాని కీర్తివర్మ శ. ౫౦౦ నాడు బ్రదికియుండెననియు అప్పుడాతనికి మంగళేశ్వరుడు సహాయభూతుడుగ మాత్ర ముండెననియు చెప్పుట కవకాశము లేదు.

సత్యాశ్రయ ధ్రువరాజ ఇంద్రవర్మయొక్క గోవాశాసనము సాధారణముగా చేసికొని శ. ౫౩౨ మంగళేశ్వరుని ౨౦-వ రాజ్యవర్ష మనియు కావున నాతని రాజ్యాభిషేకము శ. ౫౧౨ కో జరిగియుండ వలయునని పెదఫ్లీటుగారు వ్రాసియున్నారు. ఇట్టి యభిప్రాయమున కాధారమేమియు లేదని ఫ్లీటుగారు వచించిరి.

"గోవాశాసనమునకును మంగళేశ్వరుని రాజ్యాభిషేకమునకును ఎట్టి సంబంధమును లేదు." కారణము లేవియన:

౧. గోవాశాసనమున కాలమును సూచించు భాగము శాసనాంతమున నుండు నొకవిడివాక్యము. ఇట్లు శాసనాంతమున విడివాక్యమున తమ రాజ్యకాలమును సూచించుటగాని గోవాశాసనమున నున్నట్లు వర్తమాన రాజ్యవర్షమును జెప్పుటగాని సార్వభౌములగు నృపాలురకు మామూలుకాదు. ఇట్టి శాసన మింకొకటి మఱియేకాలముననుగాని యివ్వబడెనని నిశ్చయించిచెప్పుటకు వీలులేదు. అందు ముఖ్యముగ గోవాశాసనమున లేదు. ఇంతేకాక సామంతరాజులు తమ రాజ్యకాలమును జెప్పుకొనుమార్గ మిదియే.

౨. రెండవ పులకేశి హైదరాబాదు శాసనమువల్ల గలించిన శ. ౫౩౪ సంవత్సర మాతని రాజ్యాభిషేకమైన మూడవసంవత్సరమని తెలియుచున్నది. కాబట్టి గలించిన ౫౩౨ వ శకాబ్దమున నీరాజ్యాభి

షేకము జరిగియుండవలయును. ఇది నిజమైనచో శకాబ్దము ౫౩౨ న వ్రాయించిన గోవాశాసనము రెండవపులకేశి రాజ్యకాలమున నియ్యబడి యుండవలయును. శకాబ్దము ౫౩౨ రెండవపులకేశి రాజ్యకాలపు టిరువదియవసంవత్సరము కాజాలదు. పైఁజెప్పినట్లు మంగళేశ్వరుని రాజ్యకాలమును కాఁజాలదు. కావున గోవాశాసనమున వచింపఁబడిన రాజ్యకాలము సత్యాశ్రయ ధ్రువరాజ ఇంద్రవర్మదిగా నుండవలయును.

3. భండార్కరుగారి వాదప్రకారము మంగళేశ్వరుని రాజ్యాభిషేకము శ. ౫౧౨-౧౩ న జరిగిన దనుకొన్నను రాజ్యపంచమవర్షమున నఁగా శ. ౫౧౭-౧౮ న సిద్ధార్థి రాలేదు. కాబట్టి భండార్కరువాదమునకు మహాకూట శాసనము ప్రతికూలించుచున్నది.

౪. మంగళేశ్వరుని రాజ్యాభిషేకము శ ౫౧౨-౧౩ లో జరిగినదని నిరూపించుటకు భండార్కరుగారు వేఱొకమార్గమును ద్రొక్కియున్నారు. రెండవపులకేశియొక్క అయ్యవొళిశాసనమున కీర్తివర్మయొక్క మరణానంతరము మంగళేశ్వరుఁడు రాజాయెనని చెప్పఁబడియున్నది.

'తస్మి౯ సురేశ్వర విభూతిగతాభిలాషే
రాజాభవ త్తదనుజః కిల మఙ్గళేశః.'

కీర్తివర్మకు ముగ్గురో నలుగురో పుత్రులుండిరి. అందు రెండవపులకేశి జ్యేష్ఠుఁడు. తండ్రి మరణానంతర మాతఁడేల రాజ్యముచేయలేదు? ఆతని పినతండ్రియగు మంగళేశ్వరుఁడేల సింహాసనము నధిష్ఠించెను? అతఁడు మిక్కిలియుఁ బసివాఁడగుటచే రాజ్యమునేయుటకు అర్హుఁడు కాఁడాయెను. కావున మంగళేశ్వరుఁడు రాజాయెను. ప్రొఫెసరు కీలుహారనుగారు అయ్యవొళిశాసనమును పరిశోధించి, యందలి ౧౪-వ శ్లోకమునుఁగూర్చి యిట్లు చెప్పియున్నారు.

"రఘువంశము ౫-౨౮ తో నీశ్లోకమునుఁ బోల్చిచూడ పులకేశి తన్ను యౌవరాజ్యమున కభిషిక్తుంగాఁ జేయనేరెనని తోఁచుచున్నది."

ఇందుచే నాతఁ డప్పుడు తరుణ వయస్కుఁడుగ నుండినట్లు తెలియుచున్నది. ఏవూరు శాసన మీయూహకు తోడ్పడుచున్నది. పులకేశి యాతని తండ్రి మరణకాలమున నర్భకుఁడుగ నుండెను.

"జ్యేష్ఠభ్రాతృ స్వతిసుతవరేఽప్యర్భకత్వా దశక్తే
యస్మిన్నాత్మన్యశక్తేహి ధురంమఙ్గలీశః పృథివ్యాః."

ఇందువల్ల పులకేశి స్వజనకుని మరణకాలమున చిన్నకుఱ్ఱవాఁడని స్థిరపడుచున్నది. అతనికి తమ్ములు కనీసము మువ్వురైన నుండుటచే నాతఁ డప్పటికి కనీసము మూఁడేండ్లవాఁడై యుండవలయును. యౌవరాజ్యమును కోరినప్పటికి పదునైదు సంవత్సరముల వయస్సును, రాజ్యాభిషేక కాలమున ౨౨ సంవత్సరముల వయస్సును, అయ్యవోళె శాసనము నాటికి ౪౬ వర్షములప్రాయమును, యువనాఘ్వ్యాంగు వచ్చినప్పుడు ౫౦ యేండ్ల యీడును కలిగియుండెను.

శకాబ్దము ౫౩౨ న మంగళేశ్వరుని రాజ్యాంతమున రెండవ పులకేశి ౨౨ యేండ్ల ప్రాయమువాఁడు. అనఁగా నతఁడు శకాబ్దము ౫౧౦ న బుట్టెను. అతని మూఁడవయేట అనఁగా శ. ౫౧౩ లో కీర్తివర్మ గతించెను. ఆసంవత్సరముననే మంగళేశ్వరుఁడు సింహాసనారోహణమును గావించెను. *

భండార్కరుగారు త్రొక్కినమార్గము బాగుగ నున్నదని యొప్పుకొనుచు, ఫ్లీటుగారు వారివాదము నిట్లు విమర్శించుచున్నారు. వీరి వాదము నంగీకరించిన,—

* ప్రభవ సంవత్సరము మాఘమాస భారతినుండి పునర్ముద్రితము.

"సింహాసనారోహణమును గావించినప్పుడు ఆతని (పులకేశియొక్క) వయస్సు పదునైదు సంవత్సరములు ఉండెను. ఇది హిందూదేశమునందు హిందూ రాజా రాజ్యమేలుటకు తగిన యీడని సామాన్యముగ నొప్పుకొనఁబడినది కాదు. అయితే కీర్తివర్మ మరణానంతరము, రెండవ పులకేశి రాజ్యభారమును వహింపఁజాలని తరుణవయస్కుఁడగుటచే మంగళేశుఁడు రాజ్యభారమును వహించెననియు, మరల నాతనికి రాజ్యము నేయువయస్సు రాఁగా రాజ్యమును నాతని కిచ్చివేసెననియు మిరాజ్ శాసనము దెల్పుచున్నది. అయినను, ఈవిషయము, తరువాతి కాలమున వాడుకలోనున్న, వంశపరంపరగవచ్చు గాథల నాధారపఱచుకొని చెప్పినవిషయము. ఐహొళే శిలాశాసనమునందు నట్టి కాలపువర్ణనము పైఁజానికంటె విశ్వాసార్హమైనది. దానిమూలమున మంగళేశ్వరుని రాజ్యాంత కాలమున నాతనికిని, రెండవ పులకేశికిని నభిప్రాయభేదము లున్నట్లు మనకు దెలియుచున్నది; ఆ రాజ్యమును దనపుత్రుని కిచ్చుటకు మంగళేశుఁడు ప్రయత్నించెను; మంత్రశక్తియుపన్నుఁడగు పులకేశిచేఁ గూర్పఁబడిన బలముచే అతని యత్నము యుద్ధమున భగ్నమగుటయేకాక యతఁడు ప్రాణములనుగూడ గోల్పోయెను. ఇందువల్ల తన రాజ్యాభిషేకకాలమునందు ప్రబలమైన సహాయసంపత్తిని నేకరింపఁదగిన సంపూర్ణయౌవనమును (అనగా యిరువది మూఁడేండ్ల వయస్సును) రెండవ పులకేశి పొందియుండెనని మన మూహింపవచ్చును. దీని నంగీకరించిన నాతని జన్మవర్షము శ. ౫౧౦ యగును; శ. ౫౨౦-౨౧ లో నతని తండ్రి గతించినప్పుడు ఇంచుమించు పదివర్షములప్రాయమువాఁడగును."[1]

1. I. A. XIX, p. 13

పైచర్చనుబట్టి బాదామి రాజ్యాభిషేకమునాటి ప్రశస్తి దీని యందున్నను గూర్చియే భండార్కరు ప్రభృతుల అభిప్రాయభేదమున్నట్లగపడు చున్నది. అతని జన్మవర్షమును గూర్చి గాని, మంగళేశ్వరుని సింహాస నారోహణమును గూర్చి గాని వారి యభిప్రాయభేదమున్నట్లు తోచదు. అయినను, మంగళేశ్వరుడు బాదామి మహాశాసనమున జెప్పబడినట్లు శ. ౪౮౯-వ సంవత్సరమున సింహాసనారోహణము చేసినాడని యింతవఱకెవ్వరును జెప్పలేదు. శాసనము నెవ్వరును విరోధింపరు. నాకుజూడ భండార్కరు మొదలగు పండితులు అభిప్రాయభేదమును బట్టియుండి నట్లు తోచుచున్నది. అది యెట్లనగా: మంగళేశ్వరుడు శ. ౪౮౯లో సింహాసనము నెక్కెనని యొప్పుకొన్న సరేడు శ. ౫౩౨ వఱకు ననగా ౨౨ వర్షములు, రాజ్యము జేసిన ట్లొప్పుకొనవలసివచ్చును. ౨౨ సంవత్స రము లొక్కని రాజ్యకాలమనుటకు గడు దీర్ఘమగుటచే మంగళేశ్వ రుని రాజ్యకాలమును సంగ్రహపఱచినట్లు తోచుచున్నది. హిందూ స్థానములోని రాజులు సగటున ౨౦ వర్షములకు మించి రాజ్యము సేయలేదనుట యొప్పుకొనవలసిన విషయమే, అట్లనుటచే నెవ్వరును ౨౦ యేండ్లకంటె నధికముగ రాజ్యము సేయలేదని చెప్పుట సాహసము. ౫౦ యేండ్లు రాజ్యము చేసినవారనేకులు గలరు. ౫౦ సంవత్సరములు రాజ్య ము చేసినవారు కొందఱున్నారు. ఇక ౨౨ సంవత్సరములు రాజ్యము సల్పినవారి విషయ మొకవిశేషముగ జెప్పగలమా! కావున మంగ ళేశ్వరుడు ౨౨ వర్షములు ప్రభుత్వము చేసెననుటయందు వింతయేమి యు గాన్పింపదు. కాబట్టి బాదామిశాసనమున జెప్పినట్లు అతడు శ. ౫౧౯-వ సం. ననే వాస్తవముగ సింహాసనారోహణము గావించెనని నా భావము. యస్. కే. దీక్షితులుగారి యభిప్రాయముగూడ నిట్టిదే. మహా కూటశాసనములోని "ఉత్తరోత్తర ప్రవర్ధమాన రాజ్యపంచమ శ్రీవర్షే"

అను వాక్యములోని 'పంచత్రింశే వర్షే' యనునది తప్పనియు, అది 'పంచ త్రింశే' యని యుండవలయుననియు జెప్పుచు మహాకూటశాసనము మంగళేశ్వరుని 35-వ రాజ్యవర్షమున వ్రాయింపఁబడె ననుచున్నారు.[1] అతని రాజ్యారంభము శ ౪౮౮-౯ అని యొప్పుకొన్న మహాకూట శాసన కాలము శ. ౪౮౮-౯+35=శ. 523-4 అగుచున్నది. ఫ్లీటుగారిచే నిర్ణయింపఁబడిన కాలముగూడ కొంచెమించుమించుగ దీనికి సరిపోవు చున్నది.

౨

మంగళేశ్వరుఁడు సింహాసనము నధిష్ఠించినప్పుడు చళుక్యుల రాజ్యము ఎక్కువ విస్తారమైనది కాదు. చళుక్యవంశమున మొదట స్వతంత్రముగ రాజ్యముసేయఁదొడఁగినవాఁడు మంగళేశ్వరుని తండ్రి యగు మొదటి పులకేశి, ఇతఁడు వాతాపీ పురమును జయించినట్లును, హయమేధాది యాగములను జేసినట్లును దెలియవచ్చుచున్నది.

"తస్యాభవత్తనూజః పొలకేశీ యః శ్రితేన్దుకాన్తి రపి;
శ్రీవల్లభో ప్యయాసీత్ వాతాపిపురీ వధూవరతామ్."

అని అయ్యవోళెశాసనము.[2] ఏవూరుశాసనమునందు కూడ నీవిషయమే వచింపఁబడియున్నది.

"తత్తనయః పులకేశీ కేశిసిషూనసమోఽభవద్రాజా,
వాతాపిపురీ వరపతి రకలితఖలకలికలంకకలః."[3]

మంగళేశ్వరుని శాసనములయందు ఇతఁడు యజ్ఞముల ననేకములను జేసి ప్రఖ్యాతి వడసినట్లున్నది గాని జయములచే కీర్తిని గడించినట్లు వచింపఁబడలేదు. కావున ఇతఁడు చేసిన ముఖ్యకార్యము వాతాపిని స్వాధీనము

1. A.,XIX P. 12. 2. E I., VI. 3. I. A. VIII P. 10.

చేసికొనుటయే. ప్రథమమున నీతఁడు కదంబరాజుల నాశ్రయించిన సామంతుఁడుగ నుండి తదనంతరము వాతాపిని సాధించి స్వతంత్రుఁడైనట్లు తోఁచెడిని. మొదటిపులకేశి కాలమున చళుక్యరాజ్య మొకచిన్న సంస్థానముగ నుండి యుండవలయును. ఇతని పుత్రుఁడగు మొదటికీర్తివర్మ కాలమున చళుక్యరాజ్యము విస్తరింప నారంభించెను. ఇతఁడు మూఁడువంశముల రాజులను జయించినట్లు అయ్యవొళె శాసనమునందు చెప్పఁబడియున్నది. వీ రెవ్వరన్నః

## ౧. నళులు.

చిరకాలమువఱకు నళవంశము చళుక్యశాసనముల మూలముననే మన కెఱుకపడుచు వచ్చినది. ఇటీవల ౧౧, ౧౨-వ శతాబ్దములనాఁటి నళరాజుల శిలాశాసనములు కొన్ని కళింగదేశమునందు దొరకినవి.[1] వానివల్ల నళరాజులు పూర్వసముద్రతీరమునందు ప్రభుత్వము జేసినట్లు తెలియవచ్చుచున్నది. కాని, కీర్తివర్మ దిగ్విజయము నేయుచు తూర్పు సముద్రతీరమును జేరి యచ్చట రాజ్యము నేయుచున్న నళరాజులను జయించెనని తలంపరాదు. ఆంధ్రదేశమున కర్నూలుమండలమున నలవాడి లేక నెలవాడియను విషయ మొక్కటియుండెను. ఈ నలవాడి కాపేరు నళవంశస్థులగు రాజులవల్ల వచ్చెననియు, అచ్చటి నళరాజులనే కీర్తివర్మ జయించియుండవలయు ననియు పండితుల యభిప్రాయము.[2]

## ౨. మౌర్యులు.

వీరు సర్వభారత చక్రవర్తులగు చంద్రగుప్తాశోకాదుల వంశీయులు. మౌర్యసామ్రాజ్య ముచ్ఛస్థితియం దున్నపుడు దక్షిణమునకువచ్చి యచ్చటనే నిలిచిపోయిరి, తరువాత కాలమున పశ్చిమతీరదేశములయందు

1. A. R. E. 1922. Para 1. 2. Ibid,

చిన్న చిన్న రాజ్యము లేర్పఱచుకొని రాజ్యము సేయుచుండిరి. మొదటి కీర్తివర్మచే జయింపఁబడిన మౌర్యులు కొంకణదేశస్థులు.

3. కదంబులు.

వైజయంతీపురమును ముఖ్యరాజధానిగ జేసికొని కుంతలము నేలిన రాజవంశమిది. పల్లవరాజగు మొదటి (శివ)స్కందవర్మ కాలమున నో, దానికి గొంచెము పిమ్మటనో, పల్లవులపైఁ దిరుగబడి వారిని పలుమాఱు పరాజితులను గావించి, తుదకు వారితో సంధిగావించుకొని, వారికి సేనానియై, మెప్పించి, వారివల్ల కుంతలమును బడసిన మయూర శర్మయను బ్రాహ్మణుఁ డీవంశమునకు మూలపురుషుఁడు. కదంబరాజ్యమును చళుక్యరాజులు క్రమక్రమముగఁ గబళించి నాశము జేసిరి.

ఈమూఁడు దేశములను మాత్రమే కీర్తివర్మ జయించినట్లు అయ్యవొళె శాసనమునందలి "నళమౌర్యకదంబ కాళరాత్రి, స్తనయ స్తస్య బభూవ కీర్తివర్మా" యను శ్లోకమువలన దెలియుచున్నది.[1] ఏపూరు శాసనమునందు సైతము పైమూఁడు దేశములనే జయించినట్లు చెప్పఁబడియున్నది.

"నళనిలయవిలోపీ, మౌర్యనిర్మాణ హేతుః,
ప్రథిత పృథుకదంబ, స్తంభభేదీ కుఠారః."[2]

అయినను, ఈతఁడు పెక్కుదేశములను జయించినట్లు మహాకూటశిలా స్తంభశాసనము పల్కుచున్నది. చూడుడు :

"వంగాఙ్గకలిఙ్గ వట్టూర మగధమద్రక కేరళ గఙ్గ మూషక పాణ్డ్య

1. Ep. Ind., VI. P. I. F.
2. I. A., VIII. P. 10.

ద్రమిళ చోళీయాళూక వైజయన్త్య ప్రభృత్యనేక పరనృపతిసమూహావ
మర్దనాలబ్ధవిజయే.' [1]

పై పట్టికయందలి 'వంగాఙ్గకళిఙ్గ' దేశములు సుప్రసిద్ధములు. వట్టూర రాజ్యము దక్షిణదేశములోనిదైనను అది యెచ్చట నుండెనో చెప్పుటకు వీలుకాదు. పాటలీపుత్రము రాజధానిగా గల్గిన మగధదేశము సుప్రసిద్ధమే. అయితే దక్షిణదేశమున నార్కాటు మండలమునకు పూర్వము మగధమని పేరుండెను. అచ్చట పాటలీపుత్రమను పట్టణ మొక్కటి యుండెను. ఈ రెంటిలో కీర్తివర్మ యే మగధమును జయించెనో చెప్పుటకు వీలుగాదు. మద్రక మెచ్చటిదో యింకను గుర్తింపబడలేదు. పాణ్డ్యకేరళములు సుప్రసిద్ధములు. పాలయవేర్కాడు మొదలు దక్షిణపెన్న పర్యంతము వ్యాప్తమైన దేశమునకు ద్రమిళమని పేరు. దీని రాజధాని కాంచీపురము. పల్లవవంశస్థులగు రాజు లిచ్చట రాజ్యము సేయుచుండిరి. చోళీయ మను దేశము కావేరీతీరమున నురయూరు రాజధానిగాగల రాజ్యముగాదు. ఇప్పటి దత్తమండలమునకు యువనుఛ్వాంగను చీనాయాత్రికుని కాలమున "చోళీయ"మను నామ ముండినట్లందరొప్పుకొన్న విషయమే. మంగళేశ్వరుడు యువనఛ్వాంగునికంటె నొక్కతరము పూర్వీకుడనుట నిర్వివాదాంశము. కావున కీర్తివర్మ మంగళేశ్వరులనాటి "చోళీయము" యువనఛ్వాంగు నాటి "చోళీయ" దేశమనుటకు సందియము లేదు. 'కొల్లమునకును (Quilon), కన్యాకుమారాగ్రమునకును మధ్యనున్న దేశమునకు మూషకదేశమను పేరున్నట్లు తోచుచున్నది' అని ఫ్లీటుగారనుచున్నారు. [2] ఆళుపులు చళుక్యులకు సామంతులైన ఆళుపులే వైజయన్తీపురము కుంతల

1. I. A., XIX, P. 17. 2. I. A, XIX, P. 14.

దేశముయొక్క ప్రధాన నగరము. దీనికి బనవాసి యను నామాంత రము గలదు. ఇది కదంబరాజులకు రాజధాని.

ఈపైపట్టికవల్ల కీర్తివర్మ భరతఖండమునందర్థభాగమును జయించి నట్లు తెలియుచున్నది. ఇతఁ డిన్నిదేశములను వాస్తవముగ జయిం చెనా? లేక తనయన్నయొక్క శౌర్యాతిశయమును బ్రకటించుటకై చెప్పుకొన్న ప్రగల్భవాక్యములా? నాకుఁజూడ నీపట్టిక యంత విశ్వా సార్హముగ దోచలేదు. వంగాఙ్గమగధ దేశములను కీర్తివర్మ జయించె నన్నమాట యతిశయోక్తి. నళవంశనృపాలుర శాసనములు కళింగమున నుండుటచేత "నళమౌర్య కదంబకాళరాత్రి" యగు కీర్తివర్మ కళింగ మును జయించియున్నను ఉండవచ్చును. మద్రక కేరళపాండ్యమూషక దేశములపై విజయమును సందేహాస్పదమే. ద్రమిళచోళీయాళూకవైజ యంత్యాది నరపతులను జయించి యుండవచ్చును. ఏలన, ఈదేశములు బాదామిరాజ్యమునకు చుట్టుప్రక్కల నుండినవి. తత్కారణమున నా రాజ్యములతోఁ జళుక్యులకు యుద్ధముపొసఁగి యుండవచ్చును. కావున కీర్తివర్మ నాఁటి చళుక్యరాజ్యవిస్తీర్ణమింతయని నిర్ధారణచేసి చెప్పుటకు వీలులేదు.

అయినను మంగళేశ్వరునిచే జయింపఁబడిన దేశములనుగూర్చి యెట్టిసందేహమును లేదు. ఈతని రాజ్యకాలములోని మొదటి ఐదివర్ష ములలో నితనికి ప్రసిద్ధులైన శత్రువులతో యుద్ధము పొసఁగ లేదు. ఏలన, బాదామిగుహాశాసనమునం దనేకశత్రువులను నిర్జించితి నని చెప్పుకొనెనే కాని ఆశత్రువులనుగాని, వారి రాజ్యములనుగాని పేర్కొనియుండ లేదు. బాదామిశాసనము వేయించినపిమ్మట చళుక్యులకు కలత్సురి వంశపు రాజులతో కయ్య మారంభమాయెను.

కలత్సురు లెవ్వరు? వీరు దక్కను పశ్చిమోత్తరభాగమున విస్తారమగు రాజ్యము నేలిన రాజవంశజులు.

"కలచ్చురిశకము వాడబడిన దేశములనుబట్టి చూడ వీరు సామ్రాట్పదమునంది లాటదేశమునకు ఉత్తరపు సరిహద్దుగనున్న కొంకణదేశములోని కిం నదివఱకో లేక మాహీ నదివఱకో వ్యాపించియున్న విస్తారమగు భూముల నేలిన నృపాలురు"

అని భండార్కరుగారనుచున్నారు. 1 కలత్సురిరాజులు శక్తిసంపన్నులగుటచేత తమ రాజ్యమును విస్తరింప బ్రయత్నములు చేయుచుండిరి. అట్టి ప్రయత్నమునందే తమ సర్వశక్తిని వినియోగపెట్టుచున్న చళుక్యరాజులతో వారికి కలహము సంప్రాప్తమగుట సహజము. రెండు రాజ్యములవారికిని కొంకణమున కలహ మారంభమయ్యెను. ఈ కలహమునకు గారణము సరిహద్దులను గూర్చిన యభిప్రాయభేదముగ నుండవచ్చును. కలహమునకు గాలుద్రవ్విన వారు కలత్సురు లగుటకు సంశయము లేదు. కలత్సురిరాజు శంకరగణుని పుత్త్రుఁడు బుద్ధరాజను వాఁడు చళుక్యరాష్ట్రముపై దండువెడలి యందలి కొన్నిభాగముల నాక్రమించుకొన్నట్లగపడుచున్నది. బుద్ధరాజు మహాబలవంతుఁడగు శత్రువు. అతఁడు 'గజతురగపదాతు'లను గలవాఁడు. "కోశబల సంపన్నుఁడు."[2] ఇంతేకాక, బుద్ధుఁడు చళిక్యసంభూతుఁడగు స్వామిరాజుతో సఖ్యముజేసి యతనిచేయూత గొని బాదామిచాళుక్యులతో సమరముసేయ సంసిద్ధుఁడాయెను. ఆకాలమున స్వామిరాజు మహాశూరుఁడని పేరువడసిన ట్లున్నది. ఇతఁడు "అష్టాదశసమరవిజయి" యట![3] ఈ చళిక్యస్వామిరా జెవ్వరో, అతఁడు చళిక్యవంశజుఁ డయ్యు బాదామిచాళుక్య

1. I. A., XL, P. 20. 2. I. A., VII, 161. 3. Idid..

లతో నేల పోరొనర్చెనో తెలియదు. ఇతనికిని, 'కియూరా' శాసనము నందు[1] వర్ణింపఁబడిన చళుక్యవంశమునకును ఏదో సంబంధమున్నట్లు తోఁచుచున్నది. అందు విజయసింహమహారాజును అతని కుమారుఁడు "...వల్లభరణవిక్రాన్త శ్రీ బుద్ధవర్మరాజు"ను పేర్కొనబడియున్నారు. "...వల్లభరణవిక్రాన్త" యను వాక్యము "పృథివీవల్లభరణవిక్రాన్త" యని యుండవలయును. "పృథివీవల్లభరణవిక్రాన్త" యనునది మంగళేశ్వరుని బిరుదు. సామంతప్రభువులు దమ యేలికలనామములను ధరించుట ప్రసిద్ధమైన విషయము కావున, కియూరదానపత్రములోని చళుక్యబుద్ధ రాజు మంగళేశ్వరుని భృత్యుఁడు. స్వామిరాజునకును, కియూరచాళుక్యులకును గల సంబంధ మెట్టిదైనను ఒక్కవిషయము నిశ్చయముగ దెలియుచున్నది. చళుక్యవంశమునకు మంగళేశ్వరుని కాలమున ననేక శాఖ లుండెను. కొంతవఱకు శాఖాన్తరవైరములుగూడ నుండెను. ఇవి నిర్వివాదాంశములు.

ఇట్లు రాష్ట్రముపై నెత్తివచ్చిన శత్రువుల నెదుర్కొని మంగళేశ్వరుఁడు వారితో యుద్ధముజేసెను. ఈయుద్ధమున స్వామిరాజు హతుఁడై వీరస్వర్గమునకు బోయెను. బుద్ధుఁడు పరాజితుఁడై చేయునది లేక వెన్నిచ్చి పాఱిపోయెను.[2]

అట్లు పాఱిపోయిన బుద్ధభూపాలుని విడువక, వెన్నంటి తఱుముచు, గొప్ప అశ్వసేనతో[3] మంగళేశ్వరుఁడు కళత్సురులరాష్ట్రమును బ్రవేశించెను. బుద్ధుఁడాతని నెదుర్కొని మరల పరాజితుఁడు కాఁగా, అతని ధనమంతయు మంగళేశ్వరునికి హస్తగత మాయెను.

---

1. I. A, VII, 248-9.
2. I. A., VII, P. 161.
3. E. I., VI, P. 1.

ఈవిషయమును గూర్చి మహాకూటశాసనమున నిట్లు చెప్పుకొని యున్నాఁడు:

"సగుత్తరాదిగ్విజయకృత బుద్ధి ర్బుద్ధనృప మవిజిత్య తస్య వసు మశేష ముపగృహ్య"[1]
ఇత్యాది.

ఈవిషయమునే రవికీర్తి మిక్కిలి సొంపుగ వర్ణించియున్నాఁడు.—

"స్ఫురన్మయూఖై రసిదీపికాశతై
ర్వ్యుదస్య మాతఙ్గతమిస్రసఞ్చయమ్,
అవాప్తవా న్యో రణరంగమందిరే
కట చ్చురి శ్రీలలనా పరిగ్రహామ్."[2]

మఱియు,

"రాజస్త్రీణాం పాతపతి రభూ ద్యశ్చ కాళచ్చు రీణాం"[3]

అను పూర్వ శాసనవాక్యమువల్ల పైవిషయము స్థిరపడుచున్నది,

కాళచ్చురి రాజులకు కొంకణదేశములోని యుత్తరభాగమును, పశ్చిమసముద్రాంతర్గతములగు ద్వీపములును కైవస మయియుండెను. ఈ ద్వీపములను జయింపక కొంకణముపై నధికారము నిలుపుకొనుట దుస్తరమగుటచేత, మంగళేశ్వరుఁడు తన నావికాదళముతో వానిని ముట్టడించెను. ఈద్వీపములలో ముఖ్యమైనది రేవతి. అతఁడు నావలచే నిర్మింపఁబడిన సేతువుపై సముద్రమును దాఁటి రేవతిం జేరెను. పట్టణము సులభముగ స్వాధీనము గాదాయెను. చాళుక్య నావికాదళము ముట్టడించి కొంతకాలమునకు దానిని లోబఱచుకొనెను.[4]

---

1. I. A., XIX, P. 18. 2. E. I. VI, P. 1.
3. I. A., VIII, P. 10.
4. E. I, VI, P. 1. & I. A., VIII, P. 10.

రేవతీద్వీపము కొంకణతీరమం దీకాలమున ముఖ్యస్థానముగ నున్నట్లు గన్పించుచున్నది. ఇది చళుక్యరాజులకు లోబడిన రాష్ట్రపాలకుని కొకనికి రాజధాని యాయెను. గోవాశాసనదాతయగు ధృవరాజ ఇంద్రవర్మ తన దానశాసనమున దన్నుగూర్చి యిట్లు చెప్పుకొని యున్నాడు.—

"శ్రీవిజయ రేవతీ ద్వీపస్థితేన శ్రీపృథివీవల్లభ మహారాజానుజ్ఞాతేన విషయమణ్డల చతుష్టయాధిపతినా"

ఇత్యాది.

ఇందువల్ల మంగళేశ్వరుఁడు కొంకణదేశమును, తత్సమీప సముద్రాంతర ద్వీపములను జయించుటయే కాక, వానిని చళుక్యరాజ్యమునందు గల్పుకొనె నని తెలియుచున్నది.

తదనంతరము ఉత్తరదేశముపై దాడివెడలి భాగీరథీకూలమున కీర్తిజయస్తంభమును స్థాపించుట కుద్యమించి మొదట ధర్మజయస్తంభమును నెలకొల్పుట మేలని చింతించితినని మహాకూట శాసనమున మంగళేశుఁడు వచించియున్నాఁడు.[1] ఈ దిగ్విజయము నడిచెనో లేదో తెలియదు.

మంగళేశునిచే నోడింపఁబడిన బుద్ధరాజు రెండవపులకేశి రాజ్యారంభకాలమున జీవితుఁడై యున్నట్లు సరస్వతిశాసనమువల్ల[2] దెలియుచున్నది. కళత్సురిరాజ్య మంతరింపలేదు. అందలి రాష్ట్రములను కొన్నింటిని చళుక్యులు స్వాధీనపఱచుకొన్నను రాజ్యము సంపూర్ణముగ నశింపలేదు. క్రీ. శ. ౬౧౦ లో నిచ్చిన సరస్వతిశాసనమున నతఁడు త న్నిట్లు పొగడుకొనియున్నాఁడు.—

1. I. A , XIX, P. 18. 2. E. I., VI, 294.

"ప్రబలరిపు బలోద్ఘాతదర్ప విభవ ప్రధ్వంసహేతుః"

మఱియు,

"రాజసామన్త భోగిక విషయపతి రాష్ట్ర గ్రామ మహత్త రాధికారి కాదీన్ సమాజ్ఞాపయతి."

ఇందుమూలమున కళచుర్యరి రాజ్యవైభవము కొంతమట్టుకు దెలియుచున్నది.

మంగళేశ్వరుడు శత్రువులను నిర్జించి సుఖముగ చిరకాలము రాజ్యము చేసెను. కాని, రాజ్యాంత్యకాలమున నాతని కొక ప్రబలమైన శత్రువుతో పోరాటము సంభవించెను. రాజకుటుంబమునం దంతః కలహము లుత్పన్నము లాయెను. మొదటి కీర్తివర్మకు ముగ్గురో నలుగురో పుత్రు లుండిరనియు, అం దగ్రజుని పేరు పులకేశి యనియు ఇంతకు పూర్వమే వచించియున్నాను. పులకేశి పెద్దవాడై నిర్వాహకుడై యుండెను. తనపినతండ్రి మరణానంతరము రాజ్యము తనదేయని యాతడు దలపోయుచుండెను. కావున నే తన్ను యౌవరాజ్యమునకు పట్టాభిషిక్తుని జేయవలయునని కోరెను. అసూయచే మంగళేశ్వరు డందుల కంగీకరించక తనపుత్రునికే రాజ్యము నొసఁగదలంచి, పులకేశిని రాజ్యమును వెడలనడిచెను. అట్లు దేశభ్రష్టుడై, పులకేశి యన్యదేశముల సంచరించుచు, స్వబుద్ధిబలముచేత నన్య రాజుల సహాయము నార్జించి తన పినతండ్రిపై దండు వెడలెను. మంగళేశునకు పులకేశితో యుద్ధము కొంతకాలమువఱకు నడిచెను. ఒక ఘోరసమరమున మంగళేశ్వరుడు వధింపఁబడెను. [1]మంగళేశుని మరణము శ. 533 నందు జరిగియుండవలయునని చరిత్రకారు లూహించుచున్నారు. అంతటితో యుద్ధము

1. E. I., VI, P. 1.

సమాప్తమాయెను. రెండవ పులకేశి బాదామిపట్టణమున రాజ్యాభిషిక్తుఁడాయెను.

మంగళేశ్వరుని మతము.

ఇతఁడు వైదికమతాభిమాని యగు వైష్ణవుఁడు.

"అగ్నిష్టోమాగ్నిచయన వాజపేయ పౌండరీక బహుసువర్ణాశ్వమేధావభృతస్నానపవిత్రీకృత శరీరాణామ్ చళుక్యానాం వంశే"

అను బాదామి గుహాశాసనము[1] లోని వాక్యమాతని వైదిక మతాభిమానమును దెల్పుచున్నది. ఇతని తండ్రి యగు మొదటి పులకేశియు నీపై జెప్పిన యజ్ఞముల నన్నిటిని జేసినట్లు శాసనములు పల్కుచున్నవి.[2] నేరూరు శాసనములో మొదటి పులకేశి పై యజ్ఞముల నన్నింటిని, మహాకూటశాసనములో[3] కీర్తివర్మ "బహుసువర్ణాగ్నిష్టోమ"ములను జేసినట్లు వర్ణింపఁబడియున్నది. దీనినిఁబట్టి చూడఁగా మంగళేశ్వరుఁడు యజ్ఞములను చేయనట్లు తోచుచున్నది. చేయకున్నను తానట్టి గొప్పవారి వంశమున బుట్టితినని విశేషముగ జెప్పుకొనుటచే నతనికి వైదిక క్రియలయందు గొప్పగౌరవము గలదను నూహ పొడముచున్నది.

మఱియు నేరూరు శాసనములో దాను "పరమభాగవతుఁడ"నని చెప్పుకొనుటయేకాక "కార్తికద్వాదశ్యాం కృతోపవాసే నార్చిత విష్ణునా" యని వచించియుండుటవల్ల నాతఁడు వైష్ణవుఁ డనియును, ఏకాదశీవ్రతము ననుష్ఠించువాఁ డనియును తెలియుచున్నది. "పరమభాగవతో లయనే మహావిష్ణుగృహం కృత్వా" యను బాదామిగుహాశాసనములోని వాక్యముగూడ నాతని వైష్ణవమతాభిమానమును జాటు

1. I. A. III, 305.

2. I. A., VII, 161.

చున్నది. ఇతనికి బాలకృష్ణునియం దభిమానము మెండు. పై జెప్పిన బాదామి విష్ణ్వాలయమునందు శ్రీకృష్ణభగవానుని బాలక్రీడలన్నియు ప్రతిమారూపమున జెక్కఁబడియున్నవి. ఇంతేకాక మహాకూటశాసనమున దన తండ్రిని వసుదేవునితోడను, తల్లులను రోహిణీదేవకులతోడను, అన్నను బలరామునితోడను, తన్ను కృష్ణునితోడను బోల్చుకొనుటయు నతఁడు శ్రీకృష్ణుని భక్తుఁడనియు, వైష్ణవుఁ డనియును తెలియఁజేయుచున్నవి. అయితే, 'శివ' శబ్దోచ్చారణమాత్రమున చెవులను మూసికొను వీరవైష్ణవుఁడు గాఁడు. ఏలన, మకుటేశ్వరనాథునికి గొన్ని గ్రామముల నిచ్చినట్లతని మహాకూటశాసనమువల్ల దెలియుచున్నది. కావున, విష్ణువే ఆదిదేవుఁడని నమ్మకము గలవాఁడయ్యు, పరమశివునియం దనాదరణబుద్ధి లేక, ఆ దేవునిఁ గూడ నీతఁ డర్చించుచుండెనని గ్రహింపవలసియున్నది.



ప్రథమసంవత్సర ఫాల్గునమాస భారతినుండి పునర్ముద్రితము.

చెన్నపురి : చంద్రికా ప్రెస్సున ముద్రితము.—1948. డిసెంబరు.